# అజేయులు

[ స్టాలిన్ బహుమానంపొందిన ప్రసిద్ధ నవల ]

★

రచన :- ఈ. కజకోవిచ్

అనువాదం :- నవకుమార్

★

విశ్వవాణి పబ్లికేషన్స్,
గుంటూరు - 2.

# ౧

అదివొక అంతూపంతూలేని కీకారణ్యాం. దానిలో ఒక సైనికదళం విసుగు విరామంలేకుండా ముందుకు సాగి పోతూంది. అంధకారంవలె అలముకున్న ఆయడవిలో పోను పోను ఆదళం లీనమై పోసాగింది.

అక్కడే జర్మనుటాంకులు, విమానాలు, ఇంకా ఆ జిల్లాలో వ్యాపించివున్న ఇతర బందిపోటుముఠాలు అపజయం పొందాయి. యుద్ధంవలన ఆ అడవిలోవున్న రోడ్లన్నీ ధ్వంసమై పోయాయి. కాని ఆ అడవి నేడక్కడ అజేయమైనది. మంచు కురవటం, మంచుగడ్డకట్టటం ఆగిపోయింది. భోజన సామాగ్రి, మందుగుండుసామాన్లుగల ట్రక్కులు చాలా దూరాన అడవి అంచున చిక్కుబడిపోయాయి. అంబులెన్సుకారులు, అడవిలో బిక్కుబిక్కుమంటూ అక్కడక్కడా వున్న పల్లెల్లో ఆగి పోయి వున్నాయి. ఫిరంగిదళంవద్దవున్న వంటచెఱకు అయి పోయింది. వాళ్ళ ఫిరంగులుకూడా వూరూపేరూలేని దూరంగా వున్న నదుల గట్లవెంటపడివున్నాయి. భూసైన్యానికీ వాటికీ మధ్యనున్న దూరం క్షణక్షణానికీ పెరిగిపోతుంది. ముందు పోతున్న భూసైన్యం అవాంతరాలేవీ లెక్కచేయకుండా ముందుకే సాగిపోతుంది. పోనుపోను నడక సన్నగిలింది. ఆత్మవిశ్వాసం తగ్గినకొద్దీ మనుషులకు అలసట అధికం కాజొచ్చింది. సరిగ్గా ఈ అవకాశం చూసుకుని జర్మనులు, మిగిలిన సామాగ్రినంతటినీ అక్కడే పారవేసి బరువు తగ్గించుకుని పడమటిదిక్కుగా పారిపోయారు.

శత్రువులు జాడచిక్కకుండా మాయమైపోయారు. శత్రుసైన్యాలను ఎదుర్కొని పోరాడవలసిన పనిలేకపోయినప్ప టికీ భూసైన్యం తన ఉనికిని కాపాడుకునేందుకుగాను తనపనిని యథావిధిగా కొనసాగించటానికే నిర్ణయించుకుంది. శత్రువుల నుంచి జయించి స్వాధీనంచేసుకున్న హద్దుల్ని కాపాడుతూ వున్నారు. అక్కడ నేలంతా శత్రువులచేత నరుకబడిన స్కౌటుల (సైన్యాల్లో పనిచేసే గూఢచారులు) తలలు చిందరవందరగా పడివున్నాయి. అక్కడ పడివున్న ఆముఖాల్లో కన్పించే హృదయ విదారక దృశ్యానికి దానికదేసాటి. వారి మనుగ డంతా వ్యర్థమై పోయిందా అన్నంతగా వారు దిగాలుపడిన ముఖాలతో, భారంగావున్న శూన్యహృదయాలతో రోడ్డు ప్రక్కగా నడుస్తున్నారు.

ఈ విధంగా నడుస్తూవున్న ఒకదళం చెంతకు డివిజను కమాండరు కర్నల్ సర్బిచెంకొ జీపులో వచ్చి ఆగి నెమ్మదిగా జీపునుంచి దిగాడు. నడుంమీద చేతులు ఆనించుకుని బురదగా వున్న ఆ రోడ్డుమధ్య నిలబడ్డాడు. ఆయనముఖంలో హేళనతో కూడిన చిరునవ్వు కన్పిస్తుంది.

డివిజను కమాండరును చూడగానే స్కౌటులందరూ అటెన్షనులో నిలబడ్డారు.

"వీరులారా! శత్రువులు మీచేతుల్లోనుంచి తప్పించుకు పోయారా? ఏం ? శత్రువులు ఎక్కడున్నారు? ఏంచేస్తున్నారు?" అని ఆయన ప్రశ్నించాడు.

లెఫ్టినెంట్ త్రివికిన్ ఆ దళనాయకుడని ఆయన గుర్తించాడు. కర్నల్ సర్బీచెంకోకు తన ఆఫీసర్ల ముఖాలన్నీ బాగా పరిచయమే. శత్రువును చేజిక్కించుకోలేనందుకు అసంతృప్తి, అసహ్యాంకలిగే తలపంకించుచూ పై ప్రశ్న వేశాడు.

"ఏం, నీవుకూడానా త్రెవకిన్?" అని ఆయన త్రివకిన్ నుద్దేశించి తీక్షణంగానే అడిగాడు– "ఈ యుద్ధమనేది వుంది చూశావ్, చాలా మజాయైనదిలే! పల్లెలలో పాలుత్రాగటము, కంటబడిన ఆడదానివెంటల్లాపడడము! అంతేగా! మీ ఘన కార్యంతో, మీదయవల్ల జర్మనీవరకు పోయినా శత్రుదర్శనం కాదు. ఎంత గొప్పగావుంటుంది?" అని తలవనితలంపుగా కలిగిన సంతోషంతో అడిగాడు.

లెఫ్టినెంట్ కర్నల్ గాలీవ్ డివిజనుకు చీఫ్ఆఫ్స్టాఫ్. అలసటతో కారులోకూర్చుని చిరునవ్వునవ్వుతున్నాడు. అకస్మాత్తుగా కర్నల్ సర్బీచెంకోలో కలిగిన హృదయ పరివర్తనకు ఆశ్చర్యపడుతున్నాడు. ఇంతకుముందు అంటే ఒకక్షణంక్రితం పొయ్యివద్దకూర్చుని చలికాచుకుంటూ తమ మందకొడితనానికి సర్బీచెంకో తనను చీవాట్లు వేస్తుంటే తాను ఆ నిశ్శబ్ద వాతావరణంలో మౌనంగా వింటూ కూర్చున్నాడు.

స్కాట్లుల్ని చూడటంవలననే కర్నల్లో ఈమార్పు కల్గింది. ఆయన 1915 లో భూసైన్యంలోని గూఢచార దళంలో మొట్టమొదటగా తన సైనికజీవితాన్ని ప్రారంభించాడు. గూఢచారదళంలోనే మొదటిసారిగా తుపాకిగుండ్ల సంస్కారం

కూడా కల్గింది. తరువాత సెంట్ జార్జి పతకాన్నికూడా పొందాడు.

సూర్యాస్తమయం కాబోతుంది. అడవంతా నిశ్శబ్దంగా వుంది. మరికొద్దిసేపటికి ఆ గుంటమిట్టలచాటున చీకటి ఛాయల్లో మరుగైపోతారు. నిశ్శబ్దంగా ఒకరివెనుక ఒకరు లైనుగా రోడ్డుప్రక్కనే నడుస్తున్నారు. వాళ్ళు ధరించిన ఆకు పచ్చని గూఢచారదుస్తులు, ఎండలో కాలి వాడిన ఆ ముఖా లను చూసి ఆయనహృదయంలో సంతోషమేకల్గింది.

డివిజను కమాండరుమాత్రం ఘాటుగానే చీవాట్లు వేశాడు. గూఢచారదళం గుప్పిటనుంచి శత్రువులు తప్పించుక పోవటమంటే, అంటే శతృవుకు అసలు పారిపోయే అవకాశం చిక్కనీయడమే చాలా అవమానకరమైన విషయం.

తమ డివిజను భవిష్యత్తునుగురించి కర్నల్ అన్న మాటలు వ్యధ చెందుతున్న హృదయాన్ని వ్యక్తంచేస్తున్నాయి. సైన్యంలో ఒకభాగం వెనుకవుండిపోయింది; మిగిలిన కొద్ది మందితో శతృవును ఎదుర్కొనుటకు భయపడుతున్నారు. కాని దానితోపాటు తమనుంచి తప్పించుకొని పారిపోయిన శతృవుల్ని వెంటాడి పట్టుకుని పోరాడాలనే కోర్కెకూడా గాఢంగావుంది. తానెటువంటివాళ్ళను ఎదుర్కొంటున్నాడో, తన ఓర్పెమిటోకూడా తెలుసుకోవాలని ఆతనికాంక్ష. చుట్టూ ప్రశాంతంగావుంది. కొద్దిసేపు ఆగి మనుషుల్ని, ఆయుధాల్ని సరిజేసుకోవాలి. ముందుకుసాగాలనే దేశప్రజలందరి ప్రబల

వాంఛ. కాని తన నిర్ణయం దానికి విరుద్ధమని తన మనస్సులో కూడా అంగీకరించడనేది నిజం. అయినప్పటికి యుద్ధరంగంలో అతడు కొద్ది క్షణాల విశ్రాంతినిగురించి కలలు గంటున్నాడు, అసలు ఈవృత్తిలోవున్న రహస్యాలే ఇటువంటివి.

సైనికులు శాంతంగా కొంతసేపు కుడికాలిమీద, కొంత సేపు ఎడమకాలిమీద నిలబడుతూవున్నారు. అది చాలా బాధాకరమైన దృశ్యం.

డివిజను కమాండరు జీపునెక్కుతూ గాలీవ్ (డివిజను చీఫ్‌ఆఫ్‌స్టాఫ్) నుద్దేశించి, "అవిగో-నీ కళ్ళు, చెవులు," అని చాలా తిరస్కారంగా మాట్లాడి జీపునెక్కాడు. అతనిజీపు ముందుకు వెళ్ళిపోయింది.

ఒకక్షణం వరకు స్కౌటులావిధంగానే నిలబడ్డారు. తరువాత త్రెవకిన్ నెమ్మదిగా ముందునడచాడు. మిగిలిన వాళ్ళుకూడా అతనివెనుకనే బయలుదేరారు.

ఎప్పటివలెనే ఏమాత్రం ధ్వని విన్పించినా త్రెవకిన్ చెవులు రిక్కించి వింటూ తన దళాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. కమాండరులోవలె అతనిలోకూడా శత్రువును ఎదుర్కోవాలనే కాంక్ష, తగినంతమంది లేరనే భయమూ వున్నాయి. ఎదుర్కోనడం తమ కర్తవ్యమనీ, అలాచేయకపోతే సోమరితనమూ, అజాగ్రత్తఅనే అపాయాల్లో పడిపోతామనీ తెలుసు. అందుకే ఎదిరించాలనే కోర్కె. మొదట యుద్ధప్రారంభంలో

తనదళంలోవున్న 18 మందిలోనూ మిగిలివుంది 11 మంది మాత్రమే. అందుకే భయంకలుగుతుంది. వీరిలో గొప్ప వీరులున్నారనేది నిజమే. డివిజను మొత్తంమీద ఆనీకానోవ్ ప్రసిద్ధవ్యక్తి; భయమనేదే తెలియనివాడు మర్చెంకో; మమోచికన్ సాహసంలో పెట్టిందిపేరు; ఇక బెజీనీకోవ్ దళం మొత్తంలో ఎక్కువ అనుభవంగలవాడు. ఇటువంటి హేమా హేమీలంతా వున్నారు. మిగిలినవాళ్లెక్కువమంది రైఫిల్ వీరులు. వీళ్లు యుద్ధసమయంలో విభిన్న యూనిట్లనుంచి ఈ దళంలోకి వచ్చారు. వాళ్ళకు గూఢచారదళంలో వుండడం ఇప్పటివరకు ఇష్టమే- చిన్నచిన్న దళాలుగా ముందుకు సాగుతున్నారు. ఒక చిన్న భూసైన్యంలో సాధ్యపడవంత స్వాతంత్రాన్ని అనుభవిస్తున్నారు. వాళ్ళకు పేరు ప్రఖ్యాతులున్నాయి. అందరూ గౌరవిస్తున్నారు. సహజంగా ఇది సంతోషించదగ్గదే; వాళ్ళంతా పిడుగులవంటివారే, ఇంకా అగ్నిపరీక్షల్లో నెగ్గాలి.

నడక సన్నగిలటానికి ఇదేకారణమని త్రెవకిన్ గ్రహించాడు. డివిజనుకమాండరు చీవాట్లు అంకుశంపోటువలె పని చేశాయి. స్కౌటులంటే కర్నల్ సర్బీచెంకో కెంతప్రేమ వుండేదో త్రెవకిన్‌కు పూర్తిగా తెలుసు. కర్నల్‌యొక్క ఆకుపచ్చని కళ్ళలోని, నక్కజిత్తులు గత యుద్ధంలోని తల నెరసిన, అనుభవశాలురైన గూఢచారులను స్ఫురింపజేస్తున్నాయి- వాళ్లను వేరుచేసే కాలము, సమయమనే కందకాల కావలివైపునుంచి కార్పోరల్ సర్బీచెంకో- "యువకు

ల్లారా! ఒక గతకాలపు నేర్పరియైన వృద్ధుణ్ణి మీరెంతవరకు ఎదిరిస్తారో చూద్దాం!" అని హెచ్చరించే భావంకూడా ఆ కళ్ళల్లో వ్యక్తమవుతుంది.

ఇంతలో దళం పశ్చిమ యుక్రైన్‌లోని ఒక పల్లెకు చేరుకుంది. గ్రామంచుట్టూ పొలాలు, తోటలూ వున్నాయి. ఇళ్లు అక్కడొకటీ అక్కడొకటీ ఉన్నాయి. షుమారు మూడు నిలువుల ఎత్తునుంచీ సిలువవేయబడిన క్రీస్తుప్రభువు క్రిందికి చూస్తున్నాడు. రోడ్లన్నీ నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగావున్నాయి. దొడ్లల్లోవున్న కుక్కలు అరవడంమాత్రం మధ్యమధ్య విన్పిస్తుంది. కిటికీలకువున్న చేతి అల్లిక తెరలు అతిప్రయాసమీద గాని కానరావటంలేదు. దీనంతటినిబట్టి బందిపోట్ల గుంపుల వలన భీతిజెందిన గ్రామీణులు, సైనికులు తమ గ్రామంలో నుంచి పోవటం చూస్తున్నారనేది తోస్తుంది.

త్రెవకిన్ తనదళాన్ని మిట్టమీద ఏకాంతంగావున్న ఒక ఇంటికి తీసుకువెళ్లాడు. ఒక వృద్ధస్త్రీ తలుపు తెరచింది. తనను వెన్నంటియున్న ఒక పెద్దకుక్కను వెనక్కిపడద్రోసి వేళ్లాడుతున్న బూడిదరంగు కనురెప్పలలోపల లోతుగావున్న కళ్ళతో సైనికులవంక చూసింది.

"అంతా కుశలమేనా?" అని, "మేము ఒకటి రెండు గంటలు విశ్రాంతి తీసుకుందామని వచ్చాం," అని త్రెవకిన్ చెప్పాడు.

దళసభ్యులందరూ అతనివెనుకనే ఒక పరిశుభ్రమైన గది లోనికి వెళ్లారు. ఆగదినేలంతా గచ్చుచేయబడి రంగువేయబడి వుంది, అక్కడ లెక్కలేనన్ని విగ్రహాలున్నాయి. ఈ ప్రాంతంలో వాడుకగావున్న విగ్రహాలు, రష్యాలో ప్రచలితంగా వున్న విగ్రహాలకు భిన్నమని వాళ్ళు గమనించారు. ఉబ్బెత్తుగా వుండే లోహపు మానవాకారపు విగ్రహా లచ్చటలేవు, అవన్నీ వేరువిధంగా వున్నాయి. ఇక ముసలిఅవ్వ విషయంజూస్తే, కీవ్, చర్నిగోవ్‌కు చుట్టుపట్ల వుండే యుక్రేన్ అవ్వవలె కన్పిస్తుంది. చిన్నచిన్న నేతకోటులు ఒకదానిమీద ఒకటి ధరించింది. ఎముకలు పొడుచుకువచ్చిన చేతులు. పోతే వాళ్ళకు ఆమెకు మధ్యవున్న భిన్నవిషయం- ఆమె చురుకైన కళ్ళలో మైత్రి విరుద్ధమైన భావం గోచరిస్తుంది.

అతికఠోరమైన, అంటే దాదాపు శతృత్వంతో కూడిన మానం వహించినప్పటికి సైనికులకు తాజా రొట్టెలు, మంచి మీగడపాలు, తెల్లగుమ్మడికాయ పాకం, ఉడకబెట్టిన బంగాళా దుంపలు ఇచ్చింది. ఆహారం ఇవ్వటంలో కూడా ఆమెలో కన్పించిన మైత్రీ విరుద్ధభావం, కఠోరతవలన ఆహారం వాళ్ల గొంతులకు అడ్డం పడసాగింది.

ఒకస్కౌటు గొణుగుతూ, " ఈమె, ఏ దొంగలకో చెందిన ముసల్ది " అన్నాడు.

అతనిమాట కూడా సగంనిజమే. ఆమె చిన్నకొడుకు అడవిలో ఒక బందిపోటు ముఠాతో కలిశాడు. ఇక పెద్దకొడుకు

జర్మనులకు వ్యతిరేకంగా పోరాడే పార్టీలో అంటే సోవియట్ గెరిల్లాలలో చేరాడు. బందిపోటు తల్లి విరుద్ధభావంతో, కఠోరమైన మౌనందాల్చింది. గెరిల్లా తల్లి అతిథి సత్కార భావంతో సైనికులకు తనద్వారం తెరిచింది. వాళ్ళకు పంది మాంసపు వేపుడుతోసహా వడ్డించిన తరువాత గెరిల్లా మాతృ హృదయంలో, బందిపోటు మాతృహృదయం ప్రవేశించింది. మరల ఆదుష్ట మౌనమే వహించి సగం గదిని ఆక్రమించివున్న మగ్గం ముందుకువెళ్ళి కూర్చుంది.

అనీకానోవ్ చిన్నవాడు, చతురుడు; పెద్దనోరు; తీక్షణ మైన కళ్ళుగల సాహసవంతుడు; "అవ్వా, మౌనంగా వున్నా వేం? మాట్లాడవేం? నోట్లో నాలుకలేదా? కాస్త ఇటువచ్చి కబుర్లుచెప్పు", అని పలుకరించాడు.

ఒకక్కపల్చగా ముందుకు వంగబడివుండే బలిష్ఠుడైన సార్జెంటు మమోచకిన్ అందుకుని, "ఓహోహో! ఏమిస్త్రీ సంతానంగత్యాభిలాషిరా! ముసలిదానిదగ్గరగూడా బడాయిలు ........" అని వ్యంగ్యంగా అన్నాడు.

తన ఆలోచనలలో మునిగివున్న త్రెవకిన్ వెలుపలకు వెళ్ళి ఒకచోట నిలబడ్డాడు. గ్రామం కునికిపాట్లు పడుతుంది. కాళ్ళు కట్టబడిన గుర్రాలు ఒకచోట మేస్తున్నాయి. యుద్ధం జరిగేటప్పుడు ఇరుపక్షాల తీవ్రమైన తాకిడికి గురియైన గ్రామం వలె గ్రామమంతా అగాధమైన నిశ్శబ్దంలో మునిగివుంది.

2

"మన లెఫ్టినెంట్ చాలా విచారంగా వున్నాడు. కర్నల్ అంది ఏమిటి? ఈయుద్ధం చాలా మజాయైనది, గ్రామాల్లో పాలుత్రాగటం, ఆడవాళ్ళ వెంటపడటం," అని త్రెవకిన్ బయటకు వెళ్ళగానే ఆ నీకానోవ్ అన్నాడు.

దానితో మమోంచికిన్ రయ్‌మంటూ లేచాడు, "డివిజను కమాండరు చెప్పినదానికీ నీకూ ఏమీ సంబంధంలేదు. అనవసరంగా నీ జోక్యమేమిటి? నీకు పాలు అవసరం లేకపోతే త్రాగబోకు, మానుకో; అదిగో, అక్కడ బొక్కెన నిండుగా నీళ్ళున్నాయి, త్రాగు. ఆమాటఆయన లెఫ్టినెంట్ నుద్దేశించి అన్నాడు. ప్రధానకార్యాలయంలో జరిగేవాటికి ఆయనే బాధ్యుడు. ఆ వకాల్తా పుచ్చుకోవాలనుకుంటున్నావా? నీవిషయం నీకు తెలుసా ? వట్టి పల్లెటూరి జైతువు, పల్లెటూరి జైతు. నిన్ను నేను కర్బలో పట్టుకోగలిగివుంటే గుడ్డలన్నీ విప్పి చేపలకు మేపేవాడిని.

ఆ నీకానోవ్ సద్భావంతో నవ్వాడు.

"అయితేకావచ్చు. ప్రజల గుడ్డలు విప్పటంలో నీవు మొనగాడవు. తిండిలోకూడా దిట్టవు. కర్నల్ అందికూడా ఇదే."

"అయితే ఏమోయ్ ?" మామూలుగా ఆ నీకానోవ్‌లోవున్న ధైర్యాన్ని చూసి మమోంచికన్ ఎప్పటిమాదిరిగానే రెచ్చిపోయి, "తినటంలో తప్పేమిటి ? మంచి బుర్రగల

గూఢచారి జనరల్‌కంటే ఎక్కువే తింటాడు. బాగా తినేవాళ్ళే ఎప్పుడూ ఎక్కువమంది వీరులూ, గొప్ప నేర్పుగలవాళ్లై వుంటారు. తెలిసిందా ? " అన్నాడు.

శాంతంగా తూచినట్లు మాట్లాడే ఆ నీకానోవ్ మాటల్ని, వేడి వేడిగా అగ్నిపర్వతం పగిలినంతగా హంగామాచేసి మాట్లాడే మమోచికిన్ మాట్లాడిన తీవ్రమైన మాటల్ని విని, ఎర్రని బుగ్గలు, బంగారు జుత్తుగల బ్రెజినీకోవ్; మచ్చల శరీరం గల బాయ్‌కోవ్, 17 సంవత్సరముల యువకుడు గోలూబ్; పొడగరి, తగిన అందగాడూ అయిన ఫేవోకటిస్టోవ్‌న్యూ; అంతా చిరునవ్వు నవ్వారు. కాని వాళ్ళందరిలోనూ విశాలమైన భుజాలు, తెల్లగా మెరిసే పలువరస, శ్యామవర్ణంగల మగ్నెంకో మగ్గంముందు కూర్చున్న ముసలి అవ్వదగ్గర నిలబడి, మాంస విహీనమైన ఆమెచేతుల్ని తదేకధ్యానంతో చూస్తూ, సహజంగా పట్టణ వాసులకు కలిగే ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ, " అరే, ఇది నిజంగా ఫ్యాక్టరీయేనే? " అన్నాడు.

మమోచికిన్‌కు, ఆనీ కానీవ్‌కు జరిగే చర్చ లన్నింటిలోనూ- అది నవ్వుగాని, కోపంగాగాని; ఏవిషయంలోనైనా సరే అంటే " చర్చలోని హేరింగ్ చేపలు మంచివా లేకపర్చ్ చేపలా? " సోవియట్ జర్మనీల టామీగన్లలో ఎవరివి శ్రేష్టమైనవి? హిట్లరు పిచ్చివాడా లేక దుర్మార్గుడా ? రెండవ దండయాత్ర ఎప్పుడు ప్రారంభమవుతుంది ? అనేవిషయాలవరకు మమోచికిన్ ఎప్పుడూ వ్యతిరేకంగానే వాదించేవాడు. తన

చురుకైన చిన్నికండ్లతో చురచుర చూస్తూ, ఆ నీకానీవ్‌ను శాంతంగానే తీవ్రంగా వ్యతిరేకించి, ఏదేదో మాట్లాడి తన ధైర్యాన్ని కనబర్చి ఏదోవిధంగా ఆ చర్చలనుంచి బ్రతికి బయటబడేవాడు.

త్వరగా రెచ్చిపోయి, అతిగా కలహించే స్వభావంగల ముక్కోపి మమోంచికిన్ ఆ నీకానోవ్‌లో వున్న గ్రామీణ శాంతస్వభావాన్ని, సున్నితమైన సహృదయాన్ని చూసి మరీ రెచ్చి కోపంతో మండిపడ్డాడు. ఈ కోపంలో ఈర్ష్యకూడా దాగివుంది. తనకు ఒక పతకం ఇచ్చారు. కాని అదేసమయంలో ఒక 'ఆర్డరు' ద్వారా ఆనీకానీవ్‌కు సన్మానం జరిగింది. కమాండరు ఆనీకానోవ్‌ను తనతో సరిసమానంగా చూసుకుంటాడు. తననేమో పరాయివాడిగా చూస్తాడు. ఆనీకానీవ్ యందు ఇంత విశ్వాసం వుండటానికి అతను కమ్యూనిష్టుపార్టీ సభ్యుడు కావడమే కారణమని వూహించుకునిగూడా సంతృప్తి పడేవాడు. మనస్సులోకూడా అతనిలోవున్న గంభీరమైన సాహసాన్ని మెచ్చుకునేవాడు. మమోంచికన్‌లో వున్న ధైర్యసాహసాలుకూడా చాలావరకు ఒక ప్రత్యేకపద్ధతిగలవే, వాటి నెప్పుడూ అహంకారంద్వారా కాపాడుకోవాలి. ఈవిషయం అతనికే తెలుసు. అతనిలో అవసరానికి మించిన అహంకారం వుంది; మంచి గూఢచారియని ఖ్యాతిజెందాడు. అత్యంత ప్రాముఖ్యతగల 'గొప్పపనుల్లో' తానుకూడా పాల్గొన్నాడు. కాని అందరిలోను ఆనీకానీవ్ ఎక్కువగా రాణిస్తూ వుండేవాడు.

'పనుల' మధ్యసమయంలో మమోాచికన్ అందర్నీ మించేవాడు. ఇంతకుముం దెప్పుడూ యుద్ధరంగం ముఖ మెఱుగని గూఢచారు లతన్ని తెగపొగిడేవారు. వదులుగా, అందంగావుండే పంట్లాము, మంచి చర్మంతో తయారయిన బూడిదరంగ బూటులువేసుకుని రొమ్మువిరుచుకు తిరుగుతూ వుండేవాడు. చొక్కా కాలరెప్పుడూ లేచేవుండేది. తెల్లగా వెండివలె మెరిసే కజ్జాక్ ఉన్ని టోపీక్రిందినుంచి నల్లని క్రాపు ముఖంమీాదపడుతూ వుండేది. దైత్యాకారం, విశాల బాహువులు గల నిరాడంబరుడైన ఆనీకానీవ్ కు అతనికి పోలికేమి కుదురుతుంది ?

యుద్ధానికి పూర్వం ప్రతిమనిషిజీవితము వారిపనుల్లోనూ, నడతలోనూ మరపురాని ప్రభావాలను అచ్చుగుద్దింది-సైబీరియాలోని సామాజికరైతు ఆనీకానీవ్ లోవున్న గంభీరమైన ఆత్మవిశ్వాసము, ఉక్కుముక్కవలె పనిచేసే మర్చెంకో నిర్మాణబుద్ధి, పీతల్ని పట్టడంలో గురితప్పని మమోాచికీన్ దుస్సాహసము మొదలైనవన్నమాట. కాని గత మిప్పుడు గగన కుసుమంవలె తోస్తుంది. యుద్ధ మింకా ఎంతకాలం సాగుతుందో వాళ్ళకు తెలియదు. వాళ్లు పూర్తిగా సమరంలో లీనమైపోయారు. యుద్ధమే వారి జీవిత దినచర్యయైంది; దళమే వాళ్ళ కుటుంబము !

కుటుంబం ! చాలా విలక్షణమైన కుటుంబం ! దాని లోని సభ్యులు తమకు లభించే జీవితఫలితాలను వేటినీ అందరూ

కలసి అనుభవించలేకపోతున్నారు. కొందరు హాస్పటల్లో చేర తారు, మరికొంతమంది మరెప్పుడూ తిరిగిరాకుండా శాశ్వ తంగా వెళ్ళిపోతారు. ఈకుటుంబానికి చిన్నదైనా, మధుర మైన -తరతరాలుగా- ఒకతరాన్నుంచి మరొకతరానికి స్థల మార్పుతో వస్తూవున్న ఒకచరిత్ర వుంది. ఆనీకానీవ్ మొట్ట మొదట దళంలో ఎలాచేరాడో కొంతమందికి తెలుసు. చాలా కాలం గడచిపోయింది. అతన్ని గస్తీకి తీసుకువెళ్ళారు. అతన్ని తమవెంట తీసుకుపోవటం పాతవాళ్లెవరికీ ఇష్టంలేదు. ఈ సైబీరియావాసి విశాలకాయం, గంబీర రూపం చాలా ఉపయోగపడేమాట నిజమే. అవసరమొస్తే ఇద్దరుమనుషుల్ని రెండుచేతుల్లోనూ గట్టిగా నొక్కి మరల లేవకుండా చేయ గలడు. ఒకవేళ యుద్ధరంగంలో గాయపడడం జరిగితే తాము ఎవరూ ఎత్తుకుపోలేనంత భారీమనిషని స్కౌటులు భయపడే వారు. "నేను గాయపడితే స్వయంగా నేనే పాకుకుంటూ వస్తాను. చనిపోతే నేనెలాపోతే మీకేం, చనిపోయిన తరు వాత జర్మనులు నన్నేంచేస్తారు? కనుక మీరు నన్ను మోయ వలసిన అవసరంలేదు," అని అతనెంతచెప్పుకున్నా ఫలితం లేకపోయింది. పైగా ఇంకొక పీడావచ్చింది. ఇది నిన్న మొన్న జరిగిన సంగతే. గాయపడిన లెఫ్టినెంట్ స్కవోర్ట్సోవ్ స్థానంలోకి లెఫ్టినెంటు త్రెవికిన్ వచ్చాడు.

తన మొదటిపోరాటంలోకి త్రెవకిన్ ఆనీకానీవ్‌ను వెంట తీసుకవెళ్ళాడు. ఈ 'దైత్యుడు' ఒక పెద్ద జర్మనీవాడిని చాలా నేర్పుగా పట్టుకొని లేపాడు, మిగతా స్కౌటులు గుడ్లప్పగించి

చూస్తూ నిలబడ్డారు. పెద్ద గండుపిల్లివలె చురుకుగా, నిశ్శబ్దంగా అతనీ పనిచేశాడు. ఆనీకానీవ్ చంకలో రైన్‌కోటు క్రింద ఒక జర్మనీవాడు గిలగిల తన్నుకున్నాడంటే త్రేవకిన్ నమ్మడమే కష్టమైపోయింది. ఈజర్మనీ 'గూఢచారిని' పట్టుకుంటానికి ఈదళం గత నెలరోజులుగా కలలుగంటుంది.

తరువాత సార్జెంట్ మర్చెంకో వెంట బయటకు వెళ్ళినప్పుడు ఆనీకానీవ్ ఒక జర్మను కెప్టెన్‌ను పట్టి బంధించాడు. మర్చెంకో కాలికి దెబ్బతగిలింది, ఆ ఆనీకానీవ్ ఇద్దర్ని తీసుకు రావల్సి వచ్చింది. అతనే శత్రువును, సహచరునికూడా కలిపి వాటువేసుకుని ఎవరికీ ఏమీ నొప్పిలేకుండా జాగ్రత్తగా తెచ్చాడు.

బాధలుపడ్డ స్కౌటుల వ్యధిత హృదయాలకు వాళ్ళ విజయాలు దీర్ఘరాత్రులందు ఆనందం కల్గించే ముఖ్య చర్చలవుతాయి. అవే క్రొత్తవాళ్ళకు భావచైతన్యాన్ని కల్గిస్తాయి, తమవిశిష్ట వృత్తికి గర్విస్తారు. కాని, కాని, శత్రువులకు దూరంగా, చేతినిండా పనిలేకపోవడంతో వాళ్లుచాలా నిరుత్సాహం చెందసాగారు.

కడుపునిండా భోజనంచేసి మమోచికిన్ వెనక్కి ఆనుకొని కూర్చుని సిగరెట్ ముట్టించాడు, " ఈరాత్రి యీగ్రామంలో గడపటానికి, కొంచెం వోడ్కా త్రాగడానికి, ఏమీ అభ్యంతరం వుండదు, " అన్నాడు.

"అవునవును, అంత తొందరమాత్రం ఎందుకు? వాళ్ల దగ్గరకు చేరటమే కష్టం, జర్మనులు చాలా వేగంగా పారిపోతున్నారు," అని అస్పష్టంగా గొణిగాడు.

అదే సమయంలో తలుపు తెరచుకొని త్రెవకిన్‌లోన ప్రవేశించాడు.

కాళ్ళుకట్టి వేస్తూవున్న గుర్రాలను చూపుతూ, "అవ్వా, ఆ గుఱ్ఱాలెవరివి? అని త్రెవికిన్ ప్రశ్నించాడు.

వాటిల్లో ముఖంమీద నక్షత్రం గుర్తువున్న బాదంరంగు పెద్దగుఱ్ఱం అవ్వది. మిగతావన్నీ ఇరుగుపొరుగువాళ్ళవి. ఇరువై నిముషాల్లో గుర్రములుగల పొరుగువాళ్ళందరూ అవ్వ ఇంటికి వచ్చారు. త్రెవకిన్ త్వరత్వరగా రసీదులు వ్రాసిఇస్తూ, "కావాలంటే మీలొక కుర్రవాడిని మాతోకూడా పంపుకొండి. మీ గుఱ్ఱాలన్నిటిని తిరిగి తోలుకు వస్తాడు," అని చెప్తున్నాడు.

ఈ తీర్మానికి రైతులంతా సంతసించారు. సోవియట్ సైన్యాలు త్వరితగతిని ముందుకు పోవటంవల్లనే హిట్లరు అత్యాచారాలబారినుండి గ్రామాలను, పశువుల్ని కాపాడారని వాళ్లకు తెలుసు. కనుక త్రెవకిన్ చెప్పినదాన్నెవరూ వ్యతిరేకించలేదు. వెంటనే ఒక యువక గుఱ్ఱపుకాతును వాళ్ళతో పంపాలని నిర్ణయించారు. గొఱ్ఱెచర్మపు కోటు వేసుకున్న ఆ పదహారేండ్ల పడుచువాడు తలవనితలంపుగా వచ్చిన ఈ భాధ్యతకు గర్వించాడు. కొంచెం భయపడ్డాడుకూడా. తరువాత గుఱ్ఱాలను

విప్పి నీళ్ళు తాపి, "గుఱ్ఱాలన్నీ సిద్ధంగా వున్నాయి," అని తెలియజేశాడు.

మరికొద్ది క్షణాలకు పన్నెండుమంది గుఱ్ఱపురౌతులు పడమటిదిక్కుగా ముందుకు దూసుకుపోతున్నారు. ఆనీకానీవ్ త్రెవకిన్ ప్రక్కకువచ్చి కుర్రవానివంక సైగచేస్తూ, "కామ్రేడ్ లెఫ్టినెంట్! ఈ గుర్రాలను స్వాధీనపర్చుకున్నందుకు మీకేమీ ముప్పుమూడదుగదా?" అని ప్రశ్నించాడు.

"కావచ్చు," అని త్రెవకిన్ క్షణం ఆలోచించి, "కాని మనం జర్మనీవరకూ చేరుకుంటాం," అన్నాడు.

ఒకరిమాట నొకరు అర్థంచేసుకుని చిరునవ్వు నవ్వారు.

తన గుఱ్ఱమును మడిమతో తన్నుతూ త్రెవకిన్ పడమటి దిక్కుగా వ్యాపించివున్న ఆ విశాలమైన అడవివంక దృష్టి సారించాడు. గాలి రయ్‌మంటూ ఎదురుగా ముఖాలపైకి వీస్తుంది. గుఱ్ఱాలు పక్షులచందాన ఆకాశంలో ఎగిరినట్లే కన్పిస్తున్నాయి. పశ్చిమాద్రి అస్తమించుచున్న సూర్యారుణ కాంతితో మెరుస్తుంది. అస్తమించుచున్న సూర్యుణ్ణి తరుము చున్నారా అన్నట్లు ఆ పన్నెండుమంది గుర్రపు రౌతులు త్వరితగతిని పురోగమిస్తున్నారు.

---

# ౧

ఒక పెద్ద అడవిలో వ్యాకుల చిత్తంతో నిద్రపోతున్న రెజిమెంట్ల మధ్య డివిజను హెడ్ క్వార్టర్సు ఆరాత్రి మకాం వేసింది. కనీసం ఎక్కడా నిప్పు వెలిగించటానికికూడా వీలు లేదు. ముందుకు సాగుతూన్న సైన్యాల ఆచూకీకోసం జర్మను విమానాలు రాత్రింబవళ్లు పైన ఎగురుతూనేఉంటాయి. ఖందకాలు త్రవ్వే దళం ముందుగానే అక్కడకువచ్చి పగలంతా కష్టించి, రోడ్లు, కన్నులకు ఇంపుగావుండే సంకేతస్థలాలు, గంధమాదనావృక్షపు కొమ్మలతో పరిశుభ్రమైన విశ్రాంతి స్థావరాలతో కూడిన ఒక నగరాన్నే నిర్మించారు. ఈవిధంగా సంవత్సరం మొత్తంమీద యుద్ధరంగంలో ఇటువంటి క్షణ భంగుర నగరాల నెన్నిటినో నిర్మించేవున్నారు.

కందకాలు త్రవ్వే ఒక దళ కమాండరు లెఫ్టినెంట్ బుగోర్కోవ్ చీఫ్ ఆఫ్ స్టాఫ్‌తో మాట్లాడుటకు నిరీక్షిస్తున్నాడు. కాని కర్నల్ గాలీవ్ దృష్టిమాత్రం ఎదురుగావున్న మ్యాపుపై హత్తుకుపోయింది. ఎప్పటివలె శత్రు స్థావరాలను తెలియ జేసే నీలవర్ణపు పెన్సిలు గుర్తులు ఆ మ్యాపులోలేవు. ఇక వెనుకబడిపోయిన దళాలు ఎక్కడెక్కడున్నాయో ఆ భగవంతునికే తెలియాలి! రెజిమెంటంతా ఆ కీకారణ్యంలో చెల్లా చెదురుగా ఒకదానికొకటి పొంతనలేకుండా భయంకర పరిస్థితిలో చిక్కుబడివుంది.

ఆరాత్రి డివిజను మకాంవేసిన అడవి ఆకారం ప్రశ్నార్థక

గుర్తు వలె వుంటుంది. ఆ అడవిసైన్యపు కమాండరువలె కర్నల్ గాలీవ్‌ను వ్యంగంగా ప్రశిస్తున్నట్లు తోస్తుంది- "ఏం, ఏం జరిగింది? ఎలావుంది? అనుకున్న సమయాన్కి జర్మనులు ఫిరంగులు కాల్చటం, నీవేమో సగంయుద్ధం అయేవరకు సైన్యపు వెనకకూర్చుని యుద్ధంచేసిన పశ్చిమోత్తర రంగంకాదిది. ఇది అహర్నిశలూ జరుగుతూవుండే సజీవయుద్ధం."

తాను చిట్టచివరసారి నిద్రపోయిం దెప్పుడోకూడా గాలీవ్ మర్చిపోయాడు. కాకేషియన్ దుస్తులు ధరించి వున్నాడు. చివరకు మ్యాపునుంచి దృష్టి మరల్చి బుగోర్కోవ్ వంక చూశాడు.

"విషయాలేమిటి?"

లెఫ్టినెంట్ బుగోర్కోవ్ చాలా సంతోషంగా తమ దళం తయారుచేసిన ఒక కుటీరంవైపు చూస్తూ నిలబడ్డాడు.

"రేపు హెడ్‌క్వార్టరు మకాం ఎక్కడో తెలుసుకుందామని వచ్చాను. కామ్రేడ్ లెఫ్టినెంట్ కర్నల్! రేపు ఉదయమే అక్కడకు ఒకదళాన్ని పంపుతాను."

ఒకే ఒకరోజయినాసరే డివిజను ఈ అడవిలోనే వుండాలని అతనికోర్కె. కనీసం అప్పటివరకైనా చెట్లకొమ్మలతో అందంగా నిర్మించబడిన ఆ నగరాన్ని ఉపయోగించుకోవచ్చు. వీటెని వదలిపోవటానికి ముందు వసంతఋతుశోభ దీనిలో నివాసమేర్పరుచుకోవటానికి ముందే, ఎవరైనా ఈ అద్భుత గృహ

నిర్మాణ కౌశలానికి బుగోర్కోవ్‌ను ప్రశంశిస్తే ఎంత బాగుం టుంది. బుగోర్కోవ్ నేర్పరితనంగల వడ్రంగి, రాతిచెక్కడం అతని వంశపారంపర్యంగా వచ్చినకళ. కళలంటే అభిమానంతో కూడిన ప్రశంశలంటే ఇష్టం.

"నీ ప్లానుమ్యాపు నాకివ్వు," అని లెఫ్టినెంట్ కర్నల్ చాలా కఠోరంగా అడిగాడు. ఆయన దానినందుకుని మరొక అడవి అంచున ప్రస్థుత మున్న మకాంకు 25 మైళ్ళ దూరంలో ఒక జండా గుర్తుపెట్టాడు. బుగోర్కోవ్ లోలోపలే నిట్టూర్చి వెళ్ళిపోవటానికి వెనుదిరిగేసరికి ద్వారానికున్న కాన్వాసు తెరను తొలగించుకొని కూపీలు తీసేపనిలో ముఖ్యుడైన బరాశ్కిన్ లోన ప్రవేశించాడు. లెఫ్టినెంట్ కర్నల్ అతన్ని చాలా అయిష్టంగానే ఆహ్వానించాడు.

"డివిజను కమాండరుగారు మన గూఢచారదళంయందు చాలా అసంతృప్తి వెల్లడించారు. మేమీరోజు లెఫ్టినెంట్ త్రెవకివ్‌ను, ఆయనదళాన్ని చూశాము. వాళ్ళరూపాలు, ఆకారాలు చాలా అసహ్యంగా, మురికిగా, గడ్డాలుపెరిగి, దుస్తులుమాసి. చాలా అవమానకరంగా వున్నాయి. ఏమిటి, ఆలోచిస్తున్నారు?"

లెఫ్టినెంట్ కర్నల్ గాలీవ్ క్షణంపాటు మౌనంగావుండి, అంతలోనే కోపంగా, "ఓకెప్టెన్, శత్రువు లెక్కడున్నారో దయచేసి నీవైనా చెప్పగలవా ?" అని బిగ్గరగా అరచాడు.

బుగోర్కోవ్ ఆకుటీరంనుంచి బయటకు వచ్చి ముందు

మకాం దగ్గరకు దళాన్ని ప్రయాణమునకు సిద్ధంచేయుటకు వెళ్ళి పోయాడు. త్రోవలో త్రెవకిన్‌ను కల్సుకుని తను విన్నదంతా చెప్పాలని నిర్ణయించుకున్నాడు. "అతను తన దళ సభ్యుల గడ్డాలుచేయించి, శుభ్రముగా మెలకువగా వుండేటట్లు చేయటమే మంచిది! లేకపోతే పాపం! ముఖంవాచే చివాట్లు తగుల్తాయి." అని శుభాకాంక్షి బుగోర్కోవ్ అనుకున్నాడు.

బుగోర్కోవ్, త్రెవకిన్ ఇద్దరూ ఓల్గా ప్రాంత నివాసులు కావడంవల్ల బుగోర్కోవ్‌కు త్రెవకిన్ అంటే చాలా యిష్టం. ప్రస్తుతం త్రెవకిన్ ప్రఖ్యాతి బడసిన గూఢచారి యైనప్పటికి బుగోర్కోవ్‌కు మాత్రం మొట్టమొదట తాను కలుసుకున్నప్పుడు కన్పించినట్లే శాంత గంభీర స్వభావంగల లజ్జాశీలియైన ఆపాత త్రెవకిన్‌గానే కన్పించేవాడు. ఎవరికి వారికే చేతినిండుగా పనివుండేది. ఎక్కువగా కలుసుకునే అవకాశం వుండేదికాదు. అయినా తనమిత్రుడు బోలోదయా త్రెవకిన్ ఎక్కడో దగ్గరలోనే తనతోపాటే ముందుకు సాగుతూ వుండివుంటాడని వూహించుకునే బుగోర్కోవ్ చాలా సంతోషించేవాడు- లజ్జాశీలి, గంభీరస్వభావం, విశ్వాస పాత్రుడైన త్రెవకిన్ ఎల్లవేళలా మృత్యుదేవత నీడలోనే నడిచే స్వభావం గలవాడు, ఇతరులకంటె మృత్యు ముఖంలో పయనించటానికి వెనుదీయని.........

బుగోర్కోవ్ త్రెవకిన్‌ను కలుసుకోలేకపోయాడు. అతనొకసారి బారాశ్కిన్ డేరాలోకి తొంగిచూచాడు. అతనింకా

చీవాట్లుతిని, చికాకుగా వున్నాడో ఏమో బుగోర్కోవ్ అడిగిన ప్రశ్నకు బూతులతో జవాబుచెప్పాడు- "ఎక్కడున్నారో ఆ భగవంతునికే తెలియాలి. నన్ని ఇరుకునపడదోస్తున్నారు..." అసలు కెప్టెన్ బురాస్కిన్ మొత్తం డివిజ నంతటిలోను తిట్టులకు, సోమరితనానికి పెట్టిందిపేరు. హెడ్‌క్వార్టర్‌కు తాను నిరుపయోగమనీ కనుక ఎప్పుడో ఒకప్పుడు తన నీపదవినుంచి తప్పక తొలగిస్తారని వూహించుకుని అసలు పనిచేయటమే మానివేశాడు. కొత్త ముట్టడులు జరిగినంత కాలం తన గస్తీదళాలు ఎక్కడున్నాయో, ఏమిచేస్తున్నాయో కూడా అతనికి తెలియనే తెలియదు. తానుమాత్రం హెడ్‌క్వార్టర్ ట్రక్కుల్లో ఎక్కి తిరుగుతూవుండేవాడు. అందమైన కళ్లు, బంగారురంగు జుత్తుగల కాత్యా అనే అమ్మాయి క్రొత్తగా రేడియో ఆపరేటరుగా చేరింది. అతనెప్పుడూ ఆమెతో ప్రేమకలాపాలు జరుపుతూవుండేవాడు.

బుగోర్కోవ్ అతన్ని వదలి తాను తయారుచేసిన క్షణభంగురమైన ఆ మానవ నివాసమునకు చేరుకున్నాడు. త్వరగా బయలుదేరి రోడ్డువెంట నడుస్తూ, 'ఈయుద్ధం త్వరగా ముగిసి ఇంటికివెళ్ళి మరల తనపనులు ప్రారంభించుకోగలిగితే ఎంత బాగుంటుంది' అనుకున్నాడు. అప్పుడు అందమైన ఇండ్లు నిర్మించవచ్చు, చిత్రిక పట్టేటప్పుడు కొయ్యలోనుంచి వచ్చే కమ్మని సువాసన పీల్చుకోవచ్చు. వేదికయెక్కి తలనెరసిన పనివాళ్ళతో నీలవర్ణపు మ్యాపుల్ని గురించి చర్చించవచ్చు.

మరుసటిరోజు ఉదయమే గడ్డపారతోపాటు ఇతర పని ముట్లను బండిమీద పేర్చుకుని బుగోర్కోవ్ తన దళసహితంగా బయలు దేరాడు.

నరకద్వారంవలెవున్న ఆ అడవిమార్గాని కిరువైపులా చాలా ఎత్తైన చెట్లు, వాటి అగ్రభాగాలు ఎక్కడో ఆకాశంలో ఒకదానికొకటి కలుసుకుంటున్నాయి. వాటిల్లో మేలొకాం బున్న పక్షుల రొదమిన్నుముట్టుంది. తమ దుస్తులపై కాన్వాసు కోట్లు ధరించిన కాపలా సైనికులు, రాత్రంతా చల్లబడిపోయి వుండడంవలన నెమ్మదిగా అటుఇటు పచారుచేస్తున్నట్లు తిరుగు తున్నారు. మకాంకు చుట్టుప్రక్కల రోడ్డు నానుకుని వున్న కందకాల్లో మెషిన్ గన్‌లవాళ్లు నిద్రమత్తుతోనే పహారాయిస్తు న్నారు. నేలమీద పరచుకొన్న చెట్ల కొమ్మలమీద సైని కులు ఒకరికొకరు ఆనుకొని నిద్రపోతున్నారు. కొంతమంది చలివల్ల ఉదయమేలేచి మంట వేసుకుంటానికి ఎండుపుల్లలకోసం అటు ఇటు తిరుగుతున్నారు.

చలివల్ల వళ్ళంతా కొంగర్లుపోతూ బుగోర్కోవ్, "యుద్ధమంటే ఇదే. ఎన్ని వేలు, లక్షలమందికి ఇల్లువాకిళ్లు లేని జీవితం," అని ఆలోచించాడు.

దాదాపు పది కిలోమీటర్లు ప్రయాణంచేసేసరికి పడమటి దిక్కునుంచి ముగ్గురు గుర్రపురౌతులు వేగంగావస్తూవుండటం కన్పించింది. బుగోర్కోవ్ గాబరాపడ్డాడు. ముందు సోవి యట్ సైనికు డొకడైనా లేడని అతనికి తెలుసు. గుర్రాలు

చాలా వేగంగా వచ్చాయి. బుగోర్కోవ్ వెంటనే వాళ్ళల్లో ఒకమనిషిని గుర్తుపట్టి చాలా సంతోషించాడు. మరెవరో కాదు– త్రెవకినే.

"జర్మనులు చాలా సమీపంలోనే వున్నారు. వాళ్ళ వద్ద ఫిరంగుల గిడ్డంగివుంది. వాటంతటవే పేలే ఫిరంగులు కూడా వున్నాయి." అని త్రెవకిన్ గుర్రంమీదినుంచే చెప్పాడు.

అతను వెంటనే బుగోర్కోవ్ వద్దనున్న మ్యాపులో జర్మనుల రక్షణశ్రేణిని చూపిస్తూ గుర్తుపెట్టాడు. అతను చెప్పినదానినిబట్టి రేపు తాము డేరాలు వేయబోయే మకాంకు దగ్గరే ఆ అడవికొసన జర్మనులు వున్నారని అర్థమయింది.

"ఇంకా రెండు జర్మనుటాంకులు, ఒక పెద్ద ఫిరంగి అక్కడేవున్నాయి. బహుశా పొంచివుండి అకస్మాత్తుగా దాడిచేయటానికై వుంటుంది......చూడు," అని త్రెవకిన్ "జర్మనులతో జరిగిన పోరాటంలో ఆనీకానీవ్ గాయపడ్డాడు," అని చెప్పాడు.

ఆనీకానీవ్ తన గుఱ్ఱంమీద మోటుగా, క్షమార్పణ కోరుకుంటున్నట్లు చిరునవ్వునవ్వుతూ కూర్చున్నాడు. తన అజాగ్రత్తవలన తానేదో అందరికీ కష్టంకల్గించానే అనేటట్లుగా వుంది అతనివాలకం.

కందకాలు త్రవ్వేవాళ్లు ఉన్నవాళ్లు ఉన్నచోటే ఆగి పోవటానికి సమ్మతించారు. త్రెవకిన్ వెళ్ళి చీఫ్ఆఫ్ స్టాఫ్

గాలీవ్‌కు రిపోర్టిచ్చి హెడ్‌క్వార్టర్ ఇచ్చే ఆదేశాన్ని బుగో రోట్కోవ్‌కు తెలియజేస్తాడు. త్రెవకిన్ బాగా బలిసివున్న తెల్ల నక్షత్రం గుర్తుగల తన గుర్రపు కళ్లేన్ని లాగి వేగంగా ముందుకు సాగిపోయాడు.

కర్నల్ సర్బీచెంకో తన క్యాంపు మధ్య జీపు దగ్గర నిలబడి వున్నాడు. రెజిమెంటుల కమాండరు, లెఫ్టినెంట్ కర్నల్, ఇంకా మేజరు మొదలైనవాళ్ళతని చుట్టూ మూగివున్నారు. ఎడ్జుటెంట్ మరి సైనికులు కొద్దిదూరంలో నిలబడివున్నారు. త్రెవకిన్ గట్టిగా శ్వాసపీల్చుకుని గుర్రంనుంచి దిగి, అలవాటు లేని దూరప్రయాణం చేయటంవలన కొంచెం కుంటుకుంటూ కర్నదల్గరకు చేరుకున్నాడు.

"కామ్రేడ్ డివిజనుకమాండర్! జర్మనులు చాలా సమీపంలోనే వున్నారు."

అతను సంక్షిప్తంగా రిపోర్టిస్తూవుండగా అందరూ అతని చుట్టూమూగారు. శత్రువులు దగ్గర్లోనే ఒక నదిఒడ్డున తమ రక్షణశ్రేణిని నిర్మించుకున్నారు. అతను ఫిరంగుల గిడ్డంగిని, వాటంతటవే పేలే ఆరుఫిరంగుల్ని చూశాడు. జర్మనుల భూసైన్యం కందకాల్లో వున్నారు. కెంకటాంకులు, ఇరవై కిలోమీటర్లు కాల్చటానికి సిద్ధంగావున్న ఒకఫిరంగీ వున్నాయి.

డివిజను కమాండరు త్రెవకిన్ చెప్పిన విషయాలను

మ్యాపుగో గుచ్చి పెట్టుకున్నాడు. అందరిలోనూ కావలసినంత ఆనందము, హడావిడీ కన్పించాయి; రెజిమెంటుల కమాం డర్లు, స్టాఫ్ ఆఫీసర్లు తమతమ మ్యాపులు బయటకు తీశారు. లెఫ్టినెంట్ కర్నల్ గాలీవ్ చలికాస్తూ మాయమైపోయింది. చలికి వేసుకున్న దుస్తులుతీసి క్రిందపారవేశాడు; రాజకీయ శాఖలోని ప్రముఖ రాజకీయ ఆఫీసర్లను సమావేశపర్చడానికి వెళ్ళిపోయాడు.

జీపు టాపుమీద పరచివున్న మ్యాపులో నీలవర్ణపు పెన్సిలుతో చివరిగీతలుగీస్తూ త్రెవకిన్ నుద్దేశించి డివిజను కమాండరు, "అయితే, ఈ కత్తుణా శ్రేణులు నిర్మించటం వాస్తవ మనే నీ అభిప్రాయమా?" అని అడిగాడు.

"అవును కామ్రేడ్ కమాండర్!"

"వాటంత టవే పేలే ఫిరంగుల్ని నీవు చూశావా?"

"చూశాను. కామ్రేడ్ కమాండర్!"

"నీవు కల్పించి అబద్ధాలు సబద్ధాలు చెప్పటంలేదుగా?" అని ముకుళించుకున్న బూడిదరంగు, ఆకుపచ్చరంగు కల్గిన కళ్లతో త్రెవకిన్ వంకచూస్తూ కర్నల్ తలవని తలంపుగా ఈప్రశ్న అడిగాడు.

"లేదండి, నేనేమీ కల్పించి చెప్పటంలేదు."

"మరోవిధంగా భావించకు," అని డివిజనుకమాండరు

అతనికేమీ కష్టంకలుగకుండా వుండేందుకుగాను అన్నాడు. "మూశావ్! విషయం పూర్తిగా తెలుసుకొని గట్టిగా నిర్ణయించుకోవాలిగా మరి! ఈ గూఢచారు లున్నారే వీళ్ళ కప్పుడప్పుడు కల్పించటంఅంటే మహాయిష్టమని నాకు తెలుసు. అందుకని అడిగానులే," అన్నాడు.

"నేను కల్పితాలు చెప్పడంలేదు," అని త్రివకిన్ మరో సారి చెప్పాడు.

"సిద్ధంకండి," అనే ఆజ్ఞ విన్పించీ విన్పించకముందే అందరూలేచారు. ఆ అడవంతా సందడిగావుంది.

డివిజను కమాండరు మ్యాపువంకచూస్తూ తనఆదేశాన్ని విన్పించాడు.

"రెజిమెంటు లన్నీ మామూలుగా రూట్ పార్మేషన్ లోనే నడుస్తాయి. అన్నిటికంటే ముందునడిచే రెజిమెంటు ఒక శక్తివంతమైన బటాలియన్‌ను మెరుపుదాడిగా పంపుతుంది. రెజిమెంటుకు సంబంధించిన ఫిరంగి గిడ్డంగి భూసైన్యం వెంట వుంటుంది. గస్తీదళము, టామీగన్నర్లు, ఇరువైపులనుంచీ రక్షణనిస్తూ వుంటారు. 108.1 నెంబరు ఎత్తుకు చేరగానే ముందు నడిచే రెజిమెంటు యుద్ధానికి బయలుదేరుతుంది. దాన్ని 108.1 నెంబరు ఎత్తుమీదినుంచి నడపాలి. గాలీవ్! వరుసగా పనులకు సంబంధించిన ఆదేశం తయారుచెయ్యి. ఆచివరవున్న హెడ్‌క్వార్టరుకు రిపోర్టు అందించు," అని మరల నెమ్మదిగా "కామ్రేడ్స్, ముఖ్యులంతా జాగ్రత్తగా మెలగాలి.

మనఫిరంగి రెజిమెంటు వెనకబడిపోయింది. మనదగ్గ మందు గుండు చాలా తక్కువగా వుంది. మనం చాలా ఇరకాటంలో వున్నాము...... మనమందరం మన కర్తవ్యాలను శ్రద్ధాగౌరవాలతో పూర్తిచేద్దాం!" అన్నాడు.

ఎవరికివారు ఆఫీసర్లందరూ తమతమ పనులు చూసుకునే నిమిత్తం వెళ్ళిపోయారు. డివిజనుకమాండరు, గాలీవ్, త్రెవకిన్ ఈ ముగ్గురుమాత్రమే ఇంకా జీపువద్ద మిగిలారు. సర్కోవ్ చెంకో త్రెవకిన్ వంకా, నురుగులుకక్కుతున్న అతని గుర్రంవంకా చూశాడు.

"నీవు చాలా మంచిపని చేశావ్!" అని అతను చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"ఆనీకానీవ్ కు దెబ్బతగిలింది," అని సంధిగ్ధావస్థలో వున్న త్రెవకిన్ ఈమాటను అసందర్భంగానే చెప్పాడు.

కర్నల్ దీనికేమీ జవాబుచెప్పకుండానే గాలీవ్ కు అంతిమ ఆదేశానిచ్చి జీపుమీద రెజిమెంట్లవద్దకు వెళ్ళిపోయాడు.

స్టాఫ్ ఆఫీసర్లందరూ గాలీవ్ వద్ద సమావేశమయ్యారు. గాలీవ్ సంతోషంపట్టలేక ఉబ్బి తబ్బిబ్బవుతున్నాడు. ఇటువంటప్పుడు ఆఫీసర్లు ఆయన్నిచూసి, "గాలీవ్ కు జర్మనుల వాసన తగులుతుంది!" అంటూ వుండేవాళ్లు.

గాలీవ్ త్రెవకిన్ ను పిలిచి, "ఇదిగో, నీవు నీదళంవద్దకు

వెళ్ళు! జర్మనులమీద నిఘావుంచి ఎప్పటికప్పుడు వార్తలు పంపుతూవుండు," అని చెప్పాడు.

"అలాగే, కామ్రేడ్ లెఫ్టినెంట్ కర్నల్!" అని త్రెవకిన్ నిల్చునివున్న చోటునుంచే బిగ్గరగా జవాబుచెప్పి గుర్రంమీద ఎక్కాడు.

ఈలోపు రెండవ గూఢచారి ఆనీకానీవ్‌ను హాస్పటల్‌కు తీసుకవెళ్లారు. అతను తరువాతవచ్చి లెఫ్టినెంటును కలుసుకున్నాడు. మనిషిలేకుండా ఒకగుర్రాన్నిమాత్రం తీసుకు వచ్చాడు.

మొదట కలుసుకున్నచోటనే బుగోర్కోవ్ ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాడు. త్రెవకిన్ అక్కడదిగి అన్యమనస్కుడై బుగోర్కోవ్ ఇచ్చిన వోడ్కా నెమ్మదిగా మింగి డివిజను తరువాత మకాం ఎక్కడోమ్యాపులో గుర్తుపెట్టి చూపించాడు.

గంభీరమైన త్రెవకిన్ కళ్ళవంకచూసి బుగోర్కోవ్, "మరల యుద్ధం ప్రారంభమైందన్నమాట," అని అడిగాడు.

ఆ గూఢచారులు ఆ అనంతాన్ని ఎదుర్కోవడానికా అన్నట్లు తమ గుర్రాలను మడిమలతో తన్నుతూ ముందుకు సాగిపోయారు.

కందకాలు త్రవ్వే దళంకూడా మాట్లాడుకుంటూ నెమ్మదిగా ముందుకు నడిచారు. "ఏమియుద్ధంరా బాబూ! మరల ప్రారంభమైంది! ఈయుద్ధాని కంతూ పంతూ లేకుండా వుంది. దీనికిక అంతంలేదు."

"సోదరులారా! మనం ఇక డేరాలు వేయడానికి బదులు కందకాలు త్రవ్వాలి," అని బుగోర్కోవ్ చెప్పాడు.

త్రెవకిన్ త్వరగానే తనదళాన్ని కలుసుకున్నాడు. దట్టమైన ఆ అడవిలో ఒక మిట్టమీద నదీతీరంలో శత్రువులు నిర్మించుకున్న రక్షణశ్రేణిని పరికించి చూడసాగారు.

చెట్టెక్కి జర్మనుల ఉనికిని కనిపెట్టున్న మర్చెంకో చెట్టు నుంచి దిగివచ్చి తాను చూసిన విషయాలను తెలియజేశాడు.

"ఆ జర్మనుటాంకులు, ఆ ఫిరంగి షుమారు అరగంట వరకు అక్కడే ఆగివుండి తరువాత నది దాటివెళ్ళాయి. తమ యూనిట్‌కు తిరిగి వెళ్ళివుంటాయి. నదిలో నీళ్ళుటాంకు సగం మునుగు లోతుంటాయి.

గూఢచారు లందరూ నేలమీద పాకుకుంటూ నది ఒడ్డుకుచేరి పొదల్లో దాక్కున్నారు. త్రెవకిన్ ఆ పల్లెటూరి యువకునికి గుఱ్ఱాలు ఒప్పగించి పంపివేశాడు.

"అబ్రాయ్! తిన్నగా ఈరోడ్డువెంటే వెళ్లు. గుఱ్ఱాల నన్నిటినీ ప్రస్తుతం నీకివ్వడంలేదు. మిగిలిన రెండుగుఱ్ఱాలను ఈ రోజుకు ఉంచుకుని రేపు వాటిని తోలిపెడ్తాను. అవికూడా లేకపోతే రిపోర్టులు పంపటానికి నాకు మరోసాధనమేలేదు."

యువకుణ్ణి పంపించి త్రెవకిన్‌కూడా దేకుకుంటూ తన సహచరులవద్దకు వచ్చి జర్మనులను కనిపెట్టసాగాడు. కందకాలు ఇప్పుడిప్పుడే త్రవ్వబడుతున్నాయి. ఇంకా పూర్తికాలేదు.

కందకాలచుట్టూ రెండువరుసలు ముళ్ళతీగెలువేశారు. గుబురైన చెట్లతో మూసుకొనివున్న ఆ 'పాడునది' శత్రువులకు, సోల్జరులకు మధ్యగావుండి ఇద్దర్ని వేరుచేస్తుంది. ఒకడు గోడపైకెక్కి దూరదర్శినితో తూర్పుదిక్కుకు చూస్తున్నాడు.

"నేను వాడిని హిట్లరు తల్లిదగ్గరకు పంపిస్తా!" అని మమోంచికిన్ నెమ్మదిగా గొణిగాడు.

"అటువంటి తెలివితక్కువపని చేయకు."

అతను శత్రువుయొక్క రక్షణ ఏర్పాట్లను జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. అల్లంత దూరంగా కన్పించీ కన్పించనట్లు గోచరించుచున్న బూడిదరంగు భూమి రెండవ కందకం. జర్మనులు రక్షణశ్రేణికి మంచిచోటునే ఎంచుకున్నారు. పడమటి గట్టు తూర్పుగట్టుకంటే ఎత్తూ ఎక్కువే, అడవికూడా దట్టంగావుంటుంది.

అక్కడొకటి అక్కడొకటి వాళ్ళ డేరాలు నిర్మించుకున్న ప్రదేశపు ఎత్తు చాలా వీలుగానేవుంది. మ్యాపులో అది 161.3 నెంబరులో గుర్తించబడివుంది. కందకాల్లో చాలామంది సైనికులు వున్నారు. డేరాలకు తూర్పు మొగిలో ఒకఫిరంగివుంది.

తనతోబాటు ప్రయాణంచేసి రైలుదిగి రాత్రిపూట మాయమైపోయిన ప్రయాణికుడినిగురించి ఆలోచించినట్లే అస్పష్టమైన గాలిపాటుగా, అకస్మాత్తుగా త్రెవకిన్కు ఆనీకానీవ్ గుర్తుకొచ్చాడు.

"అదిగో, అటుపైకి చూడండి, జర్మనులు గాలిమేయటానికి పోతున్నారు." అని మమోచికిన్ నెమ్మదిగా అన్నాడు.

షుమారు ముప్పదిమంది జర్మనులు అడవినుంచి బయటకు వచ్చి నదివైపుకు బయలుదేరారు. అక్కడ వాళ్ళు ఓరకంటిచూపులతో ఎదుటిగట్టువైపు చూస్తూ ఆమురికినీళ్ళల్లో దిగారు.

తామందరిలో మంచి గురికాడైన మర్చెంకోవైపుకు చూసి త్రెవకిన్- "వాళ్ళను కొద్దిగా భయపెట్టు," అన్నాడు.

టామీగన్‌నుంచి బయలుదేరిన గుళ్ళబారొకటి నీటిలో దూసుకుపోయి చిన్నచిన్న బుడగల్ని లేపింది. జర్మనులు తమ గట్టువైపుకు పారిపోయారు. ఆతురతతో ఆందోళనగా నలుదిక్కులు పరికించి చూచి బాతులవలె కీచుకీచు మంటూ నేల మీద బోర్లగా పడుకున్నారు. కందకాల్లో అలజడి రేగింది. హడావిడి పెరిగింది. ఉద్రేకం ఇనుమడించింది. దడదడ మంటూ ఒక ఆదేశం విన్పించడము, సమీపంలో గుళ్ళు రయ్ మంటూ దూసుకుపోవడం జరిగింది. గుడారాల ముందు భాగానవున్న ఫిరంగికదిలింది. ఒకొక్కటిగా మూడు గుళ్ళను కక్కింది తరువాత జర్మనుల ఫిరంగులన్నీ కదిలాయి. మొత్తం పదిఫిరంగులున్నాయేమో, నాల్గైదు నిముషాలవరకు అవన్నీ కలిసి దిబ్బమీదకు గుళ్ళ వర్షాన్ని కురిపించి వదిలాయి. గుళ్ళు పెళపెళలతో క్రోధంగా భూమిని బ్రద్దలు కొడ్తుంటే ఆధ్వని అడవిలోని నిశ్శబ్ద వాతావరణాన్ని పూర్తిగా భగ్నంచేసింది.

ఆ ఫిరంగుల ధ్వని డివిజనులోని, మొగపుదాడి దళము, బటాలియన్నవరకు విన్పించింది. బటాలియన్ కమాండరు ముక్తకోవో, ఫిరంగిదళ కమాండరు కెప్టెన్ గురాన్ గుర్రాల మీాద అలాగే పాతుకుపోయారు.

"మనం దీనిని మరిచేపోయాం. ఈసంకేతం పని నెల రోజులకు పైగా కావచ్చింది," అని ముక్తకోవ్ అన్నాడు.

"ఈకాల్పులు ఎక్కడో సమీాపంలోనే జరుగుతున్నాయి." ఒక్కక్షణం ఆగి బటాలియన్ ముందుకు సాగింది. రోడ్డు మలుపులో గార్డిచెన్నపు కొంతతోసుకున్న ఒక కుర్రవాడు గుర్రాలను తోలుకువెళ్తూ కన్పించాడు. అతను తనగుర్రాన్ని కరుచుకుని కూర్చొనివున్నాడు. చెవులు రిక్కించి ఫిరంగికాల్పులు వింటున్నాడు. బటాలియన్ కమాండరు అతనికి దగ్గరగా వెళ్ళి, "నీవిక్కడేం చేస్తున్నావ్?" అని అడిగాడు.

"త్వరపడండి, జర్మనులు నదిదగ్గ చాలామందున్నారు. మనగూఢచారులు అంతా కలిసి మొత్తం పన్నెండుమంది మాత్రమే......" అని అతను భయపడుతూ వేగంగా చెప్పాడు.



# 3

యూనిట్లన్నీ అటూ ఇటూ కమ్ముకుంటూ ముందుకు సాగుతూ శత్రువుల రక్షణ శ్రేణిని ఛేదించుటకు జరిగే ప్రయత్నమును సైనిక పరిభాషలో "రక్షాత్మక కార్యక్రమం" అంటారు. ఇక్కడమాత్రం రాత్రింబవళ్లు ఎడతెగని కార్యక్రమంతో సైనికులు అలసిపోయారు, మందుగుండు, ఫిరంగులు కూడా తక్కువగావున్నాయి. ఆక్రమణను వెనక్కి గదిమివేశారు. భూసైన్యం శత్రువుల గుండ్లవర్షం క్రింద నదిప్రక్కనే తడిగాగావున్న ప్రదేశంలో నిలచివుంది. టెలిఫోన్ ఆపరేటర్లు పై ఆఫీసర్ల ఆజ్ఞలు, క్రోధంగావున్న ఆదేశాలు, ప్రమాణాలు వింటున్నారు- "శత్రువులను రూపుమాపి ముందుకుసాగండి! మానవుల్ని నిలబెట్టి ఫాసిష్టుల్ని తరిమి కొట్టండి!" భగ్నమైపోయిన రెండవ ఆక్రమణ తరువాత, "అక్కడే నిశ్చలంగా నిలబడండి!" అనే ఆదేశంవచ్చింది.

యుద్ధరంగమంతా ఒక భారీత్రవ్వు కార్యక్రమంగా మారిపోయింది. జర్మనులు గుప్పించిన అగ్ని బాణాలు, ఫిరంగి గుండ్లవలన చుట్టూ భయంకరమైన మంటలు వ్యాపించాయి. ఆ వెలుగులో త్రవ్వు కార్యక్రమం జరుగుతుంది. నేలంతా త్రవ్వకాలు, కందకాల పద్మవ్యూహాలతో జల్లెడమాదిరైంది. ఆ ప్రదేశపు ఆకారమే పూర్తిగా మారిపోయింది. ఆ అడవిలోని నదియొడ్డునవున్న గరిక, మొక్కలు, నాచు నామ రూపాలు లేకుండా పోయాయి. బాంబులు ఫిరంగులతో

అంతా ధ్వంసమైపోయింది. అది చూడటానికి దాంతే మహాకవి వర్ణించిన భయంకర నరకంవలె కన్పిస్తుంది. పచ్చగా కళకళ లాడుతున్న ఆ ప్రదేశమంతా కందకాల గాయాలతో భయంకరమైన ప్రేతభూమివలె కన్పట్ట సాగింది. అక్కడ వీస్తున్న గాలికూడా విచిత్రంగానేవుంది.

మొదట 'నదిబడ్డు' అని వ్యవహరించిన ప్రదేశమంతా ప్రస్తుతం 'నిర్జన ప్రదేశ'మని చెప్పవచ్చు. తమ ముందున్న రక్షణ శ్రేణిని బలంగా చేసుకోవడానికి జర్మనులు మోళ్లను నరికే గొడ్డళ్ల ధ్వని, కందకాలు త్రవ్వేవాళ్ల సంభాషణలు, గస్తీతిరుగు తున్న స్కౌటులకు వినబడుతూనేవున్నాయి.

కాని నిరాశ ఆవరించివున్న చోట దాని వెనుకనే ఆశ కూడ దాగివుంటుంది. వెనుకబడిపోయిన దళాలు వచ్చి కలుసు కుంటాయి. మందుగుండు, తుపాకులు, రొట్టెలు, ఆహా రంతో నిండివున్న డబ్బాలతో కిర్రుకిర్రు మనుకుంటూ బళ్లు కూడావచ్చి కలిశాయి. చివరకు డాక్టర్ల బటాలియను, టపా క్వార్టరు మాష్టరు భోజనసామాగ్రి, పశువైద్యదళం, అంత్రా వచ్చి ఆ అడవిలోనే సమీపంలో మకాంవేశారు.

ఫిరంగి రెజిమెంటు వచ్చినప్పుడు అందరూ నిండుహృద యాలతో ఆహ్వానించారు. ఫిరంగుల్ని ముందు భాగాన నిల బెట్టారు. తరువాత పరీక్షించడానికి శత్రువుల కందకాలకు గురి చూసి ఫెళఫెళమంటూ పేల్చారు– దీనితో మన సైనికులకు అపరిమితానందం కల్గింది.

నెలరోజులుగా ఆగిపోయి పేరుకుపోయిన టపా వచ్చింది. చలికి కొంగర్లుపోతున్న చేతుల్లో ఉత్తరాల కట్టలు వచ్చేసరికి ముకుళించుకు పోయిన జీవితాలు ఆనందంతో విప్పారి నట్లైంది.

నదిఒడ్డునే గడ్డిదుబ్బులమధ్యవున్న ఒకనక్క బొరియలో కూర్చుని క్రైవకిన్ తన వుత్తరాలు చదువుకున్నాడు. ఓల్గాతీరాన ఒక గ్రామంలో బడిపంతులుగావున్న అతని తల్లి నుంచి, మాస్కోలోవుంటున్న సోదరినుంచి ఆ వుత్తరాలు వచ్చాయి. తల్లి వ్రాసిన వుత్తరాలన్నిటి సారాంశం ఒకటే. "నాయనా! చనిపోవద్దు!" ఇదే ఆమె మనోవేదనలోని కరుణతో కూడిన మౌనవాంఛ. అతని సోదరిలేనా మాస్కోలోని ఒక సంగీత కళాశాలలో వయొలిన్ తరగతిలో శిక్షణ పొందు తుంది. ఆమె తన ఉత్తరాల్లో తన అభివృద్ధిని గురించి వ్రాసింది. ప్రపంచ ఖ్యాతిబడసిన జర్మను సంగీతజ్ఞుడు బాక్‌ను గురించీ, ప్రసిద్ధ రష్యన్ సంగీతజ్ఞుడు చైకొవ్‌స్కీని గురించి కొంచెంగా వ్రాసింది— "ముసలి చైకొవ్‌స్కీ అంత కష్టంకాదుగాని ...నేను ఆలోచించినంతవరకు...ఆ ముసలి బాక్..." అంటూ ఏమేమో వ్రాసింది.

యువ్వనంలోని బడాయి, చెట్టుకొమ్మల ఆకారంగా విద్యుత్ దీపాలతో నిర్మితమైన దీపస్తంభంలోని వెలుగు, మృదువైన వయొలిన్ స్వరాలు—ఇవన్నీ ప్రస్తుతం వూహా కందని దూరపు విషయాలు. నిజంచెప్పాలంటే ఇదిమాచి క్రైవకిన్‌కు

చాలా కోపంవచ్చింది. ఇక్కడ తామంతా మృత్యు ముఖంలో, అపాయాలమధ్య, ఈవర్షంలో, బురదంలో నానాయాతన లనుభవిస్తుంటే అక్కడజనం సంగీతాలు, సినిమాలు, ప్రేమకలాపాల్లోను, చదువుల్లోనూ మునక లేస్తున్నారు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్! ఏమిట్రా ఆలోచిస్తున్నావు?" అని దూరదర్శిని పట్టుకుని సమీపంలో కూర్చునివున్న మర్చెంకో అడిగాడు.

"ఏదోవిధంగా బ్రతుకీడ్చుకుంటూ మనకోసం ఎదురు చూస్తున్నారు, మనం త్వరలో గడచి గట్టెక్కలేమా అనేది ఆలోచిస్తున్నాను."

జర్మనులు రక్షణశ్రేణివంక కన్నార్పకుండా చూస్తూ మర్చెంకో తలఆడించి నవ్వాడు. "జర్మను లేదో చేయ బోతున్నారు." అన్నాడు మర్చెంకో.

త్రెవకిన్ దూరదర్శిని తీసుకుని చూశాడు. జర్మను సైనికులు ఒకఫిరంగిని అడవి వెలుపలికి దొర్లించుకపోతున్నారు. త్రెవకిన్ ముసలి బారవ్‌ను గురించి తన చెల్లెలు వ్రాసింది గుర్తొచ్చి నవ్వాడు.

ఆతడు గురోవిచ్‌కు ఫోనుచేశాడు.

"గురోవిచ్! మెలకువగావుండండి— వాళ్లు దగ్గరలోనే ఒకఫిరంగి నమర్చి కాల్చబోతున్నారు— ఆపాడుబడిన కొంప

లక్ష్యానికిప్రక్కగా రెండడుగుల దూరంలోవుంది. దాన్ని చూస్తూవుండు."

"ధన్యవాదాలు త్రెవకిన్!" అని ఎప్పుడూ అతి మెళకువగా మెలిగే ఫిరంగీ కాల్చేవాని కంఠధ్వని దూరంనుంచి వినిపించింది. "ఇదిగో, ఇప్పుడే వాళ్ళకొక 'కానుక' పంపిస్తాం."

మమోంచికిన్ గడ్డిలోనుంచి తలపైకెత్తి "కామ్రేడ్ లెఫ్టినెంట్! ఏమన్నా తింటావా?" అని అడిగాడు.

సగం పక్షిని కాగితంలో చుట్టి ప్లేటుతో త్రెవకిన్‌కు అందించాడు.

మర్చెంకోతో కలసి అంతా తిన్నతరువాత, మమోంచికిన్ కొద్దిరోజులనుంచి రేషనులో సైనికులకు లభించని ఇతర తిను బండారాలు తెస్తున్నాడనే విషయం స్ఫురణకొచ్చింది. ఆ విషయంలో ఆతడిని సంజాయిషీ అడగాలనుకుంటుండగానే మర్చెంకో త్రెవకిన్ దృష్టిని :జర్మనుల వైపుకు మళ్ళించాడు. తరువాత త్రెవకిన్ ఆవిషయాన్నే మర్చిపోయాడు.

నిజంగానే మమోంచికిన్ ధనాఢ్యుడైయాడు. అతడు, ఈ గుడ్లు, వెన్న, కోళ్లు, బూడిదగుమ్మడి మురబ్బా, క్యాబేజీ చట్నీ వగైరాలు ఎక్కడనుంచి సంపాదించుకొస్తున్నాడో ఎవరికీ అంతుచిక్కటంలేదు.

పోటు లెప్పుడైడా ప్రశ్నిస్తే "దేనికైనా యత్నము, ఉపాయము వుండాలి," అంటూ వుండేవాడు.

విషయం సాధారణమైనదైనా నిజాని కది చాలా అసహ్యాకరమైనది. మిగిలిన రెండుగుర్రాలను రైతులకు ఒప్పగించి రావలసిందిగా త్రెనికిన్ మమోచికన్‌ను పంపాడు. ఆతడు వాటిని ఒప్పగించటానికి బదలకా దగ్గరగ్రామములో వున్న ఒకశత్రువుకు తాత్కాలిక ఒప్పందంమీద కొద్దికాలం పాటు బాడుగకు ఇచ్చివచ్చాడు. డబ్బుమాత్రం తీసుకోలేదు. బాడుగ ఆహారరూపంలో పంపే ఏర్పాటు చేసుకున్నాడు. దుక్కులు, నాట్లు ముమ్మరంగా జరిగే కాలం గనుక ఆముసలివాడీషరతులకు చాలా ఉదారంగా అంగీకరించాడు.

యువక స్కౌటులు మమోచికిన్‌ను ప్రశంశించేవారు-ఆతడియుక్తులకు, అదృష్టానికి వారి కాశ్చర్యం గలిగేది. అంద గాడైన కిపోకటిస్టోవ్ ఆతడి అనుచరులందరిలోనూ చాలా నిష్ఠగల్ల వ్యక్తి, ఆతడు ప్రతిచిన్న విషయంలోనూ మమోచికిన్‌కు అనుకరణ చేయటానికే యత్నించేవాడు. మీసాల విషయంలోకూడా ఆతడినే అనుకరించేవాడు. ప్రతిరోజూ క్రొత్త వచ్చేవాళ్ళకు, మమోచికిన్ తమదళ చరిత్రంతా చెప్తూవుండే వాడు- అందులో చాలావరకు తన ప్రయోజకత్వాన్ని గురించే చెప్పేవాడు. ఆనీకానోవ్ విషయంలోకూడా గొప్ప మాటల్తోనే పొగడేవాడు. కాని ఆనీకానోవ్ చరిత్ర విన్నందు వల్ల, తన గొప్పతనానికి లోటురాకుండా మాత్రం జాగ్రత్త పడేవాడు.

మమోచికిన్ మాటలు వినివిని, స్కౌటులు తరచుగా ఆమాటల్లో చాలా అసంగమైన, అసంభవ విషయాలను పట్టు

కుంటూ వుండేవారు. అటువంటివి ఆతనికి లెక్కలోనివిగావు; కాని త్రెవకిన్ ఎదుటమాత్రం నోటికి తాళంవేసినట్లే, త్రెవకిన్కు అబద్ధమంటే తగని అసహ్యం. ఆతనుకూడా తీరికగావున్న సాయంత్ర సమయాల్లో అప్పుడప్పుడు పోరాటవిషయాలనేకం చెబుతూ వుండేవాడు. అటువంటి సాయం సమయాలు నూతనంగా వచ్చినవాళ్ళకు చిరస్మరణీయాలు.

ఆతడి సత్ప్రవర్తన అందరికీ చాలా ఆశ్చర్యాన్ని కలిగించేది. ఆనీకానోవ్‌ను గురించి, యుద్ధంలో మరణించిన మేజర్ బోలోవ్ విషయం, మర్చెంకో, మమోంచికన్, ఇలా అందర్ని గురించి చెప్పేవాడు; కాని తననుగురించి ఒక అక్షరంకూడా చెప్పుకునేవాడుగాదు. పీటన్నెలను స్వయంగా చూసిన సాక్షినని చెప్పుకోవడమే ఆయన అభిప్రాయమనేది ఆమాటల్లో స్పష్టమయేది.

"మీరందరూ ఆనీకానోవ్ వలె పనిచేయడం నేర్చుకోవాలి" అని విషయప్రసంగం ముగిస్తూ అంటూ వుండేవాడు, మమోంచికిన్ ఈర్ష్యతో కుళ్ళిపోతూవుండేవాడు.

అటువంటి సాయంసమయాల్లో యురాగోలుబెవ్ త్రెవకిన్ పాదాల చెంతకూర్చుని, భక్తిశ్రద్ధలతో, తదేకధ్యానంగా ఆయనవంక చూస్తుండేవాడు. మమోంచికన్ వీరత్వాన్ని గూర్చి అతిగా చెప్పబడడం అతడికి ఆశ్చర్యం కలిగించేదికాని అతని ఏకైక ఆదర్శమార్గ దర్శకుడు మాత్రం ఈయనకే లెక్కించండే.

మమోంచికన్‌కు కూడా ఆసాయం సమయాలు ఆనందం

గానే వుండేవి. సర్వ సాధారణంగా ఎప్పుడూ మౌనంగా, గంభీరంగా వుండే తమ లెఫ్టినెంట్ ముఖం ఈ దుర్లభ సమయాల్లో మాత్రమే సంతోషంతో వికసించేది. ఆయనకు లెక్కలేనన్ని గాథలు- ఘటనలు తెలుసు. ఆయన అప్పుడప్పుడు సైన్యాధిపతులనుగురించి, విజ్ఞానవేత్తల జీవిత విశేషాలను గూర్చి చెబుతుండేవాడు. ఇటువంటివి తెలుసుకోవడం మమోచికిన్‌కు మహాయిష్టం.

త్రెవకిన్‌యొక్క ఆదరాభిమానాలు చూరగొనాలనే కోర్కెలేకుండానే, తనకు రహస్యంగా లభిస్తున్న ఆహారాన్ని కొంత మమోచికిన్ ఆయనకిస్తుండేవాడు. మనుషుల స్వభావాల నర్థంచేసుకోడంలో మమోచికిన్ అందెవేసిన చెయ్యి. ఇల్లా చేయడంవల్ల లెఫ్టినెంట్‌వల్ల తనకేవిధంగానూ లాభం వుండబోదనికూడా అతనికి బాగా తెలుసు. తనకు మమోచికన్ ఇచ్చిందేమిటో చూచుకోకుండానే త్రెవకిన్ ఆ పటిమాంసాన్ని తినేశాడు, తనలోలేని సద్గుణాలన్నీ తమ లెఫ్టినెంట్‌లో వుండడంవల్లే మమోచికిన్ ఆయన్ని గౌరవించేవాడు; తన ఆహారం యిచ్చేవాడు. తన కర్తవ్యాన్ని నెరవేర్చడంలో త్రెవకిన్ శక్తివంచనలేకుండా నిస్వార్థభావంతో పనిచేసేవాడు. ఆయన సైనికులకు వోడ్కా పంచడం మమోచికన్‌కు ఆశ్చర్యం కల్గించేది. సరిగ్గా కొలిచి అందరకీ సమానంగా పంచేవాడు. తనవంతుమాత్రం చాలా తక్కువ మిగుల్చుకునేవాడు. అందరికంటే చాల తక్కువ సమయమే విశ్రమించేవాడు. మమోచి

కనుక ఇది అర్థమయేదికాదు, కాని తమ లెఫ్టినెంట్ చేసేది మాత్రం సబబేనని, ఒకవేళ ఆస్థానంలో తానున్నా మరో రకంగా వ్యవరించేవాడినని మాత్రం అనుకునేవాడు.

తనకు 'గుర్రాలబాడుగ' నిమిత్తం లభించిన ఆ 'గుర్రపు మాంసం'. (మమోంచికన్ ఆపటీమాంసానికి పెట్టినపేరు), కొడి పిల్లను, రుచ్యమైన మరికొన్ని పదార్థాలను లెఫ్టినెంటుకు అందించి స్కాటులు డేరాగా వుపయోగించుకుంటున్న గుర్రపు శాల వైపుకు బయలుదేరాడు.

అక్కడ దళాధిపతి సర్బిచెంకోకు కొట్టుకోబోయి కొద్దిలో బ్రతికిపోయాడు. ఆకుపచ్చని కజ్జాక్ టోపీ, బూడిద రంగు బూటుల కారణంగా చాలాజాగ్రత్తగా తప్పుకు పోయాడు- నిర్ణయించిన యూనిఫారంకు విరుద్ధంగా, నడిస్తే కర్నల్ ఏమాత్రం సహించడు.

కర్నల్ సర్బిచెంకో ప్రక్కనే ఒకఅమ్మాయి నిలబడి వుంది. మొగవాళ్ళ క్రాపువలె కత్తిరించిన బంగారు రంగు జుట్టు, సామాన్యమైన యూనిఫారం, దానిమీద జూనియర్ సార్జెంటు బిళ్ళలువున్నాయి. డివిజన్ లోని అమ్మాయిల పేర్లన్నీ చెప్పగల మమోంచికిన్ ఇంతకు ముందెన్నడూ యీ అమ్మాయిని చూడలేదు. సర్బిచెంకో ఆమెతో ఆదరంగా మాటాడుతూ చిరునవ్వు నవ్వుతున్నాడు.

"ఏం, నీకిక్కడ బాగుందా?"

"చాలాబాగుంది- ఇంతకంటె ఇంకెక్కడ బాగుంటుంది," సిగ్గుపడుతూ ఆమె జవాబిచ్చింది.

"నిజంగానా? నాదళం ఇతర దళాల వంటిది గాదు. నాదళం చాలా ప్రసిద్ధమైంది...... 'అరుణపతాకం' (రష్యాలో గొప్ప సన్మానానికి చిహ్నం) జయించిన దళంనాది......... నీకెవరూ బాధ కల్గించడంలేదుగా? "

"లేదు కామ్రేడ్ కర్నల్!"

"సరే, అటువంటిదేమన్నా జరిగితే నాకు తెలియ జెయ్యి. ఇక్కడ స్త్రీలు ఎక్కువమంది లేరు. స్త్రీలను బాధించే విషయాలేవీ జరుగనీయను... నీవుమాత్రం అబ్బా యిలతో కలిసి గంతులు వేయవుగదూ ?"

"అలా ఎందుకుచేస్తాను," అని అమ్మాయి నవ్వింది.

"అంతే, అలామాత్రం చేయకు... నాకు అంతా విదితమే. కెప్టెన్ బరాశ్కిన్‌తో వుండటం నేను చాలాసార్లు చూశాను." అని "నీ నడవడికను జాగ్రత్తగా కాపాడుకో! పురుషులు చాలా మోసగాళ్ళు; వాళ్ళు చెప్పేదెప్పుడూ చేయరు," అని చెప్పాడు.

కర్నల్ తన డేరావైపుకు వెళ్ళిపోయాడు; అమ్మాయి అక్కడే చెట్టుక్రింద నిలబడివుంది.

మరుక్షణమే మమోచికిన్ ఆమెయెదుట ప్రత్యక్షించాడు. " మిసెస్, నమస్కారం? "

ఆమె అతనివంక ఆశ్చర్యంగా చూచింది.

" సార్జెంట్ మమోచికిన్, స్కాట్! " అని మడిమలు ఆనించి తననుస్వయంగా పరిచయం చేసుకున్నాడు.

అమ్మాయి నవ్వింది.

"ఇంతకు ముందెప్పుడూ మిమ్మల్ని చూడలేదు. మరో యూనిట్ నుంచి వచ్చారా లేక ఆకాశాన్నుంచేమైనా వూడిపడ్డారా? " అని అడిగాడు.

ఆమెనవ్వి, తాను మరొక దళంనుంచిమారి ఇక్కడకు వచ్చినట్లు తెలియ జేసింది.

"అక్కడ స్కాటులెవరితోనైనా నీకుస్నేహముందా?"

"నేను మొదట హెడ్ క్వార్టర్సులో వుండేదాన్ని."

వారిద్దరూ కలసి నడుస్తున్నారు.

అమ్మాయి నవ్వుతుంది, మమోచికిన్ తనలోవున్న వున్నతమైన రసికతను ప్రదర్శిస్తూ పరిహాసాలాడుతున్నాడు. మనుషులు వచ్చే పోయే ఆమార్గంతప్పించి ఆమెను ఒంటరిగా యెలా తీసుకపోవాలో యోచిస్తున్నాడు.

మాటలమధ్య ఆమెపేరుకూడా గ్రహించాడు. " కాత్యూషా; ఇదిగో నామాట ఆలకించు. ఎప్పుడూ స్కాటులతో స్నేహంచెయ్యి. ఆడవాళ్ళకతి ప్రియమైన వాళ్ళెవరు? స్కాటులే; ఇంకెవరుంటారు? నిఖారైనన వోడ్కా,

మాంచి ఆహారంలభించేదెవరికి? స్కాటులకే. సర్వస్వతంత్రాలు గల్ల స్వేచ్ఛాజీవులు, అత్యంత ధైర్యసాహసాలుగల్లవారుకూడా నిస్సందేహంగా స్కాటులే? తెలిసిందా? నిజంగానీకే స్కాటుతో నూ పరిచయంలేదా? " అన్నాడు. తరువాత వినోదంగా చిరునవ్వు లొలకబోస్తూ, "ప్రసిద్ధమైన మాకెప్టెన్ బారాక్లిన్ కు నీకూపరిచయముందికదూ? ఊఁ? " అనిఅన్నాడు.

" అదినీకెలా తెలుసు? " అని ఆమె ఆశ్చర్యంగా అడిగింది.

"స్కాటులకు సర్వేసమస్తం తెలుస్తాయి."

అతడివెంట అడవిలోకి షికారు వెళ్ళడానికామె నిరాకరించింది, కాని మరొకసారి కలుసుకుంటానని మాట మాత్రం యిచ్చింది. ఆమె నిరాకరణ మొదట మమోచికిన్ కు భాధకలిగించి నాతరువాత తనమనస్సును దిట్టపర్చుకుని, ఆమె వద్ద శలవు తీసుకున్నాడు. తనమిత్రులున్న దిక్కుకు కాలు సాగించాడు.

గుర్రపు సాలలోకి వెళ్లేసరికి అక్కడంతా హడావిడిగా వుంది. పనులు చురుకుగా సాగిపోతున్నాయి. అంతా అతిప్రశాంతంగా వుంది. ప్రతి ' కార్యక్రమ ప్రారంభంలో ఇలాగే జరుగుతుంది. ఈరోజు గస్తీ దళానికి నాయకుడు మర్చెంకో. ఆరుగురు ఆదళంలో వుంటారని అక్కడకు వెళ్ళగానే అతని కర్ధమయింది.

మర్చెంకో ఇంతకు ముందుగానే రక్షణ శ్రేణినుంచి తిరిగి వచ్చాడు. తుప్పుపట్టివున్న ఒకధాన్యంమరవద్ద ఒకమూల కూర్చుని వుత్తరాలు వ్రాసుకుంటున్నాడు. మర్చెంకో వెంట వెళ్ళేవారందరు గోపనపు దుస్తులు ధరించి, చేతి బాంబులతో సహోత్సాహ త్వరగా సిద్ధమవుతున్నారు. "వెళ్ళేసమయమైందా?" అన్నట్టు మధ్య మధ్య ప్రశ్నార్థకంగా మర్చెంకోవంక చూస్తున్నారు.

మర్చెంకో తనభార్యకూ, ఖర్ఖోవ్‌లో వుంటున్న తన తండ్రికీ ఉత్తరాలు వ్రాస్తున్నాడు. తాను సజీవంగా, సకుశలంగా వున్నానని వ్రాశాడు. నేనిక్కడ ఒకఅమ్మాయిని. సంపాదించుకున్నానని నీవనుకోటం పూర్తిగా పొరపాటు" నిభార్యకు వ్రాశాడు. ఆ ఆలోచన సరిగాదని అతడు తరచు వ్రాసిన మాట నిజమే, కాని యుద్ధ ముమ్మరంవల్ల టపా ఆగిపోయింది. ఉత్తరమంతా మామూలు విషయాలతోనే నింపాడు. కాని యీసారి ప్రతి మాటలోనూ ఒక క్రొత్త అర్థాన్ని నింపాడు. ప్రతి పంక్తి ఎన్నో పంక్తుల ఆలోచనల్ని రేకెత్తించేంతయిదిగా వుంది. ఉత్తరాలు ముగించాడు. ఆయన చాలా వుత్సాహంగా వున్నాడు. "కామ్రేడ్స్, అందరూ సిద్ధంగా వున్నారుగదూ? వెళ్దాంపదండి;" బంట్రోతుకు ఉత్తరాలందిస్తూ శాంతంగా అన్నాడు.

ఆతడు తన మనుషు లందర్ని వరుసగా నిలబెట్టి

జాగ్రత్తగా పరిశీలిస్తూ, "కందకాలు త్రవ్వే దళమింకా సిద్ధంగా లేదా?" అని అడిగాడు.

"సిద్ధంగా లేదంటానికి అర్థం?" అని దూరంగా మూల నున్న పొట్టి గుట్టలోంచి 'పనిచేస్తాం' అనే ధీమాగల కంఠ స్వరం విన్పించింది- "కందకాలు త్రవ్వేదళం ఇక్కడేవుంది."

పొట్టి కప్పబడిన యిద్దరులేచి నిలబడ్డారు, వాళ్లు బుగోర్కోవ్ ద్వారా గూఢచారదళం వెంట వెళ్ళగలందులకు పంపబడ్డవారే.

"నేను సీనియర్‌ను," మొదట విన్పించిన కంఠమే ఆ స్థాయిలో పలికింది. పొట్టిగా, బలంగావున్న 20 సంవత్స రాల వయస్సుగల్ల యువక సైనికుని కంఠమది.

"నీ పేరు?" అంగీకార సూచకంగా చూస్తూ మర్చెంకో అడిగాడు.

"మైక్సీమైంకో! మీలాగా యుక్రైన్ నివాసిని."

"యుక్రైన్‌లో యెక్కడ ?" అని మర్చెంకో తిరిగి ప్రశ్నించాడు.

"క్రేమన్‌చగ్!"

"అవును, అయితే మాకు దగ్గరలోవాడివే !......నీకు ఒప్పగించిన పనేమిటో తెలుసుగా ?"

"తెలుసు!" అని మైక్సి మైంకో చురుకుగా జవా

బిచ్చాడు. "జర్మనుల కందకాలను పాడుచేయడం, తంతి తీగల్ని లోనికి పంపే వీలు కలిగించాలి. తరువాత రేపుజరిగే యువక కమ్యూనిష్టుల సమావేశానికి హాజరుకావాలి. నేను యువజనాంగాన్ని సమీకరిస్తూ వుంటాను. ఇదీ నాపని."

మర్చెంకో నవ్వుతూ, "నీవు మంచి అబ్బాయివి. ఇప్పుడు రెండువిషయాల్లో మనిద్దరం సమానులం. నేనుకూడా యువకుల్లో పనిచేసేవాడినే. ఇక వెళ్దాంపదండి." అన్నాడు.

దళం మొత్తం ఒకరివెనుక ఒకరు లైనుగా రోడ్డుప్రక్కగా నడుస్తూ అగ్రభాగంలోవున్న రక్షణశ్రేణి దిక్కుగాపోతున్నారు. అక్కడ త్రెవకిన్ వీళ్ళకై ఎదురుచూస్తున్నాడు.





మర్చెంకో వెళ్లిన అయిమరోజులతరువాత మమోచికిన్ కాత్యాను కలుసుకుని, తమడేరాకు రావలసిందిగా ఆహ్వానించాడు. ఆతడక్కడ స్వయంగా ఇళ్లవద్ద తయారు చేయబడిన వోడ్కా-సీసా నొకదాన్ని దాచాడు.

ఆడేరాలో ఒకమూల తెల్లని డ్రాయరు గుడ్డపరచి దానిమీద అతిరుచికరమైన తినుపదార్థాలు వడ్డించాడు. షిఓకతిస్తోల్, ఇంకా మరికొంతమంది మిత్రుల్ని సహకరించవలసిందిగా ఆహ్వానించి తానువెళ్లి కాత్యాప్రక్క పొట్టుమీద కూర్చున్నాడు.

విందు జోరుగా సాగుతోంది. తలవని తలంపుగా త్రెవకిన్ డేరాలోకి వచ్చాడు. అలా జరుగుతుందని ఎవరూ అనుకోలేదు.

లెఫ్టినెంట్ రాకతో కొంత గడబిడ జరిగింది. మమోచికిన్ మాత్రం చాలా చాకచక్యంగా వోడ్కా-సీసాని కప్పుల్ని దాచివేశాడు. ఆఫీసరుఎదుట తాను భయపడుతున్నానని ఆ అమ్మాయి అనుకుంటుందేమోననేది అతనికి ఆందోళనగా వుంది. కాని త్రెవకిన్ చీవాట్లు అంతకంటె కఠినంగానే వుంటాయి. ఒక అపరిచిత బాలిక దగ్గర చుట్టూచేరి మూల కూర్చునివున్న దళంవంక త్రెవకిన్ ఆశ్చర్యంగా చూచాడు.

అంతా లేచి నిటారుగా నిలుచున్నారు. కాని ఆయన నెమ్మదిగా "ఇదా" అని మూలనున్న పక్కచుట్టమీద పడుకున్నాడు. వరుసగా మూడురోజులనుంచి రాత్రింబవళ్లు ఆయన కన్నుమూసి ఎరుగడు. మర్చెంకో రెండురోజుల క్రిందటే రావల్సింది కాని ఎందుకనో రాలేదు. త్రెవకిన్ వృథాగా నిద్రతో కుస్తీలు పడుతూ ఆ కందకాల్లో ఆతడికోసం నిరీక్షిస్తూ కూర్చున్నాడు. ఆ కందకాలు త్రవ్వే వాళ్లెవ్వరూ కూడా ఇంతవరకూ తిరిగి రాలేదు. చాలా విచిత్రమైనది, భయపడాల్సిన విషయంకూడా. గూఢచారదళం కందకాలు దాటి వెళ్ళిపోగానే వీళ్లమాత్రం తిరిగి వచ్చేయాల్సింది. దళమంతా అంధకారమైన శూన్యంలో కనుమరుగైంది. జాడ తెలియడంలేదు. వర్షం వాళ్ళ గుర్తుల్ని తుడిచేసింది.

త్రెవకిన్ కంబళిమీద పడుకుని కలత నిద్రలో మునిగిపోయాడు.

కొంచెంగా చల్లబడిన స్కౌటులు ఒకొక్క కప్పు త్రాగసాగారు.

"మీ కమాండరు ఈయనేనా?" అని కాత్యా ప్రశ్నించింది. "ఎంత ప్రశాంతంగా, గంభీరంగా వున్నాడు? యువకుడే!" అంది.

త్రెవకిన్ ఒకప్రక్కకు వత్తిగిలి బిగ్గరగానే కలవరించాడు. "చాలా వింతైన మనిషివే. తిరిగి రావడానికి యింత ఆలస్యం

చేశావేం? ముసలి ఖడ్డూసా! కందకాలు త్రవ్వేవాళ్ళిద్దరూ కూడా తిరిగి రాలేదే? మేము చెకోవస్కీ మాటలు వింటూ వుండగా నే మీరు మాయమైపోయారు. విచిత్రమైనమనుషులు."

ఆయన కలవరించినట్లుగా గాక మామూలుగానే మాట్లాడాడు. చాలా విచిత్రమైన విషయం. స్కాటులకు కొంచెం భయం కలిగినట్లుంది. వ్యాకులతతో మమోచికన్ మినహా మిగతావాళ్ళందరూ విడివిడిగా తలోక వాటికి వెళ్ళి పోయారు.

కాత్యా నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడుగాకుండా త్రెవకిన్ దగ్గరకు వెళ్ళి నిలబడింది. నిద్ర పోతున్న పసిపిల్లవాని కళ్ళవలె అతనికళ్లు సగం తెరుచుకుని వున్నాయి. కోటు బొత్తాములు వూడిపోయివున్నాయి. ఆతనిముఖంలో విచారంతో కూడిన బాధ తొంగిచూస్తుంది.

"ఎంత అందంగావున్నాడు?" అంది ఆమె.

"ఆయన్ని లేపకు." అని మమోచికిన్ కఠినంగానే అన్నాడు. ఆమెకు కూడా నిద్రపోయే వ్యక్తి విషయించి మనస్సులో అదే అభిప్రాయం వుంది గనుక అతనిమాటను ఆమె చెడుగా తలచలేదు. "మా లెఫ్టినెంట్ చాలా విచారంగా వున్నాడు." అని మమోచికిన్ సూక్ష్మంగా తెలియ జెప్పాడు.

విందు పూర్తిగా చెడిపోయిందని అందరూ అను

కున్నారు. కాత్యా విచిత్ర వున్నతభావంతో, గంభీరమైన విచారంతో గోడౌన్ నుంచి బయటకువచ్చింది. వసంత ఋతువును పెనవేసుకునివున్న ఆ అడవి మధ్యగా నడిచేటప్పుడు ఆమెకు అకస్మాత్తుగా ఆశ్చర్యము, ఉత్సాహంతో తనభావం అర్థమయింది. ఆమె హృదయాన్ని భేదించిందేమిటి? లెఫ్టినెంట్ యొక్క శైశవం వుట్టిపడే ముఖాన్ని చూసింతరువాత బహుశా ఆముఖంలో తన అంశాన్నేమైనా చూసివుంటుంది- ఆమె హృదయంలో నిండివున్న బాధకు, యుద్ధరంగంలో అత్యంత కఠినమైన బాధలు సహించాల్సి వచ్చిన ఒక యువకుని ఆవరించుకున్న ఈ ప్రస్తుత బాధకు కొంచెం సామ్యం కుదురుతుంది.

కాత్యా తరచుగా గూఢచారదళం మకాంకు వెళ్తూ వుండేది. మమోంచికిన్, ఇగతావాళ్లు త్వరలోనే ఆమె భావాన్ని గ్రహించారు. మమోంచికిన్‌కు సంతోషంకూడా కలిగింది. నిత్య కృత్యము లన్నింటిలో తన లెఫ్టినెంట్‌కు తానే రక్షకుడనని నిర్ణయించుకున్నాడు. కాత్యాతో కలిసి తిరుగుతూ వుంటే ఆయన వ్యాకులత కొంచెమైనా తగ్గుతుందని ఆశించాడు. మర్చెంకో దళము, మర్చెంకో చనిపోయింది ఖాయమని తెలిసినతరువాత త్రెవకిన్ ఇంకెక్కువ విచారంగా వుంటున్నాడు.

కాత్యాను 'నకుకులగదికి' ఆహ్వానించుటకు స్కౌటులు ఒకరికొకరు పడుతున్నారు. లెఫ్టినెంట్‌ను సంబంధించినపాటీ

విషయాలన్నీ వాళ్ళు ఆమెకు చెప్తూవుండేవారు. "మా లెఫ్టినెంట్ గ స్తీనుంచి తిరిగివచ్చారు.' అని చెప్పటానికి కూడా అప్పుడప్పుడు వార్తాహరులు పంపబడుతూ వుండేవారు. త్రెవకిన్‌కు, కాత్యాకు సాన్నిహిత్యం కల్గించటమే వారిపన్నుల్లోని అంతరార్థం, అందుకు వారు చేయగలిగినవన్నీ చేస్తున్నారు. ఈ కుట్రలోని ఒక్క అక్షరంకూడా త్రెవకిన్‌కు తెలియదు.

ఒకనాడు త్రెవకిన్ లోనికివచ్చి చూచి చాలా ఆశ్చర్య పడ్డాడు. తానుండేచోటుకు ప్రత్యేకంగా ఒక మైనపుగుడ్డ అడ్డంగా కట్టబడివుంది. లోపల మామూలుగా పొట్టుపైన వుండే కంబళికి బదులుగా ఒకమంచంవుంది. దానిదగ్గర ఒక డ్రాయిరు, దానిపైన తెల్లని పూలతో అలంకరించబడిన ఒక పూలకుండు వున్నాయి.

"ఇదంతా యేమిటి ?" అని త్రెవకిన్ ప్రశ్నించాడు.:

"ఏమిటి?" అని బ్రెజినీరోవ్ చాలా అమాయకంగా,

"అదే, ఆ రేడియో ఆపరేటరు, మీా సంరక్షణ బాధ్యతలు వహిస్తున్న ఆకాత్యా చేసింది కామ్రేడ్!" అన్నాడు.

త్రెవకిన్ ముఖం కోపంతో ఎర్రనైంది. "మీారు యితరులను దళనివాసంలోకి ఎందుకు రానిస్తున్నారు?"

బ్రెజినీకోవ్ చాలా సిగ్గుపడి ఏమీా మాటపలుకలేదు. మమోచికిన్ యీామాటవిని చేతులుతిప్పుతూ తనలో తానే నెమ్మదిగా గొణుక్కున్నాడు– "ఏం మనిషిరా బాబూ ?

జర్మనులు......జర్మనులు ! ఇంతకుమినహా వేరొకటి ఆలోచించనేలేదు. ఇరవై నాలుగ్గంటలు వాళ్ళ రక్షణశ్రేణులు గుర్తించటం, ప్లానులుగీయటం, ఆనూహ్యంగా మునిగివుండటం, రోజంతా అగ్రభాగమందున్న రక్షణశ్రేణిలో గడపటం......"

ఇక కాత్యా విషయం. ఏదైనా విషయం తనను తాను మరచిపోయి నిమగ్నమై వుండే లెఫ్టినెంట్ భావాన్ని, అతడిలో యౌవ్వనంతో నిండివున్న సిగ్గును చూసి ఆమె మొట్టమొదట చాలా నిరుత్సాహపడింది. ఆమెకు ఇటువంటివిషయాల్లో అలవాటూలేదు, అనుభవమూలేదు. ప్రతిచోటుకు తనను ఆహ్వానించి గౌరవించాలనే కోర్కెమాత్రం ఆమెలోవుంది. ఆమెలోవున్న ఈకోర్కె యిక్కడ సఫలంకావడానికి ఆమెలో వున్న ఏ యితర ఆకర్షణలుమాత్రం కారణంకాదు. దీనికి ఒకే ఒక కారణం ఇక్కడ స్త్రీలు తక్కువ పురుషు లెక్కువ అనే దేనని కూడా ఆమెకు బాగా తెలుసు.

ఆమెకు చాల సంతోషంకల్గింది. తనప్రియుడు సాధారణ వ్యక్తికాడు; ఆత్మాభిమాని; కడు దిట్ట; పనితనపుడు. నిజంగా ఆయన అలాగేవుండాలికూడా. ఆయనఎదుట ఆమెకు విచిత్రమైన సిగ్గువేసేది, తాను సిగ్గుపడటం చూసి ఆమెకే ఆశ్చర్యం కలిగేది. తాను పూర్తిగా స్వేచ్ఛాజీవిననీ, యిష్టం వచ్చినట్లు తిరగవచ్చునని భావించిన కాత్యా ఈమెయేనా? యుద్ధరంగంలోని జీవితంలో తొందరపాటుతో దొంగతనంగా జరిగిన ముద్దులు, కౌగులింతలు, అవి ఏదైనా ప్రత్యేక వ్యద్దే

శంత్తో జరగనీ లేక వృద్ధదేకానికి లోనై, విసుగువలన జరుగనీ, అదే జీవితమని అనుకుంటూ వుండేది.

అతిహ్యాంగా ఎక్కడో ఏనాడో జరిగిపోయిన భూత కాలపు పాతస్మృతులవలె యివన్నీ ఆమెకు గుర్తుకొస్తున్నాయి.

ఆమె ప్రతిరోజు సరుకులగదికి (గోడౌన్) అందమైన పుష్పాలను, పూలకుండులను తెస్తూవుండేది. కాని అంత కంటే మహత్తరమైన నారీత్వమనే సువాసనలుకూడా ఆమె తనతోబాటు తెస్తూవుండేది. ఏకాకీ జీవితాన్ని గడుపుతున్న సైనికుల క్షుద్బాధ దీనినిమిత్తమే. కాత్యాఎడ తమ ఆఫీసును కనబరిచే నిర్లక్ష్యాన్ని వాళ్ళందరు నిరసించేవారు. కాని ఆయన నిజంగానే అలభ్యమైనవాడని మరల గర్వపడేవారు.

ఒకరోజున కాత్యా నీలవర్ణపు పూలకుండులో తాజా పుష్పాలను అలంకరిస్తుంది. సరిగ్గా అదేసమయానికి డివిజను తనిఖీ నిమిత్తం వచ్చిన సైనిక సమాచార శాఖాధ్యక్షుడు కర్నల్ సమియోర్కిన్ లోనికి రావడం జరిగింది. గూఢచార దళపరిస్థితి ఎలావుందో చూడలని ఆయన వచ్చాడు. కాని అక్కడ ఆసమయానికి ఒకనంట మనిషీ, కాపలా సైనికుడు, ఒక అమ్మాయి మినహా మరెవ్వరూ కనిపించలేదు.

" నీ వెవరవు? "

" జూనియరు సార్జెంట్ సిమాకోవా, రేడియో ఆపరేటర్ని. "

" అదా! ఎవరో పువ్వులమ్మే అమ్మాయనుకున్నానులే." అని కోపంగా వున్న కర్నల్ సరకుల గదినుంచి వెళ్ళిపోయాడు.

తరువాత డివిజను కమాండరుతో దీర్ఘ సంభాషణే జరిగింది. ఆయనచాలా నమ్రతు భావంతోను, స్పష్టంగానూ, నిర్మొహమాటంగానూ చర్చించాడు.

" ఈ ప్రాంతంలో శత్రువును గురించిన పరిజ్ఞానం మీకు గడ్డి పోచంతకూడాలేదు, " అని కర్నల్ సేబు యొర్కిన్ డివిజను కమాండరు పైనేరరోపణ చేశాడు. "వాళ్ళ బలాన్ని గురించి, వాళ్ళ కార్య కలాపాల గురించి వాస్తవ విషయాలు తెసుసునని గట్టిగా చెప్పగలవా?"

చాలానిగ్రహంతో కర్నల్ సర్బిచెంకోనవ్వి అదికూడా ఒక పెద్దసమస్యేనా అన్నట్లు తేల్చి వేయాలని ప్రయత్నించాడు.

" నేను తెలుసు కోవాలన్నా ఎలా? అప్పుడప్పుడు డివిజను కమాండరుకు కూడా తనసైన్యంలో జరిగే విషయాలు తెలియవు. శత్రువేమి చేస్తున్నాడో అతనెలా తెలుసుకోవాలి? నేను గూఢచారుల్ని రహస్యాన్వేషణకు పంపాను, ఇంతవరకు తిరిగిరాలేదు. తొమ్మిదిమంది మనుషులంటే మీకేమీ లెక్కలేదు. అన్నిసైన్యాలతోనూ మీకు సంబంధం వుంది. కాని నేను చాలా చిన్నవాడిని. పైగా యీ తొమ్మిదిమంది చావు చాలా నష్టంకలిగించింది. చాలా పెద్దనష్టం! యుద్ధంలో యిప్పటికే చాలామంది గూఢచారుల్ని కోల్పోయాను."

“అదినిజమే! నీ గూఢచారదళంలో ఏమి జరుగుతుందో ఒకసారి పరికించిచూడు. నేను వాళ్ళ మకాంకు వెళ్ళినప్పుడు అక్కడెవరూలేరు. గ స్త్రీ సైనికులకుకూడా వాళ్లెక్కడికి వెళ్లారో తెలియదు. అక్కడ ఒక అమ్మాయిమాత్రం పుష్పాలను అలంకరిస్తూ వుంది. ఎంత కవితామయం? “అని సేమియోర్కిన్ ఎత్తిపొడిచాడు.” మీ పర్యవేక్షణాధికారి మీ గూఢచారుల విషయంలో ఒక పెద్ద నేరారోపణ రిపోర్టు అందిందని అంతకుముందు నాతో అన్నాడు. కాని, కామ్రేడ్ కర్నల్! ఈ విషయంలో నీకేమీ తెలియకపోవచ్చుగాని నాకంతా తెలుసు. ఆరిపోర్టు ఏదో గ్రామంనుంచి వచ్చింది. గూఢచారులలోని చెడుపనులకు కారణంయిది.

కర్నల్ సర్బిచెంకో పర్యవేక్షణాధికారిని హాజరుపర్చవలసిందగా ఆదేశం పంపాడు.

కెప్టెన్ యాస్కిన్ త్వరగానే హాజరయాడు. ఆతడు చిన్న పిట్టలాంటి శాంతంగల మనిషి. ఆతడిముఖంమీద చెదురుగా మసూచికపు మచ్చలున్నాయి. ఉబ్బెత్తుగా విశాలమైన బట్టతల. వచ్చీరాగానే ఆగ్రామంనుంచి వచ్చిన రిపోర్టును చదివి వినిపించాడు. గూఢచారులు తమ యిష్టానుసారం పన్నెండు గుర్రాలను స్వాధీన పర్చుకొని పదింటిని మాత్రమే తిరిగి పంపారు. అస్పష్టంగావున్న సంతకం కలిగిన ఒక రసీదు కూడా ఆరిపోర్టుకు జతపరచ బడివుంది.

"ప్లీజు మనగూఢచార దళమని నీకెలా తెలుసు?"

పర్యవేక్షణాధికారి డివిజను కమాండరు గద్దింపున కేమాత్రం భయపడలేదు.

"ఇందులో ఏమాత్రం సందేహం లేదనే విషయమింకా నిర్ధారణ చేయబడలేదు," అని జవాబిచ్చాడు.

"సరే, అయితే నిర్ణయించి రిపోర్టుచెయ్యి. ఇకనీవు వెళ్లవచ్చు." పర్యవేక్షణాధికారి వెళ్లిపోయిన తరువాత డివి జను కమాండరు కర్నల్ సెమి యార్కిన్ తో చాలా నెమ్మదిగా అన్నాడు.

"సరే, మేముశత్రువుల మధ్యకు ఒక గూఢచార దళాన్ని పంపిస్తాం. కాని మీరు ప్రయత్నంచేసి ఏర్పడ్డ ఖాళీలను భర్తీ చేసుకునెందుకు కొంతమంది గూఢచారుల్ని పంపండి." అని కూడా అడిగాడు.

సంభాషణ ముగిసిన తరువాత అందరివలె కర్నల్ సక్చి చెంగ్ కూడా డేరాబయటకు వచ్చాడు.

ద్వారంచెంత త్వరగాలేచి నిటారుగా నిలబడ్డ సైనికుడిను ద్దేశించి, "త్వరగానే తిరిగివస్తాను." అన్నాడు.

అక్కడొకటి అక్కడొకటి వేయబడివున్న ఆడేరాల్లో ఒకదానిదగ్గరకు వెళ్ళి కాపలా సైనికుడి నుద్దేశించి, "గూఢ చారివా?" అని ప్రశ్నించాడు.

"అవునండీ ! కామ్రేడ్ కర్నల్ !" అని సమాధానం చెప్పి చీకటిగావున్న డేరావైపుకు తిరిగి "ఆటెన్షన్" అని బిగ్గరగా అరచాడు.

లోపల కొంచెం గడబిడ జరిగింది. కమాండరు తదేక ధ్యానంతో అటేచూశాడు. ఆ మసకవెలుతురులో ఎనిమిది మంది గూఢచారులు నిటారుగా నిలబడివుండటం కన్పించింది. ఒకమూల మైనపుగుడ్డ ఒకటి అడ్డం కట్టబడి వుంది. కర్నల్ నిశ్శబ్దంగా అక్కడికే వెళ్ళి తెర తొలగించి చూశాడు. కాత్యాకూడా అటెన్షన్‌లో నిలబడి కన్పించింది. ఒక చిన్ని డ్రాయిరుమీద నీలివర్ణపు పూలకుండు అమర్చివుంది. దాని కిరువైపుల పుస్తకాలు, నోటుబుక్కులు సర్దివున్నాయి.

క్రోధంగావున్న కమాండరుదృష్టి కొంచెం చల్లబడింది. ఆయన కాత్యావంక దహించివేసేటట్లు చూశాడు.

"ఇక్కడ నీ వేమిచేస్తున్నావ్?" అని ప్రశ్నించి, అక్కడ డ్యూటీలోవున్న సార్జెంటువైపుకు తిరిగాడు తరువాత. ఆతడేదో రిపోర్టుచేయడానికి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"మీ కమాండరు ఎక్కడ ?"

"లెఫ్టినెంట్ అగ్రభాగ రక్షణశ్రేణివద్ద వున్నారు."

"తిరిగి రాగానే ఆతణ్ణి నావద్దకు పంపించండి."

ఆయన వెళ్తూ వెనుదిరిగి చూసి "నీవిక్కడే వుంటు న్నావా, నావెంట వస్తావా కాత్యా?" అని అడిగాడు.

"మీ వెంట వస్తున్నాను."

ఇద్దరు బయలుదేరారు.

"నీకింత ఇబ్బంది ఎందుకు? దీనిలో చెడేమీ లేదు. త్రెపకిన్ మంచికుర్రవాడు. ప్రసిద్ధిచెందిన గూఢచారి." అన్నాడు కర్నల్.

ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు.

"అసలు విషయమేమిటి? ప్రేమ కలిగిందా? బాగుంది, అందంగానేవుంది. మరి, క్ర్సాఫెన్ బరాశ్కిన్ గతేమైంది? దూరంగా తుడిచి పారేశావా?"

"అదేమీ కాదండి...... అతడిలో గంభీరమేలేదు... అర్ధంలేకుండా ఏదో..."

కర్నలేదో గొణుగుతూ బాలికయొక్క అర్ధనిమీలిత నేత్రాలవంక కోపంగా చూశాడు.

"మరి త్రెనకిన్. ఆతడికి చాలా సంతోషం కల్గి వుంటుందనిమాత్రం గట్టిగా చెప్పగలను, అందమైనఅమ్మాయి. పూల......"

ఆమె జవాబు చెప్పలేదు. ఆయనకు అర్ధమయింది.

"అతడునిన్ను ప్రేమించడం లేదని నీ అభిప్రాయమా?"

అవమానింప బడిన యుగయుగాల ప్రాచీన ప్రేమదుఃఖ

గాఢ జూనియర్ సార్జెంటు బిళ్లధరించిన ఈ యువతి రూపంలో వచ్చి ఆయన ఎదుట నిలబడింది. ఆతని హృదయాన్ని కదలించి వేసింది. ఇక్కడ ఈ యుద్ధాగ్ని జ్వాలలమధ్య యావ్వనంనిండిన ప్రేమ, మొసలి నోటిలోపడ్డ పక్షివలె విలవిల లాడుతుంది. కర్నల్ చిరునవ్వు నవ్వాడు.

త్రోవలో సైని దళంలోని డాక్టరు ఉలీవిశేవా కలిశాడు. కర్నల్ డాక్టర్ని, కాత్యాను టీ త్రాగడానికి ఆహ్వానించాడు.

డాక్టరు, కర్నల్ యిద్దరు బల్లమీంద కూర్చుని ప్రపంచ విషయాలన్నింటిగురించీ సంతోషంగాకబుర్లు చెప్పుకుంటున్నారు.

కాత్యాలోపల బంట్రోతు సహాయంతో టీ తయారు చేయటంలో నిమగ్నమై పోయింది.

త్రెవకిన్ త్వరగానే వచ్చాడు.

"కూర్చో" అన్నాడు కర్నల్.

బహుశా కర్నల్ తనను త్రెవకిన్నుగురించి అపహాస్యం చేస్తాడేమోనని కాత్యాభయపడింది, కానిఆయన ఆవిషయాన్నే ప్రస్తావించలేదు. ఆయనేదో గుర్రాలను గురించి మాట్లాడు తున్నాడు. ఆమె సిగ్గుగా యువక లెఫ్టినెంట్ యొక్క గంభీర మైన ముఖం వంకచూసింది. కార్య శూరుడైన లెఫ్టినెంట్ యొక్కస్పష్టమైన సమాధానాలు ఆమె విన్నదిగాని వాటిఅర్థం మాత్రం ఆమెకు తెలియలేదు.

చెప్పలేనంత విచారం ముంచుకొచ్చింది.

" ఆయనకు నేనెందుకు వుపయోగ పడతాను? ఆయన చాలా నేర్పరి, గంభీరమైన మనిషి. ఆయనసోదరి వయొలిన్ వాయిస్తుంది. ఆయనొక విజ్ఞాన శాస్త్రవేత్త. మరినేనో? ఒకసాధారణ స్త్రీని—ప్రపంచలో సామాన్య యువతులందరిలో నేనొకతెను." అని ఆమె:ఆలోచించుకుంది.

తనకు సంబంధించినంత వరకు కాత్యా అభిప్రాయాలను గురించి త్రెవకిన్ కు ఏమీ అనుమానం రాలేదు. ఆతడామెను చూస్తేసరి చాలాచిక్కుల బడేవాడు. చాలా వ్యాకులపడేవాడు. ఆమె యిష్టంవచ్చినట్లు తమడేరాకు వచ్చిపోవడం, తనవిశ్రాంతి విషయంలో పిలవని పేరంటగా వచ్చి ప్రదర్శించే ఆరాటము, మొదలైన విషయాలన్నీ తెలివితక్కువవిగాను, అసభ్యంగానూ పెత్తనం చలాయించే పద్ధతిగానూవుండి ఆయనకురోతకలిగించేవి. తన గూఢచారుల ఎదుట యివన్నీ ఆయనకు అర్థరహితంగా కన్పించేవి. ఆమె డేరాలోకి రాగానే అందరూ అర్థంలేకుండా ఒకరి ముఖాలొకరు చూసుకుని ఆయిద్దర్ని ఒంటరిగా వదలి వెళ్లటానికి ప్రత్యంక్షగానే ప్రయత్నించేవారు.

ఆమె తమ డివిజను కమాండరుగదిలో కూర్చుని వుండ టం చూసి త్రెవకిన్‌కు చాలా ఆశ్చర్యంకల్గింది. కర్నల్ గుర్రాల విషయం ప్రస్తావించేనప్పుడు, "ఈ కాత్యాయే గూఢ చారుల నుంచి విషయాలు తెలుసుకుని తనికీ బెడద తెచ్చి పెట్టింది," అని అనుకన్నాడు.

అసలు జరిగిన విషయాన్నంతా త్రెవకిన్ సంక్షిప్తంగా చెప్పాడు. అకస్మాత్తుగా కర్నల్‌కు ఆ ప్రయాణంలోని ఆరోజు లన్నీ జ్ఞప్తికొచ్చాయి. అంతుపొంతులేని అనంతమైన మార్గం, తీవ్ర సంఘర్షణ, ఆ బురదరోడ్డుమీద నిలబడి మార్చి నెలలో ఆ మూడవ ఝాము వేళ తాను గూఢచారదళాన్ని వ్యంగంగా చీవాట్లు వేస్తున్నాడు. మొదటి ప్రపంచయుద్ధం లోని ఆ పాతగూఢచారి కార్పోరల్ సర్బీచెంకో, ఒక క్షణం కాలం కర్నల్ సర్బీచెంకో యొక్క ముడుచుకున్న అకుపచ్చని బూడిదరంగు కళ్లలో సమర్థనీయంగా తొంగి చూశాడు.

"సరే, త్రెవకిన్!" అని తరువాత, "నీవాగుర్రాలన్నిటను తిరిగిపంపి వేశావా?" అని కర్నల్ ప్రశ్నించాడు.

"నిజంగా పంపేశాను కామ్రేడ్ కర్నల్."

ఇంతలో ద్వారంచెంత అడుగుల చప్పుడు విన్పించింది కెప్టెన్ బరాశ్కిన్ లోనికివచ్చాడు.

"ఏమికావాలి?" అని సర్బీచెంకో అయిష్టంగా అడిగాడు.

"కామ్రేడ్ కర్నల్, మీరు నన్ను పిలిపించారుగదూ?"

నేను నీకొరకు మనిషిని పంపింది మూడు గంటల క్రితం సెమియోర్కిన్ నీతో చెప్పాడా?"

"అవునండి, కామ్రేడ్ కర్నల్!"

" మరైతే? "

" మనం ఒక గూఢచార దళాన్ని శత్రువుల మధ్యకు పంపుదాం."

" దానికి నాయకత్వమెవరు వహిస్తారు? "

తనలో వున్నదురుద్దేశమును కప్పి పుచ్చుతూ, "ఇదుగో త్రెవకిన్ గారే!" అన్నాడు.

కాని తన ప్రతివాదిని గుర్తించటంలో ఆతడు చాలా పొరపాటు చేశాడు. త్రెవకిన్ రెప్ప వేయలేదు. ఉలీబిసేవా మౌనంగా గ్లాసులు నింపాడు. ఈ జరిగేదంతా ఏమిటో అతడికేమిటో బోధ పడలేదు. ఈ మాటలు తన ప్రేమయొక్క అదృష్టంతో ప్రత్యక్ష సంబంధం కలిగి వుంటాయని ఆమె స్వప్నంలో కూడ వూహించలేదు.

కెప్టెన్ కళ్ళల్లోవున్న భావాన్ని గ్రహించగలిగింది ఒకే ఒక వ్యక్తి - డివిజను కమాండరే. కాని దానిని త్రోసి పుచ్చుటకు తగిన కారణం లభించలేదు. అసమాన ధైర్య సాహసంతో ఈ పనిని సాధించగల వ్యక్తి ఒక్క త్రెవకిన్‌కు మినహా మరెవరూ లేరనేది మాత్రం నిర్వివాదాంశం.

"సరే, బాగానేవుంది." అని బరాశ్కిన్ ను బయటకు పంపించి వేశారు.

త్రెవకిన్ కూడా యెక్కువసేపు ఆగలేదు. త్రెవకిన్ లేచి నిలబడ్డాడు. "సరే, వెళ్ళు." అన్నాడు కర్నల్.

"పని చాలా కఠినమైనది. తగిన బందోబస్తు చెయ్యి."

"అలాగే కామ్రేడ్ కర్నల్!" అని త్రెవకిన్ డేరానుండి బయటకు వచ్చాడు.

త్రెవకిన్ అడుగుల చప్పుడు విన్పించినంత సేపు కర్నల్ వింటూనే వున్నాడు. తరువాత నిరుత్సాహంగా, "గొప్ప మనిషి," అన్నాడు.

త్రెవకిన్ వెళ్ళిన తరువాత కాత్యా వ్యాకుల పడింది. ఆమెకూడా నమస్కరించి శలవు తీసుకుంది. వెచ్చని వెన్నెల రాత్రి ఎక్కడో దూరాన విన్పించే ప్రేలుడు, లేక ఏ ట్రక్కుల ధ్వనో మినహా అడవంతా మైమరచి నిద్రించినట్లు ప్రశాంతంగా వుంది.

కాత్యా చాలా సంతోషంగా వుంది. రోజూకంటే త్రెవకిన్ ఈరోజు తనవంక చాలా అనురాగంతో చూచినట్లని పించింది. సర్వాధి కారియైన డివిజను కమాండరు ఎల్లప్పుడు తనమీాద దయచూపినట్లే ఈ విషయంలో కూడా కాత్యా చెడ్డమ్మాయి కాదని, ఆమెలో గౌరవించ దగిన గుణాలున్నా యనీ త్రెవకిన్‌కు నమ్మకం కలిగించగలరని ఆమె ఆలోచించింది. తన ప్రియాన్వేషణలో ఇంతకుముందు తాను వినీ చదివీకూడా వుండని పాటలలోని పాటతో సమానమైన పాతపాటల్ని కూని రాగాలు తీస్తూ వెన్నెల్లో తడసిన ఆరాత్రి విహరించ సాగింది.

---

# 8

కా(మేడ్ లెఫ్టినెంట్! అభివందనాలు. మీ గూఢచారి సార్జెంటు, ప్రథమదళ నాయకుడు అయిన వసిలీవిచ్ ఆనీ. కానోవ్ (వాయు సంగతులు- నేను చాలాహాయిగా వున్నాను. మీరుకూడా అలాగే వుండాలని హృదయ పూర్వకంగా కోరు కుంటున్నాను. నాకాలి కండల్లో చిక్కు కున్న తుపాకి గుండును హాస్పటల్లో తీసి వేశారు. తరువాత హాస్పటల్ నుంచి నేను ఒక రిజర్వు రెజిమెంటుకు పంపబడ్డాను. మొట్ట మొదట నా కక్కడ ఏమీ నచ్చలేదు. ఇక్కడ యుద్ధరంగంలో లభించేకంటే చాలా అసహ్యకరమైన ఆహారమిచ్చేవారు. పైగానేను బాగా తినగల వాడనాయె! యుద్ధరంగంలో లభించే కోటాకు అలవాటు పడ్డ మనిషిని. రోజంతా డ్రిల్లు చేయడ మొకటి. మరలమొదటి నుంచి క్రమ శిక్షణ నేర్చు కోవాల్సి వచ్చింది. 'ఆక్రమణ చేయండి' 'ముందుకు సాగండి' అనే నియమాలు అరవాల్సి వచ్చేది——కాని చూడండి! ఇక్కడ ఆక్రమణ చేయ టానిక్కి జర్మనులు వుండరు, కాల్చటానికి తుపాకుల్లో గుళ్లూ వుండవు! ఇంకొక విషయమేమంటే నావాల్వర్ రివాల్వర్ వాళ్లు తీసేసు కున్నారు——బహుశా మీకు గుర్తు వుండే వుంటుంది, కళ్లకు నల్లనిగుడ్డ పట్టీలు కట్టుకున్న 'ఆ' జర్మనీ కెప్టెన్ గాడి దగ్గర నుంచి నేనా రివాల్వరు తీసుకున్నాను. నేను బటాలియన్ కమాండరు దగ్గరకు వెళ్లి ఫిర్యాదు చేసుకున్నాను. రూల్సు ప్రకారం ఒక సార్జెంటు వద్ద రివాల్వరు వుండకూడదని ఆయనన్నాడు.

నేను మామూలు సార్జెంటును కాదు, నేను గూఢచారి ననీ, ఇప్పటి వరకు ఇటు వంటివి రెండు వందల రివాల్వర్లనైనా వుపయోగించి వుంటానని చెప్పినా ఆయన వినలేదు. తరువాత అక్కడనుంచి ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మార్చబడ్డాను. ప్రస్తుతం యిక్కడ ఒక సంపన్న సమిష్టి రైతు జీవితాన్ని అనుభ విస్తున్నాను. రక రకాల కూర గాయలు, వెన్న, మీగడ మొదలైన వస్తువులన్నీ లభిస్తున్నాయి. ప్రారంభంలో ఈ స మిష్టి వ్యవసాయ క్షేత్రమునకు అధ్యక్షుడను నేనే, ప్రస్తుతం నడిపేది కూడా నేనే గనుక నాకివన్నీ దొరుకు తున్నాయి. ఇక్కడ దుక్కులు, నాట్లు వగైరా పనుల్లో సమయమంతా గడుస్తుంది. సాయంత్రం రాత్రి భోజనం ముగించి పాలు త్రాగి మెత్తని పరుపుమీద పడుకుంటాను. నేనువుండే ఇంట్లోఒక స్త్రీ కూడావుంది. ఆమె నాకు అన్నివిధాలా తోడ్పడుతూవుంటుంది. యుద్ధం ప్రారంభమైన మొదటి సంవత్సరంలోనే ఆమెభర్త చని పోయాడు. కామ్రేడ్ లెఫ్టినెంట్! నే నెప్పుడూ మిమ్మల్నీ, మన దళాన్నీ గురించి ఆలోచిస్తూ వుంటాను. మనం చేసిన పనులను స్మరించుకుంటూ వుంటాను, మహత్తర మైన మన మాతృ భూమికై మీరు చేసే త్యాగాన్ని, అనుభ వించే కష్టాల్ని గురించి ఆలోచించినప్పుడు నిజంగా నాహృదయం ఆవేశంతో నిండిపోతుంది. అది మీకు మాటల్లో వ్యక్త పరచలేను. కామ్రేడ్! లెఫ్టినెంట్! నావిషయంలో మీరు దయచేసి కర్నల్ సర్బిచెంకోతో మాట్లాడండి. అర్జీ దాఖలు చేసుకుంటే బహుశా వారంగీకరించిన నేను మరల మీదగ్గరకు

వస్తాను. మిమ్మల్నందర్నీ విడచి నాకిక్కడ వుండటం కష్టంగా వుంది. యుద్ధం ముగిసేవరకు నేను మీతో గడపలేకపోయి నందుకు ఎంతో సిగ్గుపడుతున్నాను. ఇక్కడ నేననుభవించేది ఒక సంపన్న సమిష్టి జీవితాన్ని, మీరందరు నన్నిక్కడ. కూర్చోబెట్టి ఫాసిస్టులనుంచి కాపాడుతున్నట్లుంది. మీకు, ఆదరణీయమైన దళమునకు నా నమస్కారములు.

శలవు,

ఈ వా న్ వ సీ లి వి చ్ ఆ నీ కా నో వ్.

త్రైవకిన్ వుత్తరాన్ని ఎన్నోసార్లు చదివాడు. అతని మనస్సు కలతచెందింది. తరువాత కొంచెంగా చిరునవ్వు నవ్వాడు. ఆనీకానీవ్ తనవద్ద నిలబడివున్నట్లే అనిపించింది. కళ్ళముందు అతనిరూపం స్పష్టంగా మెదులుతూవుంది. నిజంగా ఆనీకానోవ్ తనవద్దవుంటే ఎంతో బాగుంటుంది. అక్కడ తన చుట్టూ నిద్రపోతున్న దళసభ్యుల వంక తిరస్కారంగా చూచి ఎక్కడో వున్న ఆనీకానోవ్‌తో వారిని పోల్చుకున్నాడు.

"ఏమాత్రం పోసగదు ! అతనికి వీళ్ళకు పోలికేలేదు. అతనిలోవున్న నిశ్చలమైన సాహసం, ధైర్యం, నిర్మలమైన మనస్సు వీళ్ళల్లో ఎక్కడేడ్చింది? నే నతడిపై మాత్రమే ఆధార పడి వుండగలిగేవాడిని. గాబరా అనేదే ఎరుగని ధీరుడు. మమోచికనేకూడా వీరుడేకాని సమయస్ఫూర్తిగల సహజమైన తెలివితేటలు లేవు; వట్టి స్వార్థపరుడు. బాయ్‌కోవ్ తెలివి గలవాడేగాని అతితెలివిని ప్రదర్శిస్తాడు. మౌనంగా వుండే

తెలివితేటలవల్ల అప్పుడప్పుడు పిరికితనంవల్ల కలిగేదానికంటే ఎక్కువే నష్టం కలుగుతుంది. బ్రెజనీకోవ్‌లో కొన్ని మంచి గుణాలున్నప్పటికి తన స్వశక్తి మీద ఆధారపడలేడు. గోలూవ్, సెమియోనోవ్ లున్నారంటే స్వచ్ఛమైన గూఢచారుల్లో లెక్కించ బడటానికే అనర్హులు. మర్చెంకో అమూల్యమైన రత్నంలాంటివాడే; ఒకవేళ చంపివేయబడ్డాడేమో! మమ్మల్ని వదలి శాశ్వతంగా వెళ్ళిపోయాడు."

ఈ చేదు ఆలోచనతో విసుగెత్తింది- అనీకానోవ్ వుత్తరం చదివినతరువాత కలిగిన భావ ప్రభావంవల్ల మిగతా గూఢచారులవిషయంలో వాస్తవం చెప్పే స్థితిలో లేడు. ఆయన వెంటనే డేరానుంచి బయటకువచ్చి ప్రాతఃకాలపు చల్లదనానికై బయలుదేరాడు.

తనసైనికులు ట్రైనింగ్ నిమిత్తం ఎన్నుకున్న ఎత్తైన ఆ నదీ తీరపు మిట్టవైపుకు నడిచాడు.

ఆ ప్రదేశమంతా యుద్ధరంగానికి గొప్ప ప్రతి రూపం. తీవ్రమైన నదీ ప్రవాహం వెడల్పాటి గట్టును చాలావరకు కోసేసింది. పచ్చదనంతో మార్పు చెందుతూన్న చెట్లు నదిలోనికి వంగి వున్నాయి. శత్రుగమనాన్ని కనిపెట్టటానికి స్కౌటులకు వుపయోగ పడేటట్లు తక్కువ లోతు కందకాలున్నాయి. వాటికి ముందుభాగాన రెండు వరుసలు ముళ్లతీగె వేయబడివుంది. ఇవన్నీ శత్రువుల రక్షణ శ్రేణి యొక్క నకిలీ రూపాలు.

ప్రతిరోజు రాత్రుళ్లు త్రెవకిన్ తన గూఢచార దళాన్ని ఈనకిలీ 'యుద్ధరంగానికి' తీసుకు వచ్చేవాడు. అతడిలో వున్న సహజమైన పట్టుదలతో, తన దళంచేత మంచుతో నిండివున్న నదిని దాటించే వాడు. ఆ ముళ్లతీగెను నరికించే వాడు; సొరంగాలు త్రవ్వే యంత్రాలతో ఎడతెరపి లేకుండా సొరంగాలు త్రవ్వినట్లు ప్రాక్టీసు చేయించేవాడు. తరువాత అక్కడ కందకాలు వున్నట్లే భావించి వాటిని దూకించేవాడు. నిన్న అతనికి తట్టిన కొత్త వ్యూహంతో కొంత మంది గూఢచారుల్ని కందకాల్లో కూర్చోబెట్టి మిగిలిన వాళ్లను నిశ్శబ్దంగా పాకుతూ వాళ్ల దగ్గరకు చేరుకోమన్నాడు. దానివల్ల చప్పుడు గాకుండా ముందుకు సాగే అలవాటవుతుంది. తానే స్వయంగా కందకంలో కూర్చుని ధ్వనుల్ని వింటున్నాడు. కాని ఆయన ఆలోచనలు ఆ నకిలీ యుద్ధరంగంలో కంటే శత్రువుల వాస్తవ మైన యుద్ధరగంలో విహరిస్తున్నాయి. శత్రురక్షణ దుర్గం చుట్టూ కట్టు దిట్ట మైన ఏర్పాట్లతో బలమైన ఆవరణ ఏర్పరచారు. తమదళం త్వరలో నే అక్కడికి చేరుకోవాలి. వాళ్లకు ప్రాక్టీసు యివ్వడానికి తను కందకంలో కూర్చుని శత్రు దుర్గాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

త్రెవకిన్ దళానికి మరికొంతమంది క్రొత్తవాళ్లు అదనంగా పంపబడ్డారు. భవిష్యత్తులో తమతోపాటు కార్య రంగంలోకి రావాలంటే పాతదళంతోపాటు పదిమంది క్రొత్త వాళ్ళకు కూడా అదంతా నేర్పాలి. పైగా శత్రువుయొక్క

అగ్ర రక్షణ శ్రేణినిగురించి రోజూ చాలా మెళకువగా వుండాల్సి వచ్చేది. తనిఖీచేస్తూ, వాళ్ళ కార్యక్రమాలను, పద్ధతులను, విషయాలన్నింటిని ప్రతినిముషం కనిపెట్తూ వుండాలి.

అంతుపంతులేని యీ ఎడతెగని కార్యక్రమంవల్ల క్షణం కూడా తీరికలేక త్రెవకిన్ చిరచిరలాడుతూ వుండేవాడు. ఇంతకు ముందు ఏ గూఢచారివల్లనైనా చిన్నచిన్న పొరబాట్లు జరిగితే చూసీచూడనట్లు వూరుకునేవాడు. కాని ప్రస్తుతం స్వల్ప దోషాలనుకూడా కఠినంగా చీవాట్లు వేస్తున్నాడు. ఈ చీవాట్ల జాబితాలోకి మొట్టమొదట ఎక్కింది మమోచికన్. అతడ్ని భోజన సామగ్రిని ఎక్కడనుంచి తెస్తున్నాడో సంజాయిషీ చెప్ప వలసిందిగా తీవ్రంగానే అడిగాడు. మమోచి కన్ అసలువిషయాన్ని కప్పిపుచ్చి మాటలు మింగుతూ రైతులు కానుకలిస్తున్నారని చెప్పాడు. కాని త్రెవకిన్ ఆతణ్ణి మూడు రోజులు వరుసగా సెంట్రీడ్యూటీకి వేశాడు. "ఈమూడు రోజులైనా ఆరైతులు నీకానుకల పీడావదలి సుఖపడతారు." అని కూడా అన్నాడు.

ఇక కాత్యా విషయంలో కూడా శాంతంగా, గట్టిగానొక్కి చెప్పాడు—ప్రస్తుతం యీ డేరాకు రావద్దని ప్రార్థించాడు. ఆతడి భయంగొల్పే కళ్లుచూసి ఆమె నిజంగానే భయపడింది. మరల తనమాటల్ని వుపసంహరించుకోవాలను కున్నాడు. కాని ఆమాటలు నాలుక చివరవరకు వచ్చి ఆగి పోయాయి.

కజాన్ ప్రాంతనివాసి, పొడగరి అందగాడు అయిన షిఓకతిస్తోవ్ యొక్క అతి వింతవ్యవహార మొకటి త్రెవకిన్‌కు అన్నిటి కంటే ఎక్కువ కోపాన్ని కల్గించింది.

ఆరోజు ఉదయం వర్షం కురుస్తుంది. దళానికి విశ్రాంతి నివ్వాలని త్రెవకిన్ నిర్ణయించుకున్నాడు. డేరానుంచి బయలు దేరి తాను జర్మనీభాష నేర్చుకుంటున్న దుబాసీ బరాశ్కిన్ కందకంవద్దకు నడచాడు. అక్కడ పొదల్లో ఆ పొడగరి, అందగాడు, ఆ వర్షంలోనే నడుంవరకు నగ్నంగా పడుకుని వుండటం కన్పించింది. త్రెవకిన్ ఆతడినిపిలిచి ఏమిచేస్తున్నా వని ప్రశ్నించాడు. షిఓకతిస్తోవ్ చంగునలేచి నిలబడి సంకోచంగా– “నాకు చన్నీళ్ళ స్నానంచేసే అలవాటుంది కామ్రేడ్ లెఫ్టినెంట్! నేను యింటిదగ్గరకూడా యిలాగే చేస్తూవుంటాను.” అని జవాబు చెప్పాడు.

కాని ఆరాత్రి గూఢచారులు నిశ్శబ్దంగా ప్రాకటం ప్రాక్టీసు చేస్తున్నప్పుడు షిఓకతిస్తోవ్ గట్టిగా దగ్గాడు. మొదటి సారి ఆతడు దగ్గినప్పుడు త్రెవకిన్ అంతగా పట్టించుకోలేదుగాని రెండవసారి ఆయనకు అర్థమయింది. షిఓకతిస్తోవ్ తెలిసే చేతులారా జలుబు తెచ్చుకున్నాడు. దగ్గేవాళ్ళను గూఢచార దళంతో తీసుక వెళ్ళగూడదని వెనుకటి గూఢచార అనుభవాలను బట్టి ఆయనకు తెలుసు. ఆతడి దగ్గువల్ల దళం మొత్తానికే ముప్పురావచ్చు.

త్రెవకిన్‌కు అంతకు ముందెన్నడూ జీవితంలో రానంత

కోపం వచ్చింది. వెన్నెల్లో ఆశ్చర్యంగా చూస్తున్న మిగతా గూఢచారుల ముందు వెంటనే ఆ పొడుగాటి అందగాడైన పిరికిపందను కాల్చివేయాలన్నంత కోపంవచ్చింది. కాని అతి ప్రయత్నంతో కోపాన్ని అణుచుకోగలిగాడు.

“ ఉఁ! అయితే నీవు చన్నీళ్లలో స్నానం చేస్తుంది ఇందుకన్నమాట? నీచుడా! పిరికిపందా!”

మరుసటి రోజునే షివోకలిస్తోవును దళం నుంచి తొలగించారు. త్రెవకిన్‌కు ఈవిషయం స్ఫురణకు వచ్చినప్పుడల్లా ఎంత తమాయించుకున్నా పట్టరానంత ద్వేషం కలిగేది.

సూర్యోదయమైంది. తనతో కూడా మరి ద్దరు గూఢచారుల్ని వెంటపెట్టుకుని అగ్రభాగపు రక్షణ శ్రేణి దగ్గరకు వెళ్లేందుకు మామూలు మార్గంవెంట నది వంకకు బయలు దేరాడు.

దగ్గరకు చేరిన కొద్ది అగ్ర రక్షణశ్రేణి వాతా వరణపు ఆకర్షణతో భారము, గంభీరమూ కాజొచ్చింది. అది భూమి మీాద వుండేవస్తువుగా గాక ఏదో అర్థంకాని సామ్యం లేని రూపంతో, ఒకవిశాలమైన గ్రహంలోని ఒకభాగమూ అన్నట్లు తోస్తుంది. మిషన్ గన్ల కాల్పులవల్ల కలిగే మిరుమిట్లు గొలిపే వెలుగు......చెవులు బ్రద్దలయ్యేట్లు పేలేబాంబులు .........మరల ఆ మరుక్షణమే మృత్యువుతో కూడుకున్న

భయంకర పరిణామం...... బాంబులవల్ల ధ్వంసమైన చెట్లను దాటుకుంటూ, ఫిరంగులు అమర్చబడివున్న శ్రేణిని అధిగమించి, ఆకుపచ్చని యూనిఫారం ధరించివున్న గూఢచారదళం ఒకరి వెనుక ఒకరు లైనుగా రణరంగ సమీపానికి పురోగమిస్తున్నారు.

ద్వితీయ సైన్యపు కందకాల్లో త్రెవకిన్‌కు మమోచికన్ కన్పించాడు. మూడురోజుల శిక్ష ముగిసిన అనంతరం శత్రు గమనాన్ని కనిపెట్టుటకు ఆతణ్ణి పర్మినెంటుగా నియమించారు. దీనివల్ల శత్రువులకు దగ్గరగానూ, కోడిపిల్లలకు దూరంగానూ వుంటాడు. పాదాల్ని దగ్గరకుచేర్చి నిటారుగా నిలబడి శత్రు స్థావరానికి సంబంధించిన మ్యాపును, గత 24 గంటల్లో శత్రు గమనానికి సంబంధించిన వివరాలను త్రెవకిన్‌కు వప్పగించాడు. ఒక మెషిన్‌గన్ల డేరాలోనుంచి త్రెవకిన్ దూరదర్శినిద్వారా శత్రు భూభాగంవంక పరీక్షగా చూశాడు. బటాలియన్ కమాండర్ కెప్టెన్ ముస్తకోవ్, ఫిరంగిదళ కెప్టెన్ గురేవిచ్ లిద్దరూ తరచు ఇక్కడే కలుసుకునేవారు. గస్తీదళం ముందుకు సాగుతుందనే విషయం వాళ్ళకు తెలుసు. "పాపం! మేమిక్కడ రక్షణగల కందకాల్లో వుండి మీరు ముందుకు వెళ్లాల్సి వస్తుంది." అని వాళ్ళకళ్లు క్షమార్పణ కోరుతూ అన్నట్లుంది. వాళ్ళముఖాలుచూస్తే అందుకే త్రెవకిన్‌కు చాలా కోపం వస్తుంది.

వారి వున్న నమ్రత, ఎల్లప్పుడు ఆయనకు సహాయ

పడాలని వారిలోవున్న వుత్సాహము, ఆయన ధైర్యాన్ని చలింపజేస్తున్నాయి. వారి భావాలు ఇప్పటినుంచే ఆయన్ని పురితీసేస్తున్నట్లనిపించింది. ఆయన హృదయం వీటన్నిటకు విరుద్ధంగా నిశ్చలంగా వుండేది, తరువాత త్రెవకిన్ ఒక కన్ను మూసి దూరదర్శినితో చూసినవ్వి మనస్సులోనే అనుకున్నాడు.

"చూస్తూవుండడండోయ్ మిత్రుల్లారా ! మీకంటే ఎక్కువగానే నేబ్రతుకుతాను."

అంతమాత్రంచేత ఆయన వాళ్ళవిషయంలో అశుభాన్ని కోరుతున్నాడని అర్థంకాదు. వాళ్ళిద్దరిఎడ ఆయనకు చాలా ప్రేమ. వాళ్ళను చాలా మెచ్చుకుంటూ కూడా వుంటాడు. అందగాడైన యువక ముశ్తకోవ్ డివిజనులోని అందరికంటే మిన్నయైన బటాలియన్ కమాండరు. ఇక గురోవిచ్ విషయంలో చూస్తే, అతడిలోవున్న వినమ్రత, నియమపాలన, గణితంలో ఆతడికున్న ప్రతిభ త్రెవకిన్‌ను ఎక్కువగా ఆకర్షించేవి. ఆతడి ఫిరంగిదళం ఎంతో నేర్పుతో ఆశ్చర్యం కలిగించేంతగా పేల్చేది. అదిచూచి నిజంగానే జర్మనులగుండెలవిసిపోయేవి; భయంతో కంపించేవారు. గురోవిచ్ ఉదయం నుంచి సాయంత్రంవరకు కందకంలోకూర్చుని విపరీతమైన ద్వేషంతో తెంపులేకుండా జర్మనుల కూపీలు తీస్తూవుండేవాడు. ముఖ్యమైనవన్ని ఎక్కువ విషయాలు ఆతడిద్వారానే త్రెవకిన్‌కు తెలిసేవి. కర్తవ్య నిర్వహణలో ప్రమాదకరమైన నిష్ఠబూనటం తనలోవలెనే గురోవిచ్‌లో వుండటం ఆయన గమనిం

చాడు. తన స్వార్థాన్ని గురించి గాక తాను నిర్వహించవలసిన కర్తవ్యమునుగురించి మాత్రమే ఆలోచించటం అనేదే త్రెవకిన్ మొదటినుంచి నేర్చుకుంది. గురోవిచ్ కూడా యీ తెగలోకే వస్తాడు. వారిద్దరూ ఆత్మీయులవలె సంభాషించుకుంటారు. నిజానికి వారు ఒకే వంశములోనివారు— తమ ఆదర్శాలను హృదయపూర్తిగా నమ్మి, ఆ ఆదర్శాలకోసం ప్రాణా లర్పించే మా దేశపు మానవవంశంలోనివారే వారుకూడా.

త్రెవకిన్ తదేక దృష్టితో జర్మనుల కందకాలను, వాటి ముందు వేయబడివున్న ముళ్ళతీగవరసలను గమనిస్తున్నాడు. వాటికి తమకు మధ్యవున్న ప్రదేశంలోని మిట్ట పల్లాలను, శత్రువుల మిషన్ గన్లను, గుళ్లుదూసుకు వస్తున్న దిక్కులను, రాకపోకల కొరకు నిర్మించ బడ్డ కందకాల్లో అక్కడక్కడా జరుగుతూన్న పనుల్ని, వీటన్నింటి యొక్క వ్యూహ చిత్రాన్ని మనస్సులో ఒక్కటి కూడా బీకుపోకుండా చిత్రించు కున్నాడు.

శత్రువులకు, తమకు మధ్య ఎగురుతూన్న కాకులువంక త్రెవకిన్ ఈర్ష్యాభావంతో చూశాడు. వాటిని యీ భయంకర ఆటంకాలేవి ఏమీ చేయలేవు. అవి అసలు వీటిని లెక్కచేయవు. ఒకవేళ కావాలంటే అవి శత్రుశ్రేణిలోని ప్రతి విషయాన్ని తమకు అందజేయలేవా? ఆయన వెంటనే మనస్సులో మాటలు చెప్పగలిగిన ఒక కాకిని వ్యూహించుకున్నాడు— ఒక కాకి అది గూఢచారైతే! నిజంగా తాను మాట్లాడగలిగిన కాకిగా

మారగలిగితే ఒక క్షణంలో ఈమానవ శరీరాన్ని విసర్జించి వేయవచ్చుగదా అనుకున్నాడు.

విషయ సేకరణచేస్తూ, వాటన్నిటిని రాసుకుంటూ, మనస్సులోకూడా గుర్తుంచు కుంటూన్నాడు. ఈకార్య భారంవల్ల తలతిరిగి పోతుంది. వెంటనే ఆ చూకీ తీయటానికి అక్కడ కొంతమంది గూఢచారుల్ని నియమించి తాను ముత్శకోవ్ కందకంలోకి వెళ్లాడు.

నవయువకుడైన పట్లన్ కమాండరు, క్రొత్త యూనిఫారాలు, ఎర్రగా వెడల్పై శ్రేష్టమైన చెప్పులు ధరించి, ట్రైనింగ్ సెంటర్లనుంచి క్రొత్తగా వచ్చిన జూనియర్ ఆఫీసెంటలు అంతా ఒకేచోట చేరివున్నారు. గందరగోళంగా వున్న తమ మాటల్ని ఆపివేసి ప్రశాంతగా, గౌరవంతో ఆయనకు నమస్కారం చేశారు. బల్లమీద కూర్చున్నాడు. యువక ఆఫీసర్లు తనవంక వుత్సాహంగా చూస్తుండటం గమనించాడు. వాళ్లను గురించిన ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఈయువకులు జీవిత యంత్రం తరచు చాలా చిన్నదిగా వుంటుంది. వాళ్లు పెద్దవాళ్లవుతారు, స్కూలుకు వెళ్తారు, వాళ్ల కేవేవో ఆశలు, ఆనందాలు, విషాదాలు వుంటాయి. తరువాత ఒకనాడు మసక మసకగావున్న వుదయాన్నే ఒకళ్లు తమవాళ్లను దండయాత్రకు సిద్ధపరుస్తారు. ఆతరువాత మరెప్పుడూ లేవకుండా వుండేందుకు ఆతడి నేలమీద పడుకుంటూరు. ఒక్కొక్కసారి వాళ్లను గురించి రెండుమంచి

మాటలేవైనా ప్రజలకు చెప్పడానికి అవకాశంకూడా చిక్కదు —వాళ్లతో ఎక్కువ పరిచయం లేకపోవడమే అందుకొక కారణం. ఒకరికొకరు అపరిచితుల్లాగానే వుండిపోతారు. ఈదుస్తులు చాటున హృదయాలెలా పనిచేస్తున్నాయో? సున్నితమైన ఆ యువక హృదయాల్లో ఏభావాలు నిండి వున్నాయో?

వయస్సులో వాళ్లతో సరిసమానుడైన త్రెవకిన్ అనుభవంలో తనను వాళ్లకంటే చాలా పెద్దగా భావిస్తాడు; తానింతవరకు కొద్దిపనైనా చేశానుగదాయని ఆలోచించి సంతృప్తి చెందేవాడు, ఒకవేళ తాను చనిపోతే మిత్రులందరు చింతిస్తారు. డివజను కమాండరు కూడా రెండు సానుభూతి మాటలంటాడు. మరి ఆ అమ్మాయి — ఆకాత్యాయో? అకస్మాత్తుగా ఆయనకు కాత్యాగుర్తుకొచ్చింది.

తనకల్పిత మృత్యువుకుముందు ఆయన ఒకవిధమైన దయా భావంతో, ఆత్మీయతతో ఈయువక లెఫ్టినెంటుల వంక చూశాడు.

తనకేసి చూస్తున్న అందమైన పెద్దపెద్ద నేత్రాలుగల ఒకయువకుడు ఆయన్ని ఆకర్షించాడు. ఇద్దరుకళ్లూ కలుసు కున్నాయి. యువకుడు సిగ్గుపడుతూ— "నన్ను మీవెంట తీసుకువెళ్లండి. నేను చాలసంతోషంగా గూఢచార దళంలో చేరతాను." అన్నాడు. అతడు వుపయోగించిన పదం— "చాలా సంతోషంగా" అన్నదానికి త్రెవకిన్ నవ్వాడు.

"... ద్, నేను డివిజను చీఫ్ ఆఫ్ స్టాఫ్‌తో చెప్తాను. నిన్ను పంపిస్తారు. నాదగ్గరకూడా అంత మరీ ఎక్కువమంది మనుషులూ లేరు."

హెడ్ క్వార్టరుకు చేరినతరువాత ఈవిషయాన్ని కర్నల్ గాలీవ్ తెలియజేశారు. గాలీవ్ అంగీకరించి సరియైన అనుమతి పంపవలసిందిగా ఫోనుద్వారా రెజిమెంటును ఆదేశించాడు.

ఇదంతా జరిగి మస్చరస్కీ గోడౌన్‌కు రాగలిగాడు. నవయువకుడు, వయస్సు ఇరువదియేండ్లు; దృఢమైన శరీరము; నీలిరంగు నేత్రాలు; వెడల్పైన ఎర్రని చెప్పులు ధరిస్తాడు. అతడి సూట్‌కేస్‌లో చాలా పుస్తకాలున్నాయి. తీరికి సమయాల్లో దమదళానికి గేయాలు చదివి విన్పించేవాడు. ఆ సమయాల్లో అందరూ డేరామధ్య దీపంముందుకు చేరి వుత్సాహంగా, ఆగేయాల పదాల్లోవున్న మధురమైన లయను, కవియొక్క చాతుర్యాన్ని, వాటిని గానంచేయటంలో మస్చరస్కీలో వ్యక్తమయ్యే వుద్రేకాన్ని చూసి ఆశ్చర్యపడేవారు.

త్రెవకిన్ లేనప్పుడు మాత్రమే కాత్యా డేరాకువస్తుంది. మస్చరస్కీ సదుద్దేశంతో కూడిన కర్తవ్యదృష్టితో ఆమెను ఆహ్వానిస్తూ వుండేవాడు. కరస్పర్శచేసి కూర్చోమని కోరేడు. గూఢచారులకు ఇది నచ్చడంవల్ల దీనిద్వారా వాళ్లకు కొద్ది వినోదమూ కలిగేది. వాళ్లు ఇటువంటి ధర్మ శీలమునకు అలవాటు పడ్డవారు కారు.

ఒకసారి మస్చరస్కీ ఆమెనుగురించి త్రెవకిన్ వద్ద ప్రశంశించడం జరిగింది.

" ఆ అమ్మాయి, కేడియో ఆపరేటరు చాలా విచిత్రమైన వ్యక్తి. "

" నీవు చెప్పేది ఎవర్ని గురించి? "

" కాత్యా సిమాకోవాను గురించి. ఆమెతరచు ఇక్కడకు వస్తూవుంటుంది. "

త్రెవకిన్ ఏమీ మాట్లాడలేదు.

" ఏమంటారు? మీరామెను ఎరుగురా? " అని మస్చరస్కీ ప్రశ్నించాడు.

"ఎరుగును. కాని నీవామెను ఎందుకంత విచిత్రమైందిగా భావిస్తున్నావ్?"

" చాలా దయా స్వభావంగలది. గూఢచారుల దుస్తులు వుతికిపెడుతుంది. వాళ్లు తమ ఇళ్లనుంచి వచ్చిన వుత్తరాలు ఆమెకు చదివి విన్పిస్తూ వుంటారు. ఆమెకు తమ విషయాలన్నీ చెప్తారు. ఆమె వచ్చిందంటే అందరూ సంతోషంగా వుంటారు. ఆమె చాలా బాగా పాడుతుంది కూడా. "

ఇదేమాదిరిగా ఇంకొకసారికూడా తనలోవున్న విశిష్ట మైన వుద్రేకంతో అన్నాడు. "కాని, ఆ మె మిమ్మల్ని

ప్రేమిస్తుంది — ఇది నేనుగట్టినమ్మకంతో చెప్తున్నాను. ఆమె నిన్ను ప్రేమిస్తుంది. నీకు అటువైపు దృష్టిలేదనే నీ అభిప్రాయమా? ఏనాకైనా తెలుసుకుంటావు—చాలా వింత విషయం! ఎంతో సంతోషకరమైన విషయం. ”

త్రెవకిన్ లోలోపలే చిరునవ్వు అణచుకున్నాడు.

“ ఇదినీకెలా తెలుసు? ఆమె నీతో చెప్పిందా? ”

“ లేదు. అయినా ఆమెఎందుకు చెప్తుంది. నేనది చూసి తెలుసుకో గలను. ఆమె చాలా విచిత్రమైనదని మరొకసారి మీకు చెప్తున్నాను. ”

“ పాపం! ఆమె మరింకెవరినైనా ప్రేమించ వచ్చునే?” అన్నాడు త్రెవకిన్ చాలా జాలిగా.

మస్చరస్కీ బాధగా ముఖం ముడుచుకున్నాడు.

“ నీవు ఆవిధంగా అనగూడదు. నీవు అల్లాగని ఏవిధంగా వూహించుకో గలవు? ఇదేమంత సమంజసమైన మాటగాదు, ” అని త్రెవకిన్ చేతులూపుతూ చెప్పాడు.

“ రాత్రి తర్ఫీదు సమయమైంది, ” అని త్రెవకిన్ ఆవిషయాన్ని అంతటితో ఆపడానికి అన్నాడు.

మస్చరస్కీ తన తర్ఫీదు విషయంలో పూర్తిగా నిమగ్నమై పోయేవాడు. పసిపిల్లలు ఆటల్లో పొంది నంతగా

మహ్చరస్కీ తర్ఫీదులో రసాస్వాదన పొందేవాడు. వళ్లంతా హూనంహూనం అయ్యేంత వరకూ ఆతడు పాకు[illegible]ండేవాడు. ఆచల్లని మంచు నీటిలో ధీరత్వంతో దుమికేవాడు. పల్టన్ పొందిన విజయ పరంపరల గాథలు వింటానికి రాత్రంతా జాగారం చేయడానికికూడా సిద్ధపడేవాడు.

మహ్చరస్కీ రోజురోజుకు ఎక్కువగా త్రైవకిన్ను ఆకర్షిస్తున్నాడు. ఆనీలినేత్రాల యువకునివంక తదేకంగా చూస్తూ ఆయన అనురాగంతో ఆలోచించేవాడు— "గూఢ చారులు పోతపోయబడే లోహమే యీ యువకుడు....."



# ౬

"అయితే, రేపురాత్రికి మనం బయలుదేరతాం. రాత్రి బాగా గాఢాంధకారంగా వుంటుందనే ఆశిద్దాం—రహస్యాన్వేషణ కార్యక్రమానికి ఇదొక ప్రత్యేక సదుపాయం." క్రొత్తగా చేరిన గూఢచారులకు తన ఆడంబరాన్ని ప్రదర్శిస్తూ మమోంచికన్ అన్నాడు.

ము [illegible] అన్వేషణా కార్యక్రమాన్ని దృష్టిలో వుంచుకుని అతనికి గస్తీ పనినుంచి ట్రేనకిన్ శలవిచ్చాడు. ఆతరువాత మమోంచికన్ వెంటనే 'తన' ముసలి రైతువద్దకు వెళ్లాడు. నిండుగావున్న ఒక తేనెకుండ, కెటిల్‌నిండా సోడా, ఒకడబ్బా వెన్న, కోడిగుడ్లు శేరు మాంసంకూర, తీసుకుని డేరాకు తిరిగివచ్చాడు. ఇంతపెద్ద మొత్తాన్ని యివ్వటానికి వృద్ధుడు భయంగానే వ్యతిరేకించాడు. దానికి కొంచెం విచారపడుతూ మమోంచికన్ చెప్పిన జవాబిది. "ఏయ్, ముసలితాతా! మరేం విచారించకు. ఇంకొకసారి ఇకనీవు మమ్మల్ని చూడకపోవచ్చు. నేను తిన్నగా స్వర్గానికే వెళతాననేది ఖాయం. అక్కడ మీ ముసలిది కన్పిస్తే నీవెంత మంచివాడవో చెప్తాను. అనవసరంగా ఇక చర్చించకు. ఇకనీవు మాకివ్వడం ఇదే ఆఖరుసారనుకో........."

ప్రతికూల పరిస్థితులను గ్రహించి తనకు సమృద్ధిగా లభిస్తున్న ఈ ఆహార పదార్థాల వెనకవున్న రహస్యాన్ని మమోంచికన్ ఇక చెప్పేయాలని నిర్ణయించుకున్నాడు. బాయ్‌కోవ్‌ను, సెమియోనోవ్‌ను కూడా తీసుకవెళ్లి ఈ భారమంతా వాళ్ల నెత్తినపెట్టి ఆత్మ సంతృప్తితో మాటిమాటికి, "ఎలా వుందంటారు? ఏమోయ్?" అని అడుగుతూ వుండేవాడు.

మమోంచికన్ చేసిన దుర్బోధవల్ల, ఇంద్రజాలంగా కన్పిస్తున్న ఈ అదృష్టాన్ని చూచి సెమియోనోవ్ ఆతడిని ప్రశంశించకుండా వుండలేక పోయాడు.

"చాలాగొప్పవి, ఇదంతా నీవెలా చేస్తున్నావోయ్?"

ఇదిన్యాయమైంది కాదనిమాత్రం — సైమ్‌కోవ్‌కు సందేహం కలిగింది. "మమోచికన్, జాగ్రత్తగావుండు! లక్ష్మీ నేటుకు విషయమంతా తెలుస్తుంది." అని హెచ్చరించాడు.

ఆముసలివాని పొలంగుండా వస్తున్నప్పుడు మమోచికిన్ దుక్కిదున్నుతూన్న 'తన' గుర్రాలనంక సైగచేశాడు. నడుంవంగి మౌనంగావున్న ముసలివాడికొడుకు, పొడవుగా అందంగావున్న ఆతడి కోడలు, గుర్రాలను అదలిస్తూ వున్నారు.

తెల్లని నక్షత్రం గుర్తుగల ఆ పెద్దబాదంరంగు గుర్రాన్ని చూసినప్పుడు, తమపటాలం విశ్రాంతితీసుకున్న ఆ ప్రదేశం, ఈగుర్రం తాము విశ్రాంతితీసుకున్న యింటి యజమానురాలిదని ఆ వింతముసలి దానిదనే విషయాలు గుర్తొచ్చాయి.

"ఆముసలిది మమ్మల్ని తప్పక తిడుతూవుంటుంది!" అనేమాట ఆతడిమనస్సులో తళుక్కున మెరిసింది. ఒకక్షణ కాలం హృదయంలో ఏదో కనుక్కుప గుచ్చుకున్నట్లుంది. కాని ఇప్పుడతంతా వట్టి పిచ్చిఆలోచనే. ముందువుంది అన్వేషణా కార్యక్రమం. అది ఎలా ముగుస్తుందో ఏమో?

డేరాకుచేరారు. త్రైనకిన్ ధాన్యం బాగుచేసే ఒక యంత్రంవద్ద కూర్చుని, పెన్సిలుతీసుకొని తల్లికి, చెల్లికి వుత్తరాలు వ్రాయ నారంభించాడు. అదిచూసి మమోచికన్ ముఖం కళావిహీనమైంది. నెమ్మదిగా, నిశ్శబ్దంగా త్రైనకిన్

వద్దకు వెళ్ళాడు. ఆతడికళ్ళల్లో భయం లోతుగా స్పష్టంగా కన్పిస్తుంది. త్రెవకిన్ ఆశ్చర్యంతో ఆతడివైపు చూశాడు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్! రేడియో సామానుకూడా మనవెంటే తీసుకువెళ్తామా?" అని మమోాచికిన్ ప్రశ్నించాడు.

"అవును, దానికోసం బ్రెజనీకోవ్ వెళ్ళాడు."

"మరి ఆపరేటరువిషయమో ?"

"నేనే స్వయంగా వార్తలు పంపుతాను. ఆపరేటర్ని వెంటతీసుకువెళ్లాల్సిన అవసరంలేదు. ఏ పిరిగిపందో, చచ్చు దద్దమ్మో దాపురిస్తాడు. అదంతావద్దు. మనమేచూసుకుందాం. నాకు వైర్‌లెస్ విషయంలోకూడా కొద్దిగా తెలుసు."

"సరే. అయితే!"

చెప్పవలసింది ఏమీ లేకపోయినా మమోాచికిన్ అక్కడే నిలబడ్డాడు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్! కొంచెం పందికూర తింటారా ?"

త్రెవకిన్ తనను నిలువునా పగలకోసి తినేస్తాడేమో నన్నంత భయపడ్డాడు మమోాచికన్. "మరల కైతుల్ని పీల్చుకుతింటం ప్రారంభించావన్నమాట..." అది తనకు వద్దన్నంత తీవ్రంగా త్రెవకిన్ అన్నాడు. తిరిగి తన వుత్తరాల

వ్రాతలో మునిగిపోయాడు. ఇక మమో... ఒక నిర్ణ యానికి వచ్చి, భయపడుతూ "కామ్రేడ్, వుత్తరాలు వ్రాయ వద్దు." అన్నాడు.

"ఏం? ఎందుకని? నీకేమైనా యీర్ష్యగావుందా ?"

"కాదు కామ్రేడ్! మర్చెంకో కూడా వెళ్లేముందు ఇక్కడే కూర్చుని వుత్తరం వ్రాశాడు. ఇది అపశకునం. పెద్దవాళ్ళు శకునాలను నమ్ముతారు- నిజంగా అవి అలాగే జరిగి తీర తాయికూడా."

"సరే, ఇకచాలించు. ఇవన్నీ తలాతోకలేని కల్పిత గాధలు." అని త్రెవకిన్ మెత్తగా హేళనగా అన్నాడు.

మమోచికన్ వెళ్ళిపోయాడు. త్రెవకిన్ వుత్తరం వ్రాయాలని పెన్సిలు తీసుకున్నాడేగాని వెంటనే ఆయనదృష్టి ద్వారం చెంతవున్న నల్లని పొట్టుగుట్టమీాదకు పోయింది. చమటతోనూ, నీళ్ళతోనూ నల్లబడి పోయివున్న ఒక సంచి అక్కడ పడివుంది. అది మర్చెంకో పక్కచుట్ట.

ఇంతకూ త్రెవకిన్ తనవుత్తరాలు పూర్తి చేయలేక పోయాడు. తరువాత కొద్దిసేపటికి ఆయన ఒక చిన్ని రేడియో సెట్టుతీసుకుని లోనికివచ్చాడు. డివిజను సిగ్నల్ ఆఫీసరు లిఖాచెవ్, కాత్యా, ఇంకా యిద్దరు రేడియో ఆపరేటర్లు కూడా ఆయన వెనుక లోనికివచ్చారు. సంకేతాలు గల

పటాన్ని పట్టీని ఎలా వుపయోగించాలో నిఖాచెవ్ త్రెవకిన్‌కు మరొకసారి చెప్పాడు.

"త్రెవకిన్, చూడు! శత్రువు టాంకులగుర్తు 49; భూ సైన్యానికి గుర్తు 21 మ్యాపులో గుర్తులు పెట్టబడివున్నాయి. నీవు జిల్లాలోవున్న టాంకుల్నిగురించి తెలియజేయాల్సి వస్తుం దనుకో అప్పుడు 49 ఆబోతు నాలుగు, అని చెప్తావు. ఒక వేళ భూసైన్యాన్ని గురించైతే 21 నాలుగు అని ఈవిధంగా చెప్పాల్సివుంటుంది.

త్రెవకిన్ ఆఖరుసారి మరల ప్రాక్టీసుచేశాడు. దళానికి మారుపేరు 'నక్షత్రం' అనీ, డివిజనుకు మారుపేరు 'భూమి' అనీ నిర్ణయించారు.

రహస్యార్థంతో నిండివున్న యీమాటలు డేరాలోని నిశ్శబ్ద వాతావరణంలో విన్పించసాగాయి. లిఖాచెవ్, త్రెవ కిన్‌ల చుట్టూ చేరి వింటున్న గూఢచారుల శరీరం పులకించింది.

"భూమీ ! భూమీ! పిలిచేది నక్షత్రం. పిలిచేది నక్షత్రం. 21 ఆబోతు మూడు. ఇరువదిఒకటి ఆబోతుమూడు. ఇక నీవు చెప్పు."

ఉద్రేకంగా వున్నలిఖాచెవ్ నీరసంగా జవాబిచ్చాడు.

"భూమి నక్షత్రాన్ని పిలుస్తుంది. భూమి నక్షత్రాన్ని పిలుస్తుంది. ఇరవై ఒకటి ఆబోతుమూడు. ఇప్పుడు నేను చెప్పింది సరిగావుందిగదూ? ఇదేగా? ఇకనీవు మాట్లాడు."

"నక్షత్రం భూమినిపిలుస్తుంది, ూచే. ౧గా చేవ్రండ. ముందుకు సాగుతున్నారు. 49 పులిరెండు."

ఆడేరాలోని మసకమసకగావున్న వెలుగులో యీరెండు గ్రహాలకు మధ్య సంభాషణ సాగుతుంది. చుట్టూవున్నవాళ్లు తమను తాము మర్చిపోయి గుడ్లప్పగించి నిలబడి చూస్తున్నారు. పై కప్పులో గూడుకట్టుకుంటున్న పిచ్చికలకు సంబంధించినరతవరకు అవి ఇంటియందు ఆసక్తి కనబరుస్తూ నిర్లక్ష్యంగా, చాలా సంతోషంతో రెక్కలల్లార్చాయి.

వెళ్తూ వెళ్తూ లిఖాచెవ్ త్రెవకిన్ చేయినొక్కుతూ, "అయినా, ఒకవేళ నీవెవరికైనా ఆపకేట్ని తీసుక వెళ్ళదలిస్తే నాదగ్గర మంచి కుర్రవాళ్లున్నారు. వాళ్లు వెళ్తామని ఇంతకు ముందుకూడా చాలాసార్లు అన్నారు. ఇవ్వాళకూడా ఒక అర్జీవచ్చింది," అని నవ్వి, "అదే, జూనియరు సార్జెంటు సివూకోవా కాత్యాదే అది— ఆమె నీతోకూడా రావాలనుకుంటుంది." అన్నాడు.

త్రెవకిన్ కోపంగా ముఖం ముడుచుకున్నాడు.

"వద్దు కామ్రేడ్ మేజర్! మాకు ఆపకేటర్లెవరూ అవసరంలేదు. అయినా మేము వెళ్ళేది పార్కులో షికార్లు చేయటానికి కాదుగా?"

హృదయ పూర్వకమైన :తనవిధేయతకు, నిర్దయంతో కూడిన చీవాట్లువిని రివ్వున వెలుపలకు దూసుకుపోయింది.

ద్వేషంగా [illegible] మాటలు ఆమెనెక్కువ గాయపర్చాయి. "పట్టి అడవిమనిషి. మర్యాద తెలియని మట్టి మనిషి." అని ఆమె అనుకుంది. ఆమెకు రోషం ముంచుకొచ్చింది. "నిజంగా మూర్ఖురాలు మాత్రమే ఇటువంటి మనిషిని ప్రేమిస్తుంది........."

కెప్టెన్ బరాశ్కిన్ కందక సమీపానికి వెళ్లేసరికి ఆమె తననడక వేగాన్ని తగ్గించింది. "నేను లోనకు వెళ్తాను. ప్రతీకారం కోసం మాత్రమే." ఆమె కాసమయంలో బరాశ్కిన్ తనను గురించి నిరంతరము అతిగా ప్రశంశించటం, తనను గురించి నిరంతరము కలలు గనటం, తనఎదుట చూపే వినయ విధేయతలు, కంపించే అతని కంఠస్వరం, ప్రేమ, గుసగుసగుసలు అన్నీ గుర్తుకొచ్చాయి. ఆ విషయాలు అతిసామాన్యమైన వైనప్పటికి ఒంటరితనంతో బాధపడే ఆమె మనస్సు కప్పుడవేసంతోషాన్ని కల్గించ గలుగుతాయి. పాటలకు, కవిత్వానికి సంబదించిన ఆతడి చిన్ననోటుబుక్ సైతం ఆమెకు గుర్తొచ్చింది. ఆతడి విషయంలో ప్రతిది అతిసామాన్యమైనదే. తేలిగ్గా అర్థమైయేదిగా వుంటుంది. ప్రస్తుత క్షణాల్లో ఆనందానికవేలవసరమని పించింది.

ఆమె కందకంలోనికి ప్రవేశించింది. బరాస్కిన్ ఆశ్చర్యంతో సంతోషంగా ఆమెనాహ్వానించాడు. త్రెవకిన్ ఎలాగు వెళ్లిపోతున్నాడు కనుక కనీసం నన్నైనా తన గుప్పిట

జారిపోకుండా పట్టుకోవాలని ఈ శిక్షణాలగారి నిర్ణయించు కుందని ఆతడు అభిప్రాయ పడ్డాడు. ఇంతకుముందు అనేక సార్లు చదివిన సినిమాపాటలు, భావగీతాలు, ప్రేమపాటలు గల తన నోటుపుస్తకాన్ని మరొకసారి తెరచాడు. కాని కాత్యా ప్రస్తుతం పాడేస్థితిలో లేదు.

బరాశ్కిన్ ప్రక్కనే దుబాసి లెవిన్ వున్నాడు. ఆతడి నెలాగైనా అచ్చటనుంచి సాగనంపాలని బరాశ్కిన్ చాలా ప్రయత్నించాడు. చివరకు ఎలాగైతేనే లెవిన్ వెళ్ళిపోయాడు. తరువాత బరాశ్కిన్ తీయగా నవ్వుతూ కాత్యాను తన బాహువులలోనికి తీసుకున్నాడు. కాని కాత్యా సర్రున అతన్ని దూరంగా నెట్టి చరాచరా అడవిలోకి పారిపోయింది. వీల్లేదు, ఇక ఇటువంటివి మరెన్నడూ జరుగకూడదు. ఈపాత చింతకాయ పచ్చడంతా ఆమె కిప్పుడేమాత్రం యిష్టంలేదు, పైగా అసంటే రోతకూడా పుస్తోంది. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

ఈలోపు గ్రేనకిన్ తనకేమాత్రం యిష్టంలేని సంభాష ణాలో మునిగియున్నాడు.

వ్యర్థంగా కన్పించే ముఖంలో, ముఖమంతా మసూచి కపు మచ్చలుగల పర్యవేక్షణాధికారి కెప్టెన్ యూశ్కిన్ డేరా లోకి వచ్చాడు. కెప్టెన్ యూశ్కిన్ డేరాలోవున్న మైనపు గుడ్డ తెరచాటున కూర్చుని గ్రేనకిన్ను గుర్రాల విషయంలో వివరాలు వివరంగా ప్రశ్నిస్తున్నాడు. "ఏవిధంగా, ఎప్పుడు;

ఎందుకు గుడ్డాలను తీసుకున్నారు? తరువాత ఎప్పుడు, ఏ పరిస్థితుల్లో, ఏ ఆధారాలతో గుడ్డాలు తిరిగి పంపబడ్డాయి. ముట్టినట్లు రశీదు ఎందుకు తీసుకోలేదు?"

ఏమేమిజరిగింది క్రెనకిన్ కనుకుగానే విపులంగా తెలియ జేశాడు. రశీదు సంగతి అడిగినప్పుడు ఒకక్షణం మౌనం వహించి గుర్తు తెచ్చుకుంటానికి ప్రయత్నించాడు. అవును ఇప్పుడు గుర్తు వచ్చింది. రెండుగుడ్డాలను తాను మరుసటి రోజువరకు ఆపాడు. మమోంచికిన్ తరువాత వాటిని తిరిగి అప్పజెప్పి వచ్చాడు. ఈవిషయం గుర్తు రాగానే క్రెనకిన్ మమాంచికన్‌కు కబురంపాడు, కాని అతడప్పుడు డేరాలో లేడు. తరువాత వస్తాడులే అని కెప్టెన్ యాశ్కిన్ అన్నాడు. వెళ్ళే ముందు యాశ్కిన్ డేరా నలుమూలలు ఒకసారి పరీక్షగా చూచాడు. అందరూ మైనపుగుడ్డలను వాడుకుంటున్నారు. కాని మమోంచికిన్ ప్రక్కమీద మాత్రం వెల్లని దుప్పటి వుండ టం ఆయన గమనించాడు. అయినా ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

మమోంచికిన్ తిరిగిరాగానే క్రెనకిన్ ఆతణ్ణి పిలిపించాడే, కాని ఏమి ఆలోచించాడో యేమో గుడ్డాలవిషయంలో మాత్రం ఏమీ ప్రశ్నించలేదు. తనవెంట రావలసిన పని యుండికూడ రెండుగంటలనుంచి ఎక్కడున్నావు అని మాత్రం అడిగాడు. కందకాలు త్రవ్వేవాళ్ళదగ్గర వెళ్ళానని మమోంచికిన్ సమాధానం చెప్పటంతో సంభాషణ ఆగిపోయింది.

త్రెనకిన్, మస్చిరస్కీ లిద్దరు బుగోర్కోవ్‌ను కలుసుకోడానికి బయలుదేరారు. మస్చిరస్కీ పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అకస్మాత్తుగా ఆగి "త్రెనకిన్, నీవేమన్నా సరే నేనుమాత్రం కాత్యాను . కలుసుకుంటానికే వెళ్ళుచున్నాను. నీవేమీ గమనించలేదు గాని నేనంతా చూస్తూనేవున్నాను. అందుకు నాకు చాలబాధగా వుంది. ఆమె బయటకువెళ్ళినప్పుడు ఎంతో ఆవేదనతో కుమిలి పోతూంది. నీవామెను ఈవిధంగా బాధపెట్టడం మంచిది కాదు."

సిగ్గుపడుతూన్న కాత్యాను వెంటపెట్టుకుని మస్చిరస్కీ బుగోర్కోవ్ వున్న కందకంలోకి వచ్చాడు. తన తప్పుకు పశ్చాత్తాపపడుచున్న త్రెనకిన్ ముఖభావాన్ని ఆమె గమనించింది. నిజంగా ఆసాయంత్ర సమయం కాత్యా జీవితం ఎన్నో వున్నతాశలు నిండిన వింత సాయంత్రమే. త్రెనకిన్‌కు అది చాల అందంగాను ఆశ్చర్యంగాను కన్పించింది.

ఇంతలో రొప్పుతూ; రోజుతూ ఖ్రెబినిగోవ్ కందకంలోకి రావడంతో ఆనందంగా సాగుతున్న ఆ సంభాషణ హఠాత్తుగా తెగిపోయింది. ఆతడికళ్ళు మెరుస్తున్నాయి. టోపీ కూడా మరచిపోయి వచ్చాడు. జనపనార పీచువలెవున్న ఆతని జుత్తు మొఖంమీద పడుతూవున్నది.

"కామ్రేడ్ లెఫ్టినెంట్ మిమ్మల్ని పిలుస్తున్నారు. త్వరగా వెళ్ళి కలుసుకోండి."

డేరాచుట్టూ వాతావరణమంతా వుద్రేకంగా, గోలగా, హడావుడిగా వుంది. మిగిలిన గూఢచారులందరు అరుస్తూ త్రెవకిన్ వద్దకు పరుగెత్తారు.

"చూడండి ఎవరువచ్చారో?"

త్రెవకిన్ అలాగే నిలబడిపోయాడు. బిగ్గరగా నవ్వుతూ ఆనీకానోవ్ ఆయన్ని కలుసుకుంటానికి ముందుకొచ్చాడు తెలివితేట లుట్టిపడే ఆతడి చిన్నకళ్లు సంతోషంగా మెరుస్తు న్నాయి. తన లెఫ్టినెంటును కౌగలించుకోవాలనే ఆశ కి వున్నప్పటికి ధైర్యం చేయలేక ఆనీకానోవ్ అలాగే సందిగ్ధంగా నిలబడ్డాడు.

"చూశారా! కామ్రేడ్ లెఫ్టినెంట్ నేను వచ్చేశాను."

పిడుగుపడ్డవానివలె త్రెవకిన్ నిశ్చేష్టుడై గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు. అమితాశ్చర్యంవల్ల మాటే పెగల్లేదు. తనమీద నుంచి వక పెద్దభారాన్ని దింపివేసినంత తేలిగ్గావుంది. గడచిన కొన్నివారాలుగా ఆయన ఏ అనుమానాల్లో పడి వూపిరి సలుపక కొట్టుకుంటున్నాడో ఇప్పుడు వాటిలోతుల్లోకి పరికించి చూశాడు.

"ఇంతకూ నీవస లెలావచ్చావు? ఇకవుండి పోతావా లేక ఇంకొక యూనిట్‌లో వుంటూచూసి వెళ్ళాలనివచ్చావా?" అని అడిగినతరువాత ఇద్దరు వక బల్లదగ్గర కూర్చున్నారు.

"నేను మరోయూనిట్ వెంటే పంపబడ్డాను. మిమ్మల్ని

చూసి వెళ్దామని బండిదిగి వచ్చేశాను. మన డివిజనులోని వక సైనికుడు కన్పించి మీరింక ఇక్కడే వున్నారని చెప్పాడు." ఆనీకానోవ్ కొంచెంసేపాగి నవ్వి "సరే మిగిలినవిషయాలు ఒకసారి వెళ్ళి చూసివద్దామనుకున్నాను." అన్నాడు.

ఒకగ్లాసు వోడ్కా, కొద్ది ఫలహారంతో ఆనీకానోవ్‌ను సత్కరించారు. ఆనీకానోవ్ చాలా సంతోషంతో నెమ్మదిగా తింటూ ఆపదార్థాల రుచినిగురించి చెబుతూ విచిత్రమైన గ్రామీణ మర్యాదతో ప్రతిపదార్థానిగురించి వంటమనిషి ఖులిన్‌ను పొగుడుతూ ఆతడివంక చూస్తున్నాడు. రిజర్వ్ రెజిమెంట్‌లోని పొలాలనాట్లు అయిపోగానే తాము యుద్ధానికి వెళతామని అర్జీలు పెట్టుకుంటే వక పునర్నిర్మాణ శాఖలో వేశారని అదే ధోరణిలో ఆనీకానోవ్ చెప్పాడు.

"అయితే మీరిప్పుడుజర్మనుల కీలకానికి వెళ్తున్నారన్న మాట? మీవెంట ఎవరెవరు వస్తున్నారు?" అని ఆనీకానోవ్ అడిగాడు.

"ఇదిగో ఈ జూనియర్ లెఫ్టినెంట్ మస్ప్రకస్కీ, మమోంచికన్, బ్రెజనీకోవ్, బాయ్కోవ్, సెమియోనోవ్, ఇంకా గాలీవ్ వున్నారు."

"మరి మర్చెంకో? ఆయనెక్కడున్నాడు?"

తనచుట్టూవున్నవాళ్ల విచారకరమైన ముఖాలవంక చూసి త్రైవకిన్ మౌనం వహించాడు. ఆనీకానోవ్ అంతా

అర్థంచేసుకుని తనముందున్న ప్లేటును జాగ్రత్తగా ఒకప్రక్కకు నెట్టి సిగరెట్ ముట్టించి—ఆయన అమరుడు......" అన్నాడు.

కొద్దిక్షణాలు మౌనంగా వున్న తరువాత క్రైవకిన్ నెమ్మదిగా తలయెత్తి ఆనీకానోవ్ వంక చూస్తూ "మరినీవిషయ మేమిటి? నీవునాతో కూడావస్తావా లేక నీవు నియమించబడిన యూనిట్ వెంట వెళ్తావా?"

ఆనీకానోవ్ వెంటనేజవాబేమీ చెప్పలేదు. తలెత్తి ఎవరివంకా చూడలేదు. అయినా అందరూ తనజవాబుకోసం ఆదుర్దాగా ఎదురు చూస్తున్నారనేది గ్రహించాడు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్; నేనుమీవెంట రావలనే కోరుకుంటున్నాను. ఆపరిస్థితిలో ఈ విషయాన్ని మా రెజిమెంటుకు తెలియజేయాల్సి వుంటుంది— ఆనీకానోవ్ పారిపోయేరకం మనిషికాదు, తెలిసిందా అనివార్యాలి. మనకర్తవ్యం."

మమోచికన్ ద్వారంచెంత నిలబడి లోలోపల ఒకవంక ఆనీకానోవ్‌నుప్రశంశిస్తూ వేరొకవంక ఈర్ష్యతోనూ సంభాషణ వింటున్నాడు. ఒక్క ఆనీకానోవ్ మాత్రమే పనులీవిధంగా చేయుగలడనేది స్పష్టంగా కన్పిస్తూనే వుంది. తాను ఆనీకానోవ్ కావడానికి ఆసమయంలో మమోచికన్ ప్రాణాలర్పించడానికి కూడా సిద్ధంకాగలడు.

ఆనీకానోవ్ ఒకసారి డేరానలు మూలలు పరీక్షగా చూశాడు. ఆపోట్లుగుట్టమీద వున్న కాన్వాసు గుడ్డగోనులు

ఆకుపచ్చని గూఢచార దుస్తులు, మూలనున్న చేతిబాంబుల్ని, వంకెలకు వ్రేళాడుతున్న టామీగనులు, సైనికుల బెల్టులను వ్రేళాడుతున్న కత్తుల్ని చూశాడు. జీవితాన్ని అర్థం చేసుకునే సంతోషంగల తత్వవేత్త వలె తిరిగి 'ఇంటికి' వెళ్లటం ఎంత ఆనంద దాయకం అని అనుకున్నాడు.

మెత్తబడిపోయిన త్రెవకిన్ తాము చేయవలసిన పనులు, దానికి సంబంధించిన కార్యక్రమాన్నంతా వివరంగా ఆనీకానోవ్‌కు చెప్పాలని శాంతంగా ప్లాను కాగితం విప్పే సరికి హెడ్ క్వార్టర్సు నుంచి తనకోసం డివిజను కమాండరు పంపిన సైనికుడు ఎదురుగా కన్పించాడు. ఈ విషయాలన్నీ తెలియ జెప్పే భారాన్ని మస్చరస్కీకి వప్పగించి త్రెవకిన్ కర్నల్ వద్దకు వెళ్ళిపోయాడు.

కమాండరుగారి డేరాలో కొద్దిచీకటిగావుంది. కర్నల్ సర్బీచెంకో జబ్బుగావున్నాడు. కిటికీవద్ద మంచంమీద పడుకుని చీఫ్ ఆఫ్ స్టాఫ్ చెప్పే రిపోర్టును వింటున్నాడు.

చూడగానే ఆయనదృష్టి త్రెవకిన్ ధరించిన చెప్పులపై పడింది. "ఇదేమిటి? ఈజనపనార చెప్పులు వేసుకున్నావేం?"

"అలవాటు చేసుకుంటున్నామండీ. సెమియోనోవ్ మా దళానికి ఇవే ఏర్పాటు చేశాడు. ఇవి వేసు కున్నందువల్ల నడుస్తుంటే చప్పుడేమీకాదు. కాళ్లకుకూడా చాలాహాయిగా వుంటుంది."

కర్నల్ ఈమాటలకు ఆమోదించినట్లు "ఊ" అని విజయ సూచకంగా లెఫ్టినెంట్ కర్నల్ గాలిన్ వంక చూశాడు. "చూశావా! ఈగూఢచారి ఎంత తెలివైన వాడో?" అన్నట్లుంది ఆయనచూపు.

సర్బీ చెంకో చాలామందిని అపాయకరమైన పనులకు పంపుతూ వుండేవాడు. కాని త్రెవకిన్ విషయంలో మాత్రం ఆయన చింతిస్తున్నట్లు కన్పిస్తుంది. కర్నల్ సెమియోర్కిన్ చెప్పింది. రైటేనని తోచింది. సైనిక హెడ్ క్వార్టర్సుకు సంబంధించినంతవరకు, అన్వేషణ, రిపోర్టులు, సంక్షిప్తవార్తలు ప్లానుల కాగితాలు మొదలైన పెద్దవిస్తృగా సాగించే ఇతర కార్యక్రమాలపై అప్పటిపక్షాడు తాత్కాలికంగా తీసుకున్న నిర్ణయాలు మామూలువాటికంటే మించినవేంకావు. కాని ఆపనికొరకు నియమించబడిన ఈమనిషి—జనపనార చెప్పులు, ఆకుపచ్చని యూనిఫారం ధరించి—గడ్డము, క్రాపు బాగాపెరిగి వన దేవతవలె కన్పించే ఈమనిషికున్న విలువ ప్రత్యేక ప్రాముఖ్యతగలది.

ఒకతల్లిగాని, తండ్రిగాని తమకొడుకును ఏదైనాఅపాయ కరమైన పనికి పంపేముందు హితవచనాలు చెప్పినట్లు తానుకూడా త్రెవకినకు చెప్పాలనుకున్నాడు. "నాయనా! ఏఅపాయం లేకుండా నిన్ను నీవుకాపాడుకో. పని పనేగనుక

మూఁడుగా నీతల దూర్చకు. మెలకువగా వుండు. యుద్ధం త్వరగానే ముగుస్తుందిలే!"

కర్నల్ సర్బ్‌చెంకో కూడా ఒకప్పుడు గూఢచారిగా పనిచేసినవాడే గనుక ఇటువంటి మాటలు ఎంతమాత్రం శుభప్రదమైనవి గావనిబాగుగా తెలుసు. ఇటువంటి మాటలు ఒక్కొక్కప్పుడు ఎంతటి కర్తవ్యపరాయణు డైనవ్యక్తినైనాసరే చలింప జేస్తాయి. పనిలో పూర్తిగా తనను తానుమర్చిపోయి మునిగివుండే వ్యక్తి కూడా ఏదైనా మర్చిపోగలుగుతాడు కాని ఇటువంటి మాటలు—"నిన్నునీవు కాపాడుకో!" అనేవి ఒక పెద్ద ఆఫీసర్ చెప్పినప్పుడు మర్చిపోవాలన్నా మర్పుకురావు. అటువంటప్పుడు కలిగేది అపజయమే. అందుకే కర్నల్ సర్బ్‌చెంకో వీడ్కోలప్పుడు క్రైవకిన్‌తో కరస్పర్శచేసి, "జాగ్రత్తగా......" అనిమాత్రమే చెప్పగలిగాడు.

---

## ౨

ఆ ఆకుపచ్చగౌనులు దిగవేసుకుని శిరోమండలనుంచి మెడక్రిందవరకు వున్న వస్త్రాములన్నీ పెట్టుకున్న తరువాత గూఢచారి ప్రపంచంలోని చిన్నపెద్దవిచారాలన్నింటికీ గుడ్‌బై కొడ్తాడు. వేటితోనూ చివరకు తనతోనే సంబంధం వుండదు. తన ఆదేశాలుగాని, తన జ్ఞాపకాలుగాని వేటితోనూ అతనికిక సంబంధంవుండదు. తనజాకెట్టుకు చేతిబాంబులు, కత్తి వ్రేలాడేసుకుని దుస్తుల లోపల గుండె దగ్గరగా రివాల్వరు దాచుకుని మానవ నియమాల నన్నింటినీ వదిలేస్తాడు. వెలివేయబడ్డ ఒక ప్రత్యేక రకపువ్యక్తిగా తయారవుతాడు.

భవిష్యత్తులో తనమీద తానే ఆధారపడతాడు. తనకు సంబంధించిన కాగితాలు, ఉత్తరాలు, ఫోటోలు, బిరుదులు, గౌరవచిహ్నాలు అన్నీ తనసార్జెంటు మేజరుకు వప్పగిస్తాడు. కమ్యూనిస్టు పార్టీగాని లేక అనుబంధ సంఘంలోగాని సభ్యత్వముంటే దానికి సంబంధించిన కార్డుపార్టీ నిర్మాణ కార్యకర్తకు వప్పగించి వేస్తాడు. ఈరకంగా అతను తన గతానికీ, భవిష్యత్తుకు తిలాంజలిచ్చి తనమనస్సులో మాత్రమే తాను సజీవంగా విరాజిల్లుతూ వుంటాడు.

అడవిలోని పక్షులవలె అతనికి పేరూ వూరూ ఏమీ వుండదు. ఒక అనామకవ్యక్తి. అప్పుడప్పుడు అతను మనుష్యుల భాషను సైతం వదిలేస్తాడు; తన సహచరులకు పక్షుల కూతల వలెనో, లేక ఈలల ద్వారానో సంజ్ఞలు చేస్తాడు. అతను

పొలాల్లోను అడవుల్లో. నదుల్లోను దేహభాగం లేకుండా ఒకేరూపంలో ఇమిడి పోతాడు. ఈప్రదేశాల్లో తిరిగే ప్రేత రూపం ధరిస్తాడు—ఒకభయంకరమైన ప్రేతం— శత్రువు కొరకు పొంచివున్న ప్రేతరూపం— అతని సకలేంద్రియములు ఒకే ఒక వస్తువుమీద కేంద్రీకృతమై వుంటాయి—శత్రువుకు గురిపెట్టిన కైట్సెన్‌గన్ పైనే—

ఈరకంగా ఇద్దరు ఆటగాళ్ల— మానవుడు, మృత్యువు యొక్క— ఆసనాతన నాటకం ప్రారంభమవుతుంది.

మస్ఖరస్కీ బుగోర్కోవ్‌ల వెంట త్రెనకిన్ ముందున్న రక్షణ శ్రేణుల వైపుకు సాగాడు, అతను తన మనుష్యుల్ని ముందుగానే ముందుకు పంపించి వున్నాడు. మస్ఖరస్కీకి చాలా దుఃఖం కల్గింది. లెఫ్టినెంట్ కర్నల్ గాలీకొకు ఆనీకానోవ్ తిరిగి మరల వచ్చాడని తెలియుగానే కొంచెంఆలోచించి ప్రస్తుతం త్రెనకిన్ వుంటూవచ్చిన స్థానంలో మస్ఖరస్కీని నియమించాడు.

“ఏమేమి అవసరాలు వస్తాయో ఎలా తెలుస్తుంది? అప్పుడు గూఢచారి దళానికి నాయకుడంటూనే వుండడు.” అని గాలీవ్ డివిజను జమాండరు చెప్పినప్పుడు ఆయన కూడా అందుకంగీకరించాడు.

అడవిలో ఆ కాలిబాట వెంటవస్తూ ముగ్గురు ఆఫీసర్లు నెమ్మదిగా మాట్లాడుతున్నారు. అప్పుడునిజానికి మాట్లాడు

తూవుంది ఒక్క బుగోర్కోవ్ మాత్రమే. మస్చరస్కీ విచారంగా వినటం మాత్రమే చేస్తున్నాడు. ఇక త్రెవకిన్ పరధ్యానంగా ఎదురుగా చూస్తూ నడుస్తున్నాడు.

త్రెవకిన్ చాలా గంభీరంగా వున్నాడు. బుగోర్కోవ్ చాలా అసంబద్ధంగా మాటల ధోరణిముగిస్తూ ఓరకంటితో త్రెవకిన్ వంక చూస్తూ, "యుద్ధం త్వరగా ముగిస్తే ఎంత బాగుండును," అన్నాడు.

త్రెవకిన్ ఏమీ సమాధానం చెప్పలేదు. ఏదైనా గుప్త ప్రయత్నానికి ముందు త్రెవకిన్ ఎప్పుడూ చాలా మౌనంగా వుంటాడు. నిద్రలేక చాలా అలసిపోయిన ఈ శాంతికోసం తన ఇచ్ఛాశక్తిని పూర్తిగా అదుపులో ఉంచుకోవాల్సి వచ్చేది తన అదృష్టం చేతులకు ఒప్పగించినట్లు— చేయగలిగినంత వరకు, నేనే చేశాను, ఇక ఏలాజరిగితేఅలా జరగనీ చేసేది మాత్రమేముంది అన్నట్లుండేది.

ఫిరంగుల రెజిమెంటు చెట్లతో నిండివున్న ఒకవెడల్పైన గట్టుకు చేరుకుంటుంది. ఫిరంగులు కాల్చేవాళ్లు ఫిరంగుల్ని అమరుస్తున్నారు. త్రెవకిన్‌ను చూడగానే చేతులూపుతూ వాళ్లు ఆయన్ని పిలిచారు.

" మరల పనిమీద బయలుదేరారా? "

"అవును," అని త్రెవకిన్ ముక్తసరిగా జవాబిచ్చాడు.

కందకంలో వాళ్లు అతనికోసం నిరీక్షిస్తున్నారు. కెప్టెన్

ముస్తాకోవ్, కెప్టెన్ గురోవిచ్, మరిద్దరు ఫిరంగిదళ కమాండర్లతోబాటు అక్కడున్నాడు. ఆనీకానోవ్ ఇతర స్కౌటులు కందకంలో గొంతు కూర్చుని నెమ్మని నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు.

కెప్టెన్ గురోవిచ్ తాను ఆలోచించి నిర్ణయించిన స్కీమును వివరంగా చెప్పసాగాడు.

"జర్మనులను కంగారు పరచి దృష్టిమళ్లించేటందుకు నేను నెం. 6 గుర్తు చోట ఒకచేతిబాంబు వదుల్తాను. ఇదిగో త్రైనకిన్ మీరు మరీ ఎడమువైపుకు వెళ్లవద్దు "లేకపోతే నాబాంబుకు గురవాల్సి వస్తుంది. దానితరువాత పెద్ద ఫిరంగులు, నాఫిరంగులు నంబరు నాలుగు చోట గుళ్లవర్షిస్తాయి. ఎరుపు బాంబు వదలితే, నీవు తిరిగి వచ్చేందుకు వీలుగా నీరక్షణ నిమిత్తం మేము నంబరు 2, 3, 4, 5, 7 చోట్ల కాల్పులు జారీచేస్తాం."

"పెద్దఫిరంగుల వాళ్లు గురి చూచుకుని సిద్ధంగా వున్నారా?" అని త్రైనకిన్ ప్రశ్నించాడు.

"అంతా సిద్ధంగానే వున్నాం," అని దానికి సంబధించిన కమాండర్లు చెప్పారు.

"అవసరానికి నామెషీన్ గనులు కూడా సిద్ధంగానే వున్నాయి." అని ముస్తాకోవ్ అన్నాడు.

అందరూ ఉద్రేకంగా, కొట్లింపు వుత్సాహంతో వున్నారు.

త్రేవకిన్ గట్టుపైకెక్కి జర్మనుల మకాంనుంచి వచ్చేధ్వనిని వినటానికి చెవివగ్గి నిలబడ్డాడు.

ఎక్కడో దూరంగా నృత్యానికి సంబధించిన ఒక గ్రాము ఫోను రికార్డు మ్రోగుతుంది! అటు ఎడమ దిక్కున తెల్లని వెలుగులు కొంచెం చేపటికొక సారి ఆ కాశంలో మెరుస్తున్నాయి.

ఆయన పురల కందకంలోకి దూకాడు, తన స్కౌట్లు కందకాలు త్రవ్వేవాళ్లనుద్దేశించి, "వింటున్నారా, సరిగ్గా వినండి," అన్నాడు.

అందరూ నెమ్మదిగా లేచి నిలబడ్డారు.

"శత్రువులు తమ 31వ ఫిరంగిదళంతో ఈ ప్రదేశాన్ని చుట్టు ముట్టి వున్నారు. మనకద్దవున్న సూచనల ననుసరించి శత్రువులు వెనుక తట్టునవున్న తమరక్షణ శ్రేణికి వెనుకభాగంలో సైన్యాలను సమీకరిస్తున్నారు. డివిజను కమాండరు ఆదేశానుసారం మనం శత్రువుల వెనుకభాగంలో చేరి సైన్యాలను సమీకరించే అభిప్రాయమును, మొత్తం శత్రువుల సంఖ్య, వాళ్లటాంకుల, ఆయుధాల అంచనాలు అన్నీ తెలుసు కోవాలి. ఇదంతా హెడ్ క్వార్టరుకు రేడియో ద్వారా తెలియ జేయాలి.

ఏపద్ధతి ప్రకారం, ఎలా తాము ముందుకు సాగాలో స్కౌటులకు వివరించి, ఆనీకానోవ్ ఉపనాయకుడని చెప్పి త్రెవకిన్ కందకంలోని ఆఫీసర్లందరికి తలవ్రాపుళో అభివందనం చేసి గట్టుపైకెక్కాడు, తరువాత మౌనంగా గట్టువెంటే బయలు దేరాడు. ఒకరి తరువాత ఒకరు చాలిన బ్రెజనీకోవ్, మమోచికన్, గోలూబ్, సేమియోనోడు, బాయ్‌కోవ్ ఇంకా దళంవెంట వచ్చిన కందకాలు త్రవ్వేముష్కరు దళసభ్యులు అదేరకంగా ముందుకు సాగారు, ఆనీకానోవ్ అందరికి వెనుక వున్నాడు.

కందకంలోని వాళ్లు చాలా సేపటివరకు మౌనంగా నిలబడ్డారు. తరువాత గురోవిచ్ ఉన్నట్టుండి వరుసజెట్టి బండ బూతులు తిట్టసాగాడు. మస్కోవ్‌ను కొంచెం సోడ్కా అడిగి నిజంగానే ద్వేషంగా వెక్కిరిస్తూ పూర్తిగా గ్లాసుడు త్రాగేశాడు. గురోవిచ్ త్రాగని వాడని, తిట్టనివాడని చాలా ప్రసిద్ధి. అటువంటివిది చూసి ముస్తాకోవ్‌కు చాలా ఆశ్చర్యం కల్గింది, కాని అతనినోరు విప్పి ఏమీ వ్యాఖ్యానించలేదు.

ఈలోపల త్రెవకిన్ నదిఒడ్డునవున్న చిన్న పొదల్లో ఆగిపోయాడు. స్కౌటులు చాలాసేపు ఎదురుచూశారుగాని త్రెవకిన్ తరువాత ఏమీ పని ప్రారంభించలేదు. మూడు నిముషాలు వాళ్ళు నిశ్శబ్దంగా వున్నారో లేదో ఇంతలో అక స్మాత్తుగా జర్మనుల ఒక జ్వాల ఆ అంధకారాన్ని చీల్చుకు పోయింది. నదికావలి ఒడ్డున అది తెల్లని పాల వెలుగువలె

కన్పించి అంతలోనే అంతరించిపోయింది. త్రెవకిన్‌కి ఇందుకనే ఆ గాఢనేవి స్పష్టమే. తన మిత్రుల ముందున్న చల్లని ఆచీకటి నీళ్లల్లో త్రెవకిన్ మిమికి వేగంగా నదిదాటి పడమటిగట్టు నీడలో ఆ రెండవ జ్వాలకొరకు నిరీక్షించ సాగాడు. తరువాత త్రెవకిన్ కందకాలు త్రవ్వేవాళ్ళను ముందుకు పంపి తాను వెనుకనే నడవసాగాడు. ఆయన వెనుక మిగతా స్కౌటులు నడుస్తున్నారు.

దూరంనుంచి చూసి త్రెవకిన్ అంచనా వేసినదానికంటే ఒక పెద్దగోతిని దాటి కందకాలు త్రవ్వేవాళ్లు ఆగిపోయారు. అక్కడనుంచి సొరంగాలు త్రవ్విన ప్రదేశం ప్రారంభమవుతుంది. తమ పెద్దపెద్ద యంత్రాలతో నేలను పరీక్షిస్తూ వారిలో ఒకని ఎదురొమ్ముమీద వ్రేల్లాడుతున్న శబ్దగ్రహణ యంత్రంద్వారా ధ్వనుల్ని వింటూ నెమ్మదిగా ముందుకు సాగారు.

ఒకవైపున ఒకజ్వాల ఆకాశంలోకి లేచింది. సహజ భీతిలో స్కౌటులందరూ నేలమీద కరుచుకు పోయారు. వారు ఎత్తైన సమతల భూమిమీద పడుకుని వున్నారు. ఆ రకంగా కూడా ప్రపంచమంతా తమ నా వెలుగులో చూడగల్గుతుందని వాళ్లకు తోచింది. ఆ జ్వాల ఆరిపోగానే మరల నలువైపుల ప్రశాంత వాతావరణమేర్పడింది.

ఆ అంధకారంలోనే అతి జాగ్రత్తగా నేర్పుగా తమ

చేసుల సాడించుచు కందకములు త్రవ్వు దళం అనేక కందకాలు త్రవ్వింది. ఇంతలో అగ్నిపర్వతం బ్రద్దలైనట్లు మెషీన్ గన్ను గుండ్ల వర్షం తుఫానుగా వారి తలలపైనుంచి దూసుకు పోతూ క్షితిజంవైపుకు పోయింది. కొంచెం సేపటికి సైనికులు పూర్వంవలె లేచి నిలబడ్డారు. మరల అటువంటి మరొక ప్రేలుడు అటు ఎడమప్రక్కగా దూసుకుపోయింది. సోవియట్లు వైపునుంచి కూడా ఒకతుపాకి గర్జించి కడసారి శలవు పుచ్చుకున్నట్లు ఎక్కడో ఎడమ ప్రక్కగా దూసుకుపోయింది.

ముందునడుచుచున్న కందక దళం ఆ అంధకారంలో ఒక ముళ్ల తీగెను కనుగొని తమవెనుక ప్రాకుతూ వచ్చుచున్న త్రెవకిన్ వంక తిరిగాడు. "సరే, కానివ్వండి," అని త్రెవకిన్ చాలా నెమ్మదిగా అన్నాడు. కందక దళం తమ పెద్ద కత్తెరతో దాన్ని కత్తిరించి వేయసాగింది. మరొకసారి జ్వాల మెరిసింది— మరొకసారి ఆ ప్రశాంత వాతావరణాన్ని భగ్నం చేస్తూ అగ్నిపర్వతం బ్రద్దలైనట్లు మెషీన్ గన్‌లు ప్రేలి ఆ అంధకారంలో మాయమై పోయాయి.

ఆ ప్రేలుడు వెలుగులో జర్మనుల ముళ్లతీగెల హద్దులు వాటిప్రక్కగా నున్న బల్లలు, కందకముల కొడవకొస చివర నున్న అడవి అంత్యభాగాన్ని, బాంబుల వలన ధ్వంసమై పోయిన మూడుచెట్లు త్రెవకిన్‌కు స్పష్టంగా కన్పించాయి. జర్మనుల రక్షణ శ్రేణుల్ని దూరంనుంచి చూచినప్పుడు, అతను గుర్తించిన ప్రత్యేకగుర్తులివే అతను కొంచెంగా కుడి

వైపుకు తిరిగాడు. ఆ అంధకారంలో దిట్టర్సక యంత్రపుకొన ఆకు పచ్చగా మెరుస్తుంది.

వారిచుట్టూ రాత్రి పూట వుండే సహజ ప్రశాంతత అలముకొనివుంది. ఈ ప్రశాంతత చాలా మోసమైనదని త్రెవకిన్‌కు తెలుసు. ఈ అంధకారంలో అనేక నేత్రాలు తనను కనిపెట్టూ వుండటంకూడా జరగవచ్చు. తన భుజం మీద కందకదళ స్పర్శ తగలగానే త్రెవకిన్ ముఖం వికసించింది. ఆముళ్లతీగ ఆవరణకు మధ్యగా మార్గం వేయబడిందనే దీని అర్థం. మార్గాన్ని రక్షించుటకు, త్రెవకిన్, అతని సహచరులు ఒకవేళ తిరిగి వచ్చుట జరిగిన వారికి సహాయ పడుటకు గాను కందకదళం ఇక్కడే వుండి పోయింది. అంతా అనుకున్నట్లు ప్రశాంతంగా వుంటే వాళ్లు అర్థగంటలో " ఇంటికి " తిరిగివెళ్తారు.

కందక దళంలోని ఒకసభ్యుడు విడచి పోవుసమయమున త్రెవకిన్ చేతిని గట్టిగా నొక్కాడు. అప్పుడు త్రెవకిన్ అంధకారంలో చూచుటకు అలవాటుపడ్డ కళ్లల్లో పెద్దపెద్ద నల్లని మీసాలు లోతైన దయాభావం నిండిన కళ్లను చూశాడు.

మేజీదోవ్ అని త్రెవకిన్ అతన్ని గుర్తించాడు. ఆ డివిజనులో కందకాలు, సొరంగాలు త్రవ్వటలో అతనే కష్టు నేర్పరిగొప్ప వాడూను. బుగోర్కోవ్ ఏమీ వెలితికలుగ నీయలేదు.

ముళ్లతీగె నరికి మార్గంవేయబడ్డ చోటునుంచి దళం

పోయింది. ముందుకు పాకుకుంటూ దాటిపోయి జర్మనుల ఆవరణ దగ్గరనిలబడ్డారు; ఎడమ వైపున ఫిరంగి చప్పుడైంది. భూమికంపించి ఒక సెకండు తరువాత బాంబులు కుడివైపున బ్రద్దలైయాయి.

“ ఇతనే గురోవిచ్, ” అని త్రెనకిన్ ఆలోచించాడు.

తన ఎడమవైపున ఆయన జర్మనుల ధ్వని విన్నాడు. ఆనీకానోవ్, బ్రజనీకోవ్ లిద్దరూ కందకంలో సిద్ధంగా వున్నారు. ధ్వనులు వున్నకొద్దీ సమీపమౌతున్నాయి. త్రెనకిన్ శ్వాస బిగబట్టి కూర్చున్నాడు. ఇద్దరు జర్మనులు రాకపోకల కందకంద్వారా సరాసరి సరిగ్గా తనవైపుకే నడిచి వస్తున్నారు. వారిలో ఒకడేదో తింటున్నాడు వాడు పరపర బిగ్గరగా నమలడం త్రెనకిన్‌కు వినిపిస్తూనే వుంది. వారు మరొక దిక్కుకు తిరిగారు. ఆనీకానోవ్ ఆవరణదగ్గరకు వచ్చి త్రెనకిన్ క్రిందికి దూకుటకు సహాయపడ్డాడు.

మరుక్షణమె ఏడుగురు స్కౌట్లూ జర్మనుల కందకంలో దగ్గర దగ్గరగా నిలబడి వున్నారు.

త్రెనకిన్ ఒక క్షణం చుట్టూ పరికించిచూసి చెవియొగ్గి విని ఇంతకు ముందు ఆ ఇద్దరు జర్మనులు వచ్చిన ఆ రాకపోకల కందకంలో నుంచే ముందుకు సాగారు. ఒకమలుపులో నాయకత్వం వహిస్తున్న ఆనీకానోవ్ త్రెనకిన్‌ను మెలకువగా వుండవలసిందిగా సైగచేశాడు. ఒకజర్మనీవాడు ఆవరణ

సమీపంలో తిరుగాడుతున్నాడు. స్కౌటులందరూ కందకపు గోడలకు కరుచుకు పోయారు. జర్మనీవాడు ఆచీకటిలో కలసి పోయాడు. ఇంతవరకు అంతా సవ్యంగా సకుశలంగానే వుంది. ఇక వాళ్లిప్పుడు అడవిలో ప్రవేశించటమే చాలా అవసరం.

త్రెవకిన్ ఆ రాకపోకల కందకంనుంచి బయటకు వచ్చి నలుదిక్కుల కలయ జూశాడు. అతనిదివరకు పెరిస్కోప్ ద్వారా చూస్తూవుండిన వనమధ్య మందున్న నల్లనికుటికరపు ఆకారాన్ని గుర్తించాడు. జర్మనుల మెషిన్‌గన్లమొకటి ఆకుటీర సమీపంలోనే వుంది. అక్కడ జర్మనులు ఉద్రేకంగా చర్చించుకుంటూ వుండటం ఆయన విన్నాడు. అడవి లోపలకు వెళ్లేమార్గం సరిగ్గా ఎదురుగానేవుండి వుండాలి. త్రోవ కెడమ పైపున ఒకమిట్ట, దానిమీద రెండు సరుగుచెట్లు వున్నాయి. ఆ మిట్టకెడమవైపున అంతా ఊబినేల. అక్కడ నుంచే వాగు దాటిపోవాలి.

ఒకగంటకు దళం అడవిలో లీనమైపోయింది. మస్చరస్కీ, బుగుర్కోవ్‌లు కందకంలో నిలబడి నిశాగర్భంలోకి తొంగిచూస్తున్నారు. క్షణక్షణానికి మ స కొవ్, గురోవిచ్‌లు దగ్గరకువచ్చి "ఏదైనా వార్త?" అని అడుగుతూ వుండేవారు.

"లేదు, ఎర్రరాకెట్ ఏమీ కన్పించటం లేదు"—ఇది వాళ్ళుముందుగా ఏర్పర్చుకున్న గుర్తు. అంటే తమకు జర్మనుల రహస్యాలు తెలిశాయని, తిరిగి వస్తున్నామని తెలియజేయటం.

శత్రువుల మెషిన్ గన్లు మూడుసార్లు ప్రేలాయి, కాని అది సామాన్యమైన ఊహల వలన జరిపిన కాల్పులు మాత్రమే. మస్ఛరస్కీ, బుగుర్కోవ్, ఇద్దరు కెప్టెనులు, కందకంలో మౌనంగా వున్న సైనికులు ఆతురతతో ఆ నదివైపుకు, ఎత్తైన పడమటి గట్టువంకకు, ఆ పొదలు, చెట్లు, జర్మనుల ముళ్ల తీగెలవంకా, జర్మనుల ఆవరణవంకా చూస్తూ వుండిపోయారు. కాని విచిత్రమైనదేమీ కన్పించలేదు. మరింకేమీకూడా కన్పించలేదు.

“ భూతనాయకుడు ” అని ముస్తాకోవ్ పొగడ్తగా అరిచాడు.– “అడవిలో భూతములవలె మాయమైపోయారు.”

“వాళ్లుదాటే వెళ్లివుంటారని తోస్తుంది.”

మస్ఛరస్కీ ఒక్కసారి హాయిగా శ్వాస పీల్చుకుని చూసుకునేసరికి తాను పూర్తిగా చెమటతో ముద్దయి పోయానని తెలుసుకున్నాడు.

రెజిమెంటు హెడ్క్వార్టరు నుంచి కెప్టెన్ ముస్తాకోవ్కు ఫోన్ వచ్చింది. ఆపరేటరు ఉద్వేగంగానే—“ అనువందలు, మీతో మాట్లాడాలనుకుంటున్నాం,” అని తెలియజేశాడు.

రాత్రిసమయం ప్రకృతి అంతా ప్రశాంతంగా వున్న ఆ సమయంలో అందరూ బాగుగాపరిచితమైన కర్నల్ సర్బ్చెంకో గంభీర ధ్వనిని విన్నారు.

“ త్రెవకిన్ పరిస్థితి ఏమిటి? ”

"కా౯్రేడ్ ఆరువందలూ; అంతా సరిగ్గా నేవున్నట్లుంది."

"అయితే నీభాగమంతా శాంతంగావుందా?"

"అవునండీ, కా౯్రెడ్ ఆరువందలూ!"

"బుగోర్కోవ్ అనుచరులింకా తిరిగి రాలేదా?"

"ఇంకా లేదండీ కా౯్రేడ్!"

ఒకక్షణం ఆగి డివిజను కమాండరు మరల అన్నాడు.

"సరే, ముస్తాకోవ్, వెళ్లండి. కొంచెంసేపు నిద్రపొండి."

"మంచిది కా౯్రేడ్ ఆరువందలు!"

మరికొంచెం సేపు మౌనం తదుపరి:—

"జర్మనులంతా శాంతంగా వున్నారుగా?"

"అంతా శాంతంగానే వుంది."

"జ్వాలలు?"

"వున్నాయి. కాని అంత ఎక్కువుగా లేవు."

"కాల్పులు?"

"అప్పుడప్పుడు."

"ఒకవేళ......అనుమానంగా......" "లేదు, లేదు కామ్రేడ్ ఆకువందంగా; ఎప్పటివలె సాధారణ కాల్పులే!"

" ముసలివాడు చాలా విచారంగా వున్నాడు. " అని ముస్తకోవ్ రిసీవర్ పెట్టూ అన్నాడు.





పొగమంచుతో కప్పబడిన చల్లని ప్రభాత సమయమది. చలికి ముడుచుకు పోయిన పక్షులకిలకిల రావములతో దిశలన్నీ సందడిగా వున్నాయి.

డివిజను కందిన సమాచారమునుబట్టి అడివంతా జర్మనులతో నిండివుంది. ఎటుచూసినా గుట్టలు గుట్టలుగా ట్రక్కులున్నాయి. కొల్లలుగా మోటారు కార్లున్నాయి. ఉన్నత శిఖరముల వలె కన్పించే రెండుగుర్రాల బండ్లు ఎన్నో వున్నాయి. ప్రతిచోట నిద్రపోతూన్న జర్మనులే. సహాటులాడుతూ ఇద్దరిద్దరు చొప్పున కాపలా వాళ్లు అడవి మార్గాలను

కాపలా కాస్తున్నారు. ఇక గూఢచారుల మిగిలిన ఆశ నల్లని ఆ అంధకారమే. కాని అది ఏక్షణంలోనైనా వీళ్లను మోస గించవచ్చు. ఏఅగ్గిపెట్టో లేక టార్చిలైటో వెలగిందంటే త్రెవకిన్, అతని సహచరులు కూడా ప్రమాదాలతో నిండిన ఆ భూమిమీద బారుగా సాగిల బడేవారు. నరికివేసిన చెట్లలో తలలకు గుచ్చుకుంటున్న ముండ్లలో గంటన్నర గడపాల్సి వచ్చింది. టార్చిలైటు వేసుకుని నట్టికాళ్లతో ఒకజర్మనీవాడు త్రెవకిన్ దగ్గరకు వచ్చాడు. వెలుతురు సరిగ్గా అతనిముఖం మీదే పడింది, కాని ఏహ్యాభావంతోవున్న జర్మనీవాడిదృష్టి అటుపోలేదు. ఏదో గొణుగుతూ, పాంటు ఎగదోసుకుంటూ కూర్చొబడ్డాడు.

మమోచికన్ తనకత్తి తీయబోయాడు. త్రెవకిన్ ఇది చూడలేదుగాని వెంటనే జరుగబోవుదానిని గ్రహించి మమోచి కన్ చేయి పట్టుకున్నాడు.

వాడులేచి వెళ్లిపోయాడు. వెళ్లేముందు వాడి టార్చి లైటు అడవిలోని ఒకభాగాన్ని వెలుతురుతో నింపేసింది. ఆవెలుగులో జర్మనులు తక్కువగావున్న ఒకమార్గాన్ని త్రెవకిన్ సురక్షిత మైనదిగా ఎన్నుకొగలిగాడు.

వాళ్లు వెంటనే ఆ అడవిదాటి వెళ్లిపోవాలి. ఎంత త్వరగా వీలైతే అంతమంచిది.

ఏడెనిమిది ఫర్లాంగుల దూరం దాదాపుగా వాళ్లు నిద్ర పోయే జర్మనీవాళ్ల మీదనుంచే దేకుకుంటూ వెళ్లిపోయారు. త్రోవలో వాళ్లు తమ కార్యపద్ధతిని నిర్ణయించు కున్నారు. జర్మనీ కాపలావాడుగాని, ఇంకెవరైనా తిరుగుతూ అటు వచ్చే జర్మనీ సైనికుడుగాని సమీపానికి వచ్చినప్పుడు నేలకు బల్లుల వలె అంటుకుపోయారు. రెండుసార్లు సరిగ్గా వెలుతురు వాళ్ల మీదే పడిందిగాని ప్రేతకళ 'ఆశించినట్లు' జర్మనులు వాళ్లను తమ వాళ్లేననుకున్నారు. పాకుకుంటూ, నిద్రపోతూ,జర్మనుల వలెనే నటిస్తూ పాకుకుంటూ వాళ్లు ముందుకు సాగారు. ఎల్లాగైతేనేం చివరకు ఆ అడవినిదాటి ఉదయమయేసరికి అడవి అంచుకు చేరుకున్నారు. పొగమంచు దట్టంగా పట్టి వుంది.

ఇక్కడ జరిగిన ఒకఘటన నిజంగా వారిని కంపించి వేసింది. అనుకోకుండా అకస్మాత్తుగా వారు ముగ్గురు జర్మనుల దృష్టిలో పడ్డారు. ఆ ముగ్గురూ ఆసమయంలో సరిగ్గా నిద్ర పోవటం లేదు. సగం పడుకుని, సగం కూర్చుని మాట్లాడు కుంటున్నారు. ఇంతలో వారిలో ఒకడిదృష్టి సమీపమందున్న పొదయందు పడి అలాగే స్తంభించి పోయాడు. అతి ప్రశాంతంగా, మరోదృష్టి లేకుండా ముందు వంకే చూస్తూ, ఒకరివెనుక ఒకరు అద్భుతమైన ఊరేగింపువలె, విలక్షణమైన దుస్తులు ధరించిన ఏడుగురు వ్యక్తులు ఆ అడవిమార్గం వెంట ముందుకు సాగిపోతున్నారు—కాదు; మనుష్యులు మాత్రంకాదు దాదాపుగా ఆకుపచ్చని ముఖాలు, కళా విహీనంగా మృత్యువు

వలె విచారంగావున్న ఆకుపచ్చని దుస్తులు దిగవేసుకున్న ఏడు భూతాలుగాదు మనుషులుగాదు.

ఈ ఆకుపచ్చని ప్రతిబింబాలమాయ ఆకారాలు, ప్రభాత సమయపు పొగమంచులో కన్పించే వారి అస్పష్ట ఆకారాలు, వారికి భూతాలుగాను అద్భుత స్వరూపాలుగాను కన్పించాయి. కనీసం రష్యావాళ్లు అనిగాని,—తమ శత్రువుల విషయమే వారికి గుర్తు లేదు.

"ఆకుపచ్చని భూతంరోయ్!" అని ఆచూచినవాడు భయపడి అరిచాడు.

ఆసమయంలో త్రెనకిన్ గాని, అతని అనుచరులు గాని ఏమాత్రం ఆశ్చర్యాన్ని గాని భయాన్నిగాని కనపర్చినా. ఎదుర్కొటానికి గాని పారిపోవటాన్కి గాని ఏమాత్రం ప్రయత్నకనపర్చినా, జర్మనులుతప్పక గల్లంతు చేసేవారు: మసక మసక వున్నగా ఆ అడవి అంతా ఒకక్షణంలో రక్త రంజిత స్థలమైపోయేది. శత్రువులకే అవకాశాలన్నీలభించేవి. ఆక్షణంలో తమలోవున్న తెలివి తేటలే త్రెనకిన్‌ను రక్షించాయి. ముస్గుకే ముసుగు జర్మనులు వారిని చూసివుంటే, పోట్లాడటం ఏమాత్రం లాభకారికాదు, ఒకవేళ ముందున్న పొదచాటుకు చేరుకుంటేం అక్కడ జర్మనులు లేకపోతే ఈ మాసిన ముసుగు గోలచేసి నాపారిపోవటానికి పూర్తి అవకాశం వుంటుందని త్రెనకిన్ వెంటనే నిర్ణయించు కున్నాడు. ఏదిచేయాలి అని తర్కించ కుండానే అతని అంతరాత్మ అతన్ని నిర్భయంగా వెళ్లటానికే

ప్రవేశించింది. ఒక కుక్కని చూసి మనం భయపడి పారిపోతే అదిమన భయాన్ని పసిగట్టి వెంటనే కవ్వించి మొరగటం ప్రారంభిస్తుంది.

ఆశ్చర్యంతో స్తంభించిపోయి గుడ్లప్పగించి చూస్తున్న ఆజర్మనుల ఎదుటనుంచి నిర్భయంగా, ఏమాత్రం తొణక కుండా అదేనడకలో దళమంతా కదలిపోయింది. ముందున్న పొద చాటుకుచేరి త్రెవకిన్ జాగ్రత్తగా నలుదిక్కులు పరికించి చూసి పరుగెత్తటం ప్రారంభించాడు. త్వరగా ఆపొదలుదాటి వారు ఒక నలుచదరంగల మైదానంలోకి చేరుకున్నారు. అక్కడ ఊబిపిట్టల్ని బెదర గొడ్తూ మరొక గుబురులో జారబడి కొంచెంసేపు విశ్రమించారు. ఆనీకానోవ్ పరీక్షగా నలుదిక్కులా అన్వేషించి చుట్టుపట్ల ఎక్కడా జర్మనులు లేరనేజాడ తెలుసు కున్నాడు. అలసటతో జావకారి పోతున్న మనుషులు కాస్త నేలమీద చదికిలబడి సిగరెట్లు ముట్టించారు. నిన్నసాయంత్రం తరువాత త్రెవకిన్ ఇప్పుడే మొదటిసారిగా మాట్లాడాడు;—

" పట్టుబడే వాళ్లమే బ్రతికిపోయాం. "

ఆయన చిరునవ్వు నవ్వాడు. మాట్లాడటమే కష్టంగా వుంది, రాత్రంతా మౌనంగా వుండటంతో నాలుక బిరువెక్కి మాటలుతడ బడుతున్నాయి.

ఇంతలో పదిమంది జర్మనులు, కొద్దిక్షణాల క్రితంతాము దాటి వచ్చిన పొదను వెదుకుతూ వుండటం చూసే అదృష్టం కల్గింది పడమటి దిక్కుకు వచ్చి వాళ్లు చాలా పరీక్షగా ఇంతకు

ముందు గూఢచారుల దాటి వచ్చిన ఆనలుచదరపు మైదానం వంక దృష్టి వుంచి చూశారు. తరువాత వాళ్లందరూ గుమిగూడి ఏదో మాట్లాడుకున్నారు, తరువాత నవ్వసాగారు—బహుశా ఆనుపచ్చని భూతాలను చూసిన ఆ ముగ్గురిని గురించే అయి వుంటుంది—గూఢచారులు సిగరెట్లు త్రాగటం పూర్తి చేసి తిరిగి వెళ్లారు.

క్రొత్తగా స్కౌటుల్లో చేరిన, సేమియోనోవ్, గోలూబ్‌లు ద్వేషంతో కూడిన ఆశ్చర్యంతో ఆజర్మనులవంక చూశారు. మొట్ట మొదటిసారిగా వాళ్లు శతృవుల్ని ఇంత సమీపంనుంచి చూశారు. త్రెవకిన్‌కూడా క్రొత్త స్కౌటుల వంక చాలా పరీక్షగా చూస్తున్నాడు. వాళ్ల ఆచరణకూడా మిగిలిన వారి వలె సరిగ్గానే వుంది. సేమియోనోవ్ గూఢ చారి దళంలో క్రొత్తవాడైతే కావచ్చునేమోగాని అతనికి యుద్ధానుభవం చాలా వుంది; రెండుసార్లు యుద్ధంలో గాయ పడ్డాడు; అనుభవ శాలియైన పాత సైనికునివలె వెనుక ముందు ఆలోచించే నెమ్మదియైన మనస్సుగలవాడు. కుర్స్కునివాసి, 17 సంవత్సరముల కుర్రవాడైన గోలూబ్ చురుకైనవాడు, అతని తండ్రి ఒక సోవియట్ అధికారి; జర్మనులాయనిని ఉరి తీశారు; అందుకని అతనెప్పుడూ ఉద్రేకంగా వుండేవాడు. అతని హృదయస్పందనలో ఆ హంతకుల ఎడ నిజంగా ద్వేషం నిండి వుంది. ఆ విచిత్ర పరిస్థితి అతనిలో చాలా ఉత్సాహాన్ని కల్గించింది.

మమోచికిన్ త్రెవకిన్ యొక్క ఆత్మబలాన్నీ, సమయస్ఫూర్తినీ, ఓర్పునూ పొగడకుండా వుండలేక పోయాడు. అకస్మాత్తుగా, వెనుకటి రోజుల్లో మొట్టమొదటి సారిగా అతనికి తమ అపాయకరమైన లక్ష్యంలో విజయం లభిస్తుందనే విశ్వాసం కలిగింది. నిన్నసాయంత్రం తాను కాత్యూషవద్ద ఎలా శలవు పుచ్చుకుందీ అతనికి స్ఫురణకొచ్చింది. ఆమె అతనితో త్రెవకిన్‌ను జాగ్రత్తగా కనిపెట్టి వుండమని ఎంతగానో కోరింది; తానప్పుడు ఆత్మసంతృప్తితో ఆమె భుజాలు తట్టాడు.

"విచారించకు కాత్యూశా! ప్రభుత్వ బ్యాంకులో వున్నంత సురక్షితంగా మమోచికిన్ వెంట నీ త్రెవకిన్ వుంటాడు అని అతను కాత్యూశాకు చెప్పాడు.

"కాని విషయం ఇక్కడపూర్తిగా తల్లక్రిందులైంది — త్రెవకిన్ వల్లనే మమోచికిన్ సురక్షితంగా వున్నాడు." అని మమోచిన్ మనసులో అంగీకరించాడు. తరువాత సంతోషంతో, గర్వంగా త్రెవకిన్ వంక చూశాడు. అందరికి ఒక్కొక్క కూర ముక్కనిచ్చి లెప్టినెంటు కోసం ప్రత్యేకంగా ఒకపెద్దముక్క అట్టే పెట్టేడు. ఆయనకోసం తన సీసానుంచి ఒకగ్లాసు ఓడ్కాకూడా ఇచ్చాడు.

ఆచుట్టుపట్ల గుబురులో జర్మనీవాడెవడూ లేడని తెలుసుకుని, జాగ్రత్తకోసం కాపాలాపుంచి తన మొదటి వార్తలు పంపుటకు నిశ్చయించుకుని, త్రెవకిన్ గ్రాజనీకోవ్ వీపు మీదనుంచి రేడియోసెట్టు దింపాడు. జవాబు రావటానికి చాలా

ఆలస్యమైంది. గాలి వివిధ రకాల ధ్వనులతోను, అస్పష్టమైన డుమడుమ ధ్వనులు, మాటలు సంగీత రాగాలాపనలతో నిండివుంది. తన వేవ్ లెంక్ వద్దే మరొక వేవ్ లెంక్ మీద ఒక జర్మను ఆఫీసరుయొక్క అధికార పూర్వకమైన గంభీర స్వరం విన్పించిది. దీనితో ఆయన కొంచెం ఖంగారుపడ్డాడు— ఇంతదగ్గరగా వున్న వేవ్ లెంక్ వలన 'నక్షత్రం' పట్టుబడ వచ్చుకూడా.

చివరకు నెమ్మదిగా ఆయనకొక ధ్వని విన్పించింది. ఆధ్వని ఒకే శబ్దాన్ని మాటిమాటికి ఉచ్చరిస్తుంది:—

"నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం!"

ఎంతో దూరానవున్న "భూమి" ఆపరేటరు. త్రెవికిన్‌నూ ఒకేసారి సంతోషంతో బిగ్గరగా అరిచాడు.

"నీకు చెప్తున్నాను. ఇరవైఒకటి గుడ్లగూబ రెండు. ఇరవైఒకటి గుడ్లబాబ రెండు," అని త్రెనకిన్ చెప్పాడు.

దూరానవున్న 'భూమి' ఒకక్షణం మౌనంగా వుండి అర్థమైదని సూచించింది. బాగా అర్థమైందనికూడా చెప్పింది

"చాలా, చాలా ఇరవైఒకటి, ఇరవైఒకటి ఇంతకు ముందే ఇక్కడకు వచ్చింది," అని త్రెవకిన్ మరల చెప్పాడు. 'భూమి' అదికూడా అర్థంచేసుకుంది. అది తెలియ పర్చటకు గాను. "అవును, చాలా ఇరవైఒకటి, చాలా" అని అంది.

ఉత్సాహం ద్విగుణీకృత మైంది. ఇటువంటి శత్రు దుర్గాలు గడచి రావటం, అందులో అడవంతా జర్మనులతో కికుకిటలాడుతుంది—రేడియో ద్వారా సంబంధ మేర్పరచుకుని ఈజర్మనుల రహస్యాలను తెలియజేయట, నిజంగా జీవిత మంటే ఇదే.

త్రెవకిన్ మాటిమాటికి తన అనుచరుల వంకచూస్తూ వారి ముఖాల్లో ఏదో చదువుతున్నాడు. వారు ఆయనక్రింద అణగి అధికారానికి లోబడి వుండేవారుకాదు, నిజమైన మిత్రుల వంటివారు. వారిలో ప్రతిఒక్కనిమీంద అందరు జీవితాలు ఆధార పడివున్నాయి. వారి కమాండరు త్రెవకిన్ వారిని విడివిడి వ్యక్తులుగా గాక అందరిని తన శరీరంలోని అవయవాల వలెనే చూసుకునేవాడు. 'భూమి' వద్దనైతే ఆయనవారికి వ్యక్తిగతం గా వేరు వేరు జీవితాలను గడుపుకుంటానికి అనుమతి ఇచ్చే వాడే, వారి బలహీనతల్నికూడా చూసీచూడనట్లు క్షమించ గలిగేవాడే—కాని ఇక్కడ ఏకాకిగావున్న నక్షత్రంవద్ద ఆయన. వాళ్లుకూడా విడి వడని ఏకత్వంలో ఇమిడిపోయారు.

త్రెవకిన్ చాలా సంతోషించాడు—తానే అయినఏడు రూపాల్ని లెక్కించి చాలా సంతోషించాడు.

ఆనీకానోవ్ సలహాతీసుకుని మ్యాపులో గుర్తుపెట్టుకున్న గ్రామానికి వెళ్లాలని నిశ్చయం చేసుకున్నాడు. అక్కడే ఒక రోడ్డు రైలు లైనుమీందుగా పోతుంది. పట్టపగలు ప్రయాణం చేయటం చాలా అపాయకరమనేది నిజమే అయినప్పటికీ

ఆగ్రామాన్ని, రోడ్డును వదలి ప్రక్కనే వున్న అడవుల్లోనుంచి ఊబిమైదానాల గుండా వెళ్లాలనుకున్నారు. జర్మనులు తరచు ఇటువంటి బోట్లకు చాలా దూరంగా వుంటారు.

వాళ్లు ఆగుబురువదలి పడమటి కొసకు చేరేసరికి ఒక జర్మను సైనికుల జట్టు ఊబి మైదానంగుండా లైనుగా నడవటం కన్పించింది. యూని ఫారంలు సామాన్య మైనవి. ముదురు ఆకుపచ్చ రంగుకు బదులు నల్లగా వున్నాయి. ముందు నడిచే ఆఫీసరుయొక్క బంగారు ఫ్రేము కళ్ళజోడు కనుకున్నట్లు మెరుస్తుంది.

" ఎస్.ఎస్. వాళ్లు, " అని ఆనీకానోవ్ నెమ్మదిగా అన్నాడు.

'ఎస్.ఎస్.' సైనికదళం వెనుక భోజన సామాగ్రితో నిండివున్న పెద్దపెద్ద బళ్ళు ఇరువైవరుసగా వస్తున్నాయి.

చేరువలోవున్న అడవిలో జొరబడి గూఢచారులు బళ్లయొక్క తాజా గుర్తుల్ని చూశారు. వాటిని వెంబడిస్తూ వాళ్ళు మరొక అడవివరకూ వెళ్లారు. అక్కడవాళ్ళు సైనికుల్ని జేరవేసే పన్నెండుబళ్ళు ఆయుధాలతోసహా దాయబడివుండటం చూశారు. బండ్ల చక్రాల గుర్తుమీద తాజాగా పడ్డ మట్టి వలన బళ్ళు ఇంతకు ముందే ఇక్కడకు వచ్చాయని గుర్తించ గలిగారు. ఆ సైనికుల ప్రవర్తన వలన గూడా అదేఅర్థమవు

తుంది. వాళ్లా అడవిలో గోలచేస్తూ అటూఇటూ పరుగెత్తు తున్నారు; చెట్లు నరుకుతున్నారు; నిప్పు వెలిగించటాని కి పుల్లలు పగలేస్తున్నారు; డేరాలు వేసుకుంటున్నారు — క్లుప్తంగా చెప్పాలంటే కొత్తచోటికి చేరినప్పుడు చేసేటటు వంటి పనుల్లో అందరూ నిమగ్నమైవున్నారు.

స్కౌటులు పాకుతూ ఈ అపాయకరమైన అడవి నుంచి బయటపడి కుడిప్రక్కగా ఆచుట్టుదిరిగి ముందుకు వెళ్లారు. కాని అక్కడ ఆయుధాలతో నిండివున్న ట్రక్కులు ఎక్కువగా వున్న మరొక జర్మనుమకాం కన్పించింది.

సిగరెట్ పెట్టెలు, టిన్నులు, మురికిగా వున్న పనికిరాని కాగితం ముక్కలు, ఖాళీసీసాలతో ఆప్రదేశంలో మొలకలెత్తు తున్న పచ్చదనం కప్పివేయబడింది — అసహ్యాకరమైన, అపరిచిత జీవితచిహ్నాలతో నిండివుంది. ఎన్నోగుర్తులు చెట్లకు వ్రేళ్లాడుతున్నాయి, వాటిల్లో '5నం' అంకె గలవి 'W' అక్షరం గలవే చాలా ఎక్కువగా వున్నాయి.

స్కౌటులు తరువాత చీకటిపడేవరకు నిరీక్షించాలి—పగలు నడవటం అసంభవం. ఆచుట్టుపట్లంతా, మాట్లాడుతూ, నిద్ర పోతూ, ప్రయాణం చేస్తున్న, గుంపులు గూడుతున్న జర్మను లతో క్రిక్కిరిసివుంది.

ఈవిశాలమైన అడవులచిరుచీకట్లలో తాజాగా సైన్యాన్ని సమీకరించి జర్మనులు ఏదో ఏర్పాట్లు చేస్తున్నట్లు త్రైవకిన్, మిగిలిన గూఢచారులు గ్రహించారు. బహుశా ఇప్పుడే మొట్ట

మొదటిసారిగా వారు తమకు వప్పగించిన పనియొక్క మహ త్త్వాన్ని, తమ బాధ్యతలోని గంభీరాన్ని అర్థంచేసుకున్నారు. రోజంతా ఒక కందకంలో కునికి పాట్లుపడుతూ గడిపి సాయంత్ర మవగానే స్కాటులు మరల బయలు దేరారు.

కొద్దిసేపటికే ఒక అందమైన చోటుకు చేరుకున్నారు. అక్కడ చిన్న పెద్ద సెలయేర్లు చాలావున్నాయి; చల్లగావుంది. సెలయేరుల గట్టులన్నీ సింకోనా చెట్లతో నిండి అలంకరింప బడినట్లున్నాయి. కప్పల బెకబెకలతో ఆప్రదేశమంతా సజీవ మైనట్లుంది.

ఒకసెలయేరు ప్రక్కనే అక్రోటు చెట్లగుబురులో వున్న గోతిలో ఆగవలసిందిగా త్రెవకిన్ ఆదేశించాడు. ఎదుటి గట్టుమీద విశాలమైన రెండంతస్తుల రాతి కట్టడమొకటుంది. దానిలోనుంచి జర్మనుభాష విన్పిస్తుంది.

చిన్నమట్టిరోడ్డు ఒకటి భవనపు కుడిప్రక్కగా పోతుంది. అటుదూరంగా ఇరువైపులా ముళ్లతీగ వేయుబడిన ప్రధానమైన రోడ్డువుంది.

త్రెవకిన్ రోడ్డుకు కొంచెం దూరంలో కాపలా పెట్టాడు. ట్రక్కులు, కార్లు ఎడతెగకుండా వస్తున్నాయి. ఆప్రవాహం మధ్యమధ్య గంట అరగంట ఆగి మరల మొదటిమాదిరిగానే జోరుగా సాగుతూవుంది. ట్రక్కులు జర్మనులతోను, పైనపు గుడ్డలు కప్పిన రహస్యకరమైన పదార్థాలతోనూ నిండి

వున్నాయి. చాలాదృఢమైన పెద్దపెద్ద లారీలు రెండుసార్లు ఫిరంగుల్ని చేరవేశాయి—మొత్తంవెళ్ళిన ఫిరంగులు ఇరువైనాలుగున్నాయి.

ఎడతెగకుండా నడుస్తున్న ఈ ప్రవాహాన్ని త్రైవకిన్ జాగ్రత్తగా కనిపెడ్తున్నాడు; మిగిలినవాళ్ళు వంతులు చొ॥న నిద్రపోతున్నారు. మేల్కొన్నవాళ్ళు త్రైవకిన్‌తోపాటు కూర్చుని జర్మను సైన్యాల్ని లెక్కపెడ్తున్నారు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్," అంటూ మమోచికిన్ అకస్మాత్తుగా చీకటిలోనుంచి వచ్చి, ఆమార్గంగుండా ఒకబండి వెళ్తూవుంది, దానిలో ఇద్దరు మాత్రమే జర్మనులున్నారు. బండి నిండా ఇనుబండాశాలు కూడా వున్నాయి. మీరు అనుమతి నిస్తే ఏమాత్రం చప్పుడు లేకుండా, ఒకతుపాకీ గుండు కూడా ఖర్చు లేకుండా వాళ్ళపని పూర్తి చేస్తాం," అన్నాడు.

త్రైవకిన్ జాగ్రత్తగా ఆతనివెంట వెళ్ళాడు. నిజంగానే రోడ్డుమీద ఒకేఒకబండి చాలా నెమ్మదిగా నడుస్తుంది. ఇద్దరు జర్మనీవాళ్ళు విశ్రాంతిగా సిగరెట్లు పేలుస్తూ గప్పాలు కొడ్తున్నారు. ఒబండిలో కపంది అరుస్తుంది. ఈజర్మనుల్ని కైమా చేయాలని మహావుంది; వాళ్ళధోరణికూడా అందుకే పురి కొల్పుతుంది. కాని త్రైవకిన్ విచారంగా తల వూపుతూ, "వీళ్లను పోనివ్వులే," అన్నాడు.

మమోచికన్ మనస్సు కలుక్కుమంది. ప్రతిదీ ఎంతో అనుకూలంగావుంది, అతను యుద్ధం చేసేమూడ్‌లో వున్నాడు.

తననేర్పరి తనాన్ని అందరికీ ముఖ్యంగా ఆనీకానోవ్‌కు చూపించాలని ఎంతో ఆదుర్దాగా వున్నాడు. "నలువైపులా రహస్యాలు చెప్పేవాళ్లు దొరక గలిగినప్పుడు ఊతిరగటం, దాగుకోవటం అవసరమేముంది," అని మమోంచికిన్ ఆలోచించాడు.

ఉదయమౌతున్న కొద్దీనెమ్మది నెమ్మదిగా రాకపోకలు ఆగిపోయాయి.

"పిల్లు రాత్రుల్లు మాత్రమే తిరుగుతున్నారు. మన విమాన దళాలకు దాక్కుంటున్నారు. ఈ దుర్మార్గులేదో ఏర్పాట్లలో వున్నట్లు కన్పిస్తుంది," అని ఆనీకానోవ్ అన్నాడు.

త్రెపకిన్ మరల తన అనుచరుల్ని ఆ అక్రోటు చెట్ల గుబురులోకి తీసుకు వెళ్లాడు. ఆప్రభాత సమయపు కొంకర్లు పోతున్న చలిలో స్కౌటులకు నిద్రవచ్చింది. ఉన్నట్టుండి సెలపేరు ఒడ్డునవున్న భవనంనుంచి మూల్గులు, అరుపులు విన్పించాయి.

ఎందుకనోగాని ఒకసారి త్రెపకిన్ మనస్సులో మర్చెంకోను గురించిన భావం మెదిలి పోయింది. మరొక సారి అరచిన ధ్వని విన్పించింది, తరువాత అంతా ప్రశాంతగా వుంది.

"అక్కడేమి జరుగుతుందో నేను వెళ్లిచూసివస్తాను," అని బ్రెజినీకోవ్ సూచించాడు.

"వెళ్లటం అంత మంచిదిగాదు, వెలుగు వస్తుంది," అని క్రైవకిన్ జవాబిచ్చాడు.

తెల్లవారింది. సూర్యుని అరుణ కిరణాలు సెలఏరులో ప్రతిబింబిస్తున్నాయి. మహోచికిన్‌లోన జేబుల్లో దొరికిన రొట్టె, కూర కొంచెంకొంచెం తిని స్కౌటులందరూ నిద్ర పోయారు.

క్రైవకిన్ మాత్రం నిద్రపోలేక పోయాడు. ఆయన సెలయేరు ఒడ్డుకు పాకివచ్చి సమీపమందున్న పొదలో నిశ్చలంగా పడుకున్నాడు. రెండవ ఒడ్డునవున్న భవనం నెమ్మది నెమ్మదిగా మేల్కొన సాగింది. దానిలో వున్న మనుషులు ఆవరణలో తిరుగాడ జొచ్చారు.

కొద్దిసేపటి తరువాత వారిలో ముగ్గురు వ్యక్తులు బయటకు వచ్చారు. వారిలో అందరికంటే పొడవుగా వున్న వ్యక్తి వాళ్ళిద్దరికి నమస్కరించి ఆవరణదాటి బయటికివచ్చాడు. ఒక మిట్ట సమీపానికి వచ్చి ద్వారంచెంత నిలబడివున్న వ్యక్తు లిద్దరికి మరొకసారి నమస్కారంచేసి వేగంగా మట్టిరోడ్డువెంట నడువ సాగాడు. అతని వీపుమీద ఒకసంచి, ఎడమ భుజం మీద ఒక తెల్లని పట్టీవుండటం క్రైవకిన్ చూశాడు.

ఆసైనికుణ్ణి పట్టుకుని బంధించాలనే ఆలోచన క్రైవకిన్‌కు మెరుపువలె తట్టింది. ఆలోచనకంటే ఆత్మప్రేరేపణ అధికంగా వుంది. సహజంగా ఒకనాజీని చూసినప్పుడు ఒకస్కౌటుకు కలిగే ఆత్మప్రేరేపణే ఇది. రాత్రి స్కౌటుల్ని కలవర పచ్చిన

అరుపుకు, ఆనాజీ భుజంమీాదవున్న తెల్లని పట్టీకిగల సంబంధం త్రెవకిన్‌కు తెలిసిపోయింది. సెలయేరు ఒడ్డున వున్న భవనం ఒకజర్మను హాస్పటలు. ఆమట్టిరోడ్డు వెంట పోతున్న జర్మనీ వాడు హాస్పటలు నుంచి రిలీవ్ చేయబడ్డాడు. తనయూనిట్ దగ్గరకు వెళ్లిపోతున్నాడు. ఈసైనికుడు మాయమైన సంగతి ఎవరికీ అంతు చిక్కదుకూడా.

ఆనీకానోవ్, మమోచికిన్‌లు మేల్కొంటున్నారు. త్రెవకిన్ నెమ్మదిగా వాళ్లదగ్గరకు ప్రాకి ఆ బిర్రాచెట్ల మధ్య నుంచీ పోతున్న పొడవైన ఆకారంవంక సైగచేశాడు.

"మనం ఆ జర్మనీవాడిని పట్టుకోవాలి."

మమోచికిన్, ఆనీకానోవ్ లిద్దరూ చాలా ఆశ్చర్య పడ్డారు. ఎప్పుడూ అతి జాగ్రత్తగావుండే లెఫ్టినెంట్ ఇంత పట్టపగలు ఒక జర్మనీవాడిని పట్టుకోమని ఆజ్ఞాపిస్తున్నాడు. త్రెవకిన్ ఇంటివైపుకు సైగచేశాడు:

"అది హాస్పటలు," అని ఆయన తెలియ జెప్పాడు.

వారు ఎండలో మెరుస్తున్న ఒకతెల్లని పట్టీనిచూసి తెలుసుకున్నారు.

వాళ్ళు నిద్రపోతున్న స్కౌటుల్ని మేల్కొల్పిమార్గాన్ని అడ్డగించుటకు అడవిమధ్య నుంచీ బయలుదేరారు. నాజీ ఈల వేసుకుంటూ జోరుగా నడుస్తున్నాడు. వసంత ఋతువు యొక్క ఉదయా నందాన్ని పొందుతున్నాడు. పని చాలా

తేలిక. ఇంతకు ముందెప్పుడూ 'రహస్యాలు చెప్పేవాడిని' చూడని చిన్నవాడైన గోలూబ్ చాలా నిరాశ చెందాడు. జర్మనీ వాడిని తాకే అవకాశంకూడా కనీసమతసకెన్నడూ లభించలేదు. ఉద్రేక పడుతున్న గోలూబ్‌కు అసలు విషయ మేమిటో అవగతమైయే లోపుగానే ఆజర్మనీవాడు బంధింపబడి వాడిటోపీతోనే వాడినోరును బంధించి వేశారు.

అక్రోటుచెట్ల గుబురులో జర్మనీవాడు నేలమీద పడి వున్నాడు. మొనదేలిన ముక్కు ఆకాశంవంక సైగచేస్తూంది.

ఆతడి ముఖంమీద కప్పిన టోపీని తొలగించారు. వాడు నెమ్మదిగా మూల్గాడు. "నీవు ఏయూనిట్‌కు చెందినవాడివి?" అని త్రెవకిన్ మాటల్ని రష్యను ఉచ్ఛారణతో పలుకుతూ ప్రశ్నించాడు.

"భూసైన్యంలో 131వ డివిజనులో కందకాలు త్రవ్వే కంపెనీకి చెందిన వాడిని." అని ఆ జర్మనీవాడు జవాబు చెప్పాడు.

ఈ డివిజనే ముందుభాగాన సమీకరించ బడివుందని గూఢచారులు గ్రహించారు.

త్రెవకిన్ పరీక్షగా ఖైదీవంక చూశాడు. ఆతడి వయస్సు 25 సంవత్సరాలుంటుంది. జనపనారవంటి జుత్తు; జర్మనీవాళ్ల వలెనే నీళ్ళునిండిన నీలవర్ణం కళ్ళు.

నీళ్ళునిండివున్న ఆకళ్ల వంక తీక్షణంగా చూస్తూ త్రెవకిన్

తన రెండవ ప్రశ్న అడిగాడు. "నీవిక్కడ ఎస్.ఎస్. సైనికుల్ని చూశావా?"

"అవునండి, చూశాను." తనకు విషయాలన్నీ తెలుసు నన్నట్లుగా జర్మనీవాడు జవాబు చెప్పాడు. తన చుట్టూవున్న రష్యనులవంక చాలా సాహసంగాచూసి, "వాళ్లిక్కడ చాలా మందివున్నారు." అని చెప్పాడు.

"వాళ్లందరు ఏయే యూనిట్లకు చెందినవాళ్లు?"

"వైకింగ్ టాంక్ డివిజనుకు చెందినవాళ్లు. అది చాలా బలమైనది, ప్రసిద్ధి చెందినదీను. హిట్లరు ఎన్నుకున్న సైన్యం ఇదే."

"ఊఁ........" అన్నాడు త్రెవకిన్.

త్రెవకిన్ ఏదో గొప్ప మహత్తరమైన విషయాన్ని గ్రహించాడని స్కౌటులు అనుకున్నారు. ఆజర్మనీవాడికి ఆ డివిజనుయొక్క సరియైన లెక్కలు ఎందుకు సమీకరిస్తున్నారో, తెలియసప్పటికీ, తనకు తెలిసిన ఆసూచన ద్వారానే దాని ఉద్దేశ్యాన్ని త్రెవకిన్ ఊహించుకోగలడు. త్రెవకిన్ మైత్రీభావం వ్యక్తమయేటట్లు ఆజర్మనీవాడి వంక చూశాడు. అతని కాగితాలన్నీ పరీక్షించాడు. విచారంగా కన్పించే యువకుడైన ఈ రష్యనువంకచూసి అకస్మాత్తుగా

ఆజర్మనీవాడికేదో ఆశకలిగింది. మనస్సును ఆకర్షించే ఈర్ష్యను యువకుడు నిజంగా తనచావుకు అనుమతినిస్తాడా?

త్రెవకిన్ కాగితాలన్నీ పరీక్షించటం ముగించి తలపైకెత్తే సరికి అతన్ని ఇక చంపివేయాలనే విషయం గుర్తుకు వచ్చింది. ఆయనభావాన్ని గ్రహించి జర్మనీవాడు కలతపడ్డాడు, తరువాత చాలా బాధగా;—మిష్టర్ కమ్యూనిష్టు కామ్రేడ్! నేనుకూలి వాడిని. నాచేతులవంక చూడండి. నన్నునమ్మండి, నేను నాజీవినిగాదు. నేను కూలివాడిని, కూలివాని కొడుకును, అని అన్నాడు.

జర్మనీవాడు చెప్పినదాని సారాంశం ఆనీకానోవ్‌కు అర్థమైంది. జర్మనీ భాషలోని 'కూలి' శబ్దంయొక్క అర్థం అతనికి తెలుసు.

తన కాయలుకాసిన చేతుల్ని చూపుతూ. "నేనుకూలి వాడిని," అని వాడు చెప్తున్నాడు. ఆనీకానోవ్ కొంచెం ఆలోచనా పూర్వకంగా అన్నాడు; "మనం కష్టజీవుల్ని గౌర విస్తామని ఇతనికి తెలుసును అనే దీనివుద్దేశ్యం. అతనెవరితో యుద్ధం చేస్తున్నాడో తెలుసు. అయినప్పటికి మనతో ఇంకా యుద్ధం చేస్తూనే వున్నాడు..........."

కష్టజీవుల్ని ప్రేమించటం, గౌరవించటం, త్రెవకిన్‌కు చిన్నతనం నుంచి నేర్పబడింది. కాని లీప్‌జిక్‌యొక్క ఈకంపో జిటర్ని. తప్పక చంపాల్సిందే.

జర్మనీవాడు త్రెనకిన్ కళ్ళల్లోవున్న దయాభావం, నిశ్చలత్వం రెండూ చూడగలిగాడు. వాడేమీ తెలివితక్కువ బడుద్ధాయికాడు. కంపోజు చేస్తూ అతనెన్నో విజ్ఞానదాయకమైన గ్రంథాలు చదివివున్నాడు. ఏ రకమైన మనిషి తన ఎదుట నిలబడ్డాడో అతను అర్థంచేసుకున్నాడు. దయాభావం వుట్టిపడినా, ఒక గంభీర నిశ్చలత్వంతో తనఎదుట నిలబడివున్న అందమైన ఆ యువకునిరూపంలో మృత్యువును చూసి వాడు ఆవురుమని ఏడ్చాడు.





వాళ్ళహృదయాల్లో ఏమిజరుగుతుందో బహుశా వాళ్ళే చెప్పలేరు. పూర్వాపర సంబంధంలేనిదీ, గతించి పోయినవీ అన్నీ వారిమనస్సులనుంచి వేరై పోయాయి. ఒకవేళ అవెప్పుడైనా తిరిగివచ్చినా అస్పష్ట ఆకారంలోనే. వాళ్ళు తమపని కోసం మాత్రమే జీవిస్తున్నారు. మరొక ఇతర వస్తువుయందు వారికి దృష్టిలేనే లేదు.

ఆనీకానోవ్, గోలూబ్ లిద్దరూ మార్గంచూపిస్తున్నారు,

వాళ్లకు షుమారు 40 మీటర్ల దూరంగా వెనుక త్రెపకిన్ వున్నాడు, ఆయనతోబాటు సేమియోనోవ్ ట్రాన్సమిటరు తీసుకుని నడుస్తున్నాడు. వారికి ఎడమ ప్రక్కగా ఆరోడ్డుతో సమానంగా వచ్చే ప్రత్యేక రోడ్డువెంట ఒకఅంచుగా మమోంచికిన్, బాయ్కోవ్‌లున్నారు. అడవివైపునుంచి ఏఅపాయం రాకుండా రక్షించటానికి కుడిప్రక్కగా బ్రెజనీకోవ్ వున్నాడు. వారు చూడటానికి రెండు సమభుజాలుగల త్రిభుజాకరంగా వున్నారు. ఆధార కేంద్రంలో త్రెపకిన్, శిఖర్ భాగముందు ఆనీకానోవ్‌లున్నారు. అప్పుడప్పుడు జర్మనులు సమీపమందే వున్నారని తెలిసినప్పుడు ఆత్రిభుజాకారం కుచించుకుపోయి చాలా నెమ్మది నెమ్మదిగా నడుస్తూవుండేది. మిగిలిన సైనికులు ఆగి రాత్రిసమయమందు వచ్చుధ్వనుల్ని జాగ్రత్తగా వింటూ వుండేవారు. ఎప్పుడైనా ఆనీకానోవ్ పక్షివలె అరచినప్పుడు దళమంతా ఎక్కడివాళ్లక్కడే పాతుకు పోయినట్లు నిలబడేవారు.

ఎడమప్రక్క రోడ్డుమీద ట్రక్కులు, ట్రాక్టరు పోతున్నాయి జర్మనుపాటలు, జర్మనుతిట్లు, జర్మనుఆజ్ఞలు కూడా వారికి వినిపిస్తూవుండేవి. అప్పుడప్పుడు తాము చేయి చాస్తే అందుకోగలిగినంత సమీపంనుంచి జర్మను సైనికుల మాటలు బిగ్గరగా వినిపిస్తూవుండేవి. సైనికులమాటలు చాలా స్పష్టంగా వినిపించేవి. చేయిచాస్తే ఏ జర్మనీవాడినైనా పట్టుకోవచ్చుననీ, వాడిముఖాన్ని తాకవచ్చుననీ, వాళ్ళ సిగరెట్టును ముట్టుకుని చేయకాల్చుకోవచ్చుననీ అనిపించేది.

"ప్రస్తుతం "రహస్యం చెప్పేవాడినెవడినీ" పట్టుకోగూడ దని క్రెవకిన్ గట్టిగా నిర్ణయించుకున్నాడు. తానిప్పుడు శత్రువుల యూనిట్లకు పూర్తిగా మధ్యలోవున్నానని ఆయన అనుకుంటున్నాడు. ఎస్.ఎస్. వాళ్ళ గుంపంతా తనుమీద విరుచుకు పడటానికి ఒక్క తప్పటడుగుచాలు, ఎవడినైనా పట్టుకున్నప్పుడు వచ్చే చిన్న మూలుగుచాలు. వైకింగ్ ఎస్. ఎస్. టాంకుదళం అక్కడ సమీకరింప బడుతుందని ఆయనకు తెలుసు, కాని దానిబలమెంతవుంటుందో, అది ఏ వుద్దేశ్యంతో సమీకరించబడుతుందో ఆయనకు తెలియదు. ఆదళాల్ని, టాంకుల్ని, మరఫిరంగులను లెక్కిస్తే ఎంత ఎక్కువ బలమో అంచనా వేయవచ్చు, కాని వాటి సమీకరణోద్దేశ్యం మాత్రం చాల పరిజ్ఞానంగల జర్మనీవాడికి మాత్రమే తెలుస్తుంది. ఒక్కసారి రైలుస్టేషనును పరికించినతరువాతనే అటువంటి జర్మనీ వాడిని వెదకాల్సుంటుందనుకున్నారు.

కాని తలవని తలంపుగా జాగ్రత్తగా వేసిన క్రెవకిన్ స్కీము తల్లక్రిందులైంది. ఆయన అకస్మాత్తుగా తన ఎడమ ప్రక్క ధ్వనివిని అటుచూశాడు, ఆ అంధకారంనుంచి మమో చికిన్ ప్రత్యక్షమై నెమ్మదిగా రిపోర్టిచ్చాడు.

"చిత్తుగా త్రాగిన జర్మనీవాడొకడు ఈరోడ్డుప్రక్కనే నవాబుగారిలాగా పడివున్నాడు......"

"త్రాగివున్న" జర్మనీవాడింక ఒక్కసారిచూస్తేనే ఏమి జరిగిందో క్రెవకిన్‌కు అర్థమైంది. వాడు అజాగ్రత్తవలన త్రోవ

తప్పి ఆగుబురులోకి వచ్చాడు, మమోంచికిన్ దెబ్బతీసి వాడి ఆయుధాలు లాగేశాడు.

"వాడు సరాసరి నన్ను టాకాడు, ఇక నేనేంచేయను?" అని మమోంచికిన్ సంకోచిస్తూ సంతృప్తంగా చెప్పేశాడు.

చర్చించే సమయమూలేదు. ఆ ఖైదీని ఎత్తుకుని వారు అడవిలోకి మాయమైయారు. జర్మనుల ధ్వనులు, రష్యనుల చెవులకు చాలా విచిత్రంగా విన్పిస్తున్నాయి- పోయిన తమ మిత్రుణ్ణి పిలిచినట్లు- ఓయ్. ఓహోయ్ ఓఓవ్......

అంటూవిన్పిస్తున్నాయి:

"విలీబాల్డ్! విలీబాల్డ్!"

"హేర్ బెనెక్!"

వాళ్లాఖైదీని తీసుకువచ్చి సెలయేటి ఒడ్డున గడ్డిమీద పడుకోబెట్టారు. మమోంచికిన్ కొద్దిగా నీళ్లుతెచ్చి అతనిముఖం మీద చల్లాడు. తనదగ్గరవున్న ఓడ్కా- కొంచెం ఇవ్వటానికి- కూడా లోభితనం కనపర్చలేదు. అతను చాలా సంతోషంగా వున్నాడు, "తన" జర్మనీవాడిని గురించి గొప్పగా చెప్తూ ఆకాశానికెత్తు తున్నాడు:—

"వీడు నిజంగా ఎస్.ఎస్‌వాడే అయివుంటాడు, వీడి కంతా తెలుస్తుంది......క్రామేర్ లెఫ్టినెంట్, చూడండి! వీడు ఒక ఆఫీసరు. ప్రమాణంచేసి చెప్తున్నాను, వీడుఆఫీసరేనండీ!"

జర్మనీవాడిని చాలా ఉత్సాహంతో చూస్తూ యువక బోలూబ్ నిరాశగా ముక్కు చికిలించి బాధతో దీర్ఘంగా నిట్టూర్చాడు:

"ప్రతివాళ్ళు" రహస్యాలు చెప్పేవాళ్లను "తెస్తున్నారు, కాని నాకు ఒక్కడూ దొరికిచావడు."

"విచారించకు బోలూబ్! మనచుట్టూ గుట్టలుగుట్టలుగా వున్నారు, నీకు ఛాన్సు వస్తుంది," అని దూరంగా విన్పించే కేకనువింటూ ఆనీకానోవ్ అన్నాడు.

జర్మను ఆఫీసరు భయంగా త్రెవకిన్ వంక చూస్తున్నాడు. భయంతో వణుకుతూ, నత్తులుగొడ్తూ, తాను పంచమ వైకింగ్ ఎస్.ఎస్.టాంకు డివిజనులో తొమ్మిదవ పడమటి క్షేత్ర మోటారు రెజిమెంటు వాడిననీ చెప్పాడు. మమోచికిన్ కు వాడి జేబుల్లో దొరికినకాగితాల్లో వున్నదే ఇదంతా. తరువాత ఈక్రింది విషయాలుకూడా చెప్పాడు: పశ్చిమక్షేత్ర మోటారు రెజిమెంటులో నాలుగేసి కంపెనీలు గల మూడుబటాలియన్లు వున్నాయి, పెద్దఎత్తున "పెద్దపెద్ద ఆయుధాలు" గల రెజిమెంట్ల వద్ద ఆరుమొదలు పదిబారులుగల ఫిరంగులున్నాయి. రెజిమెంటులో టాంకులనేవే లేవు—రెజిమెంటువద్ద వున్నవో లేవో కూడా అతనికి తెలియదు. డివిజను యుగోస్లేవియా నుంచి వచ్చింది. హెడ్ క్వార్టరు కొద్దిదూరంలోనే ఒకగ్రామంలో వుంది, కాని పేరు అతనికి తెలియదు. ఎందుకంటే రష్యా,

పోల్ పేర్లు అతనికి గుర్తువుండవు. అతనికి తెలిసిన పేర్లల్లా "మాస్కో" "వార్సా" లు మాత్రమే.

వాడు ఇదంతా హెచ్చరించినట్లు చాలా విచిత్రంగా చెప్పాడు.

"సంరక్షకుడైన" మమోచికిన్, ముఖంమీద కొట్టిన పిడిగుద్దుకు, ఒకక్షణంక్రితం వరకు వాడుకూడ దీసుకున్న ఆత్మ నిగ్రహం కాస్తా ఎగిరిపోయింది. ఆ దెబ్బతో గాడ్దువలె అరిచాడు. మమోచికిన్ వాడికళ్లకు మృత్యువుకంటే భయంకరంగా కన్పిస్తున్నాడు. మమోచికిన్ వాడివైపుకు కాస్త వంగితే చాలు వాడుగజగజ వణుకుతూ యాచనా పూర్వకంగా త్రెవకిన్ వంక చూసేవాడు.

జర్మను ఆఫీసర్ని ఆ సెలయేటిలో పారవేసి "భూమి"తో సంబంధాలు పెట్టుకున్నాడు.

ఈసారి ఇద్దరిమధ్య మాటలు చాలా స్పష్టంగా విన్పిస్తున్నాయి. తాము ప్రోగుచేసినవార్త లన్నిటినీ అందచేశారు.

'భూమి' నుంచి వచ్చే ధ్వనుల్నిబట్టి వింటే తానుపంపిన వార్తలు చాలా మహత్వపూర్ణమైనవిగా గుర్తించబడ్డాయని, ఆశించకుండా లభించిన అమూల్యావార్తలని త్రెవకిన్ తెలుసుకున్నాడు. చివరకు ఒకస్త్రీ కంఠం విన్పించింది, అది కాత్యాదనికూడా ఆయన గుర్తించాడు. కాత్యా అతనికి విజయం లభించాలని, త్వరగా తిరిగిరావాలనీ కోరుకుంది.

"నేను మీకు నాప్రేమను అందజేస్తున్నాను," అని ఆమె అతని భావుకత్వంవల్ల, విజయంవలన కలిగిన గర్వంతో, అభిమానం ఉట్టిపడేట్లు వణుకుతున్న కంఠంతో అంది. తానన్నమాటలకు, తాను చెప్పినదానికీ ఎటువంటి సంబంధమూ లేదని ఆమెకు అకస్మాత్తుగా తోచిందా అనిపించింది: "తెలిసిందా, ఏమిటి? ఏమి తెలిసింది?" అని తరువాత అడిగింది.

"నేను తెలుసుకున్నాను," అని ఆయన జవాబిచ్చాడు.

ఉదయమయేసరికి స్కౌటులు తాము అనుకున్న స్టేషనుకు నాల్గు మైళ్ళ దూరంలోవున్న రైల్వే కూడలివద్దకు చేరుకున్నారు.

ఇక్కడచుట్టూరా లావైన స్వదేశీ ఇనుప స్తంభాలు, ముళ్ళ తీగె వేయబడి మధ్యలో ఒకే అంతస్తుగల ఒక రాతికట్టడం వుంది. దానికి పసుపుపచ్చనిరంగు వేశారు. అక్కడికి సమీపంలోనే వున్న ఒకనదియొక్క కర్ర వంతెనకు ఇరువైపులాకూడా ఇటువంటి రక్షణ భవనాలున్నాయి. ఇటువంటివాటిద్వారా జర్మనులు తమ ప్రయాణ సామాగ్రిని, గెరిల్లా దాడులనుంచి రక్షించుకోవా లనుకుంటున్నారు.

దానిఎదుట లెక్కలేనన్ని ట్రక్కులు లైనుగా బారు తీర్చి నిలబడివున్నాయి. ఈలైనుయొక్క వెనుకభాగం ఇంత ఉదయమే స్కౌటులు బయటకు వెలువడిన అడవివరకు

వ్యాపించివుంది. గంభీరమైన ఆ ప్రశాంత వాతావరణంలో వారికి ఆ ఇంటినుంచి టెలిఫోన్ గంట, ఒక మోటారుగావున్న జర్మను కంఠం విన్పించాయి.

అడవిలో వరుసగా రెండురోజులు తిరిగిన తరువాత వారికి అనంతంగా కన్పించే ఆరైలులైను, టెలిఫోను స్తంబాలు, పాయింట్ల నల్లని త్రికోణాలు చూడటం. ఆనందంగా అగు పించింది.

ముందే నిర్ణయించుకున్న ప్రకారం ఆనీకానోవ్ పక్షి అరుపు తోదళాన్ని ఆగిపొమ్మని సూచించి నెమ్మదిగా పాకుతూ చిట్టచివరి ట్రక్కు దగ్గరకు చేరుకున్నాడు. డ్రైవరు కూర్చునే చోటవున్న కిటికీనుంచి తొంగిచూశాడు. అది ఖాళీగావుంది. దానిముందున్న రెండింటి పరిస్థితికూడా ఇదే. పైకప్పువరకు ఖాళీ పిండిసంచులు పడవేసి వున్నాయి.

ఆనీకానోవ్ తిరిగివచ్చి త్రెవకిన్‌కు తెలియ జేశాడు: "అవి లోడ్ ఎత్తుకుంటానికి వచ్చాయి. రైలుకోసం నిరీక్షిస్తున్నారు," అని చెప్పాడు.

త్రెవకిన్‌కూడా రైలుకోసం నిరీక్షించాలని నిశ్చయించు కున్నాడు. కాని ఎక్కడా ఒక్కరైలు జాడకూడా లేదు. కొంచెం సేపటికి తిట్టుకుంటూ డ్రైవర్లు ఆఇంటినుంచి వెలుపలకు వచ్చి తమతమ ట్రక్కులవైపుకు బయలు దేరారు.

ప్రభాతసమయపు ఆ నిశ్శబ్ద వాతావరణంలో స్పష్టంగా

విప్పించేవారి సంభాషణలలోని అంశాల్ని బట్టి, ట్రక్కులు లోడ్ చేసుకునేది స్టేషను వద్దగాని ఇక్కడ గాదనీ, అవి బయలుదేర బోతున్నాయనీ ట్రేవకిన్ చెప్పగలడు. స్టేషనంతా జర్మనులతో నిండివుంటుంది; తనదళాన్నంతటినీ అపాయంలోకి పంపటం తెలివితేటలేమీగావు.

అతనీ పనికిగాను ఆనీకానోవ్‌ను, బాయ్‌కోవ్‌ను ఎన్ను కున్నాడు, కాని ఎంతో ప్రాధేయపడి వేడుకోవటం వలన గోలూబ్‌ను మూడవ మెంబరుగా పంపాడు.

"వాహనం మీదే ఎక్కివెళ్దాం," పనిమంతుడి ధీమాతో ఆనీకానోవ్ అన్నాడు.

ముగ్గురు స్కేటులలా పాకుకుంటూ చివరి ట్రక్కు దగ్గరకు చేరుకుని వేగంగా దానిలోకి ఎక్కారు. ఆనీకానోవ్ చాలా జాగ్రత్తగా గోలూబ్‌ను, బాయ్‌కోవ్‌ను సంచులతో కప్పివేసి తరువాత తానుకూడా వాటికింద దూరాడు—అతను బయటకు చూడగలగటాన్కి ఒకచిన్న రంధ్రం ఏర్పరచుకుని తన టామీ గన్‌ను సిద్ధం చేసుకున్నాడు.

పచారుచేసుకుంటూ జర్మను డ్రైవరు త్వరగా తన ట్రక్కుదగ్గరకు చేరాడు. చక్రంవద్ద తనస్థానంలో కూర్చు న్నాడు. తనముందు ట్రక్కు బయలుదేరటాన్ని నిరీక్షిస్తు న్నాడు, ఇగ్నేషన్ తలుపువేసేసి స్టార్టరు నొక్కాడు, ఇంజను గరగర శబ్దం చేయసాగింది.

ఆట్రైనులోని మిట్టలు దూకుతూ ఆ అడవిమార్గంవెంట ట్రక్కులు ముందుకుసాగాయి. ఈవిధంగా షుమారు పది నిముషాలవరకు ఆట్రక్కు లావిధంగానే నడిచాయి. అక స్మాత్తుగా డ్రైవరు బ్రేకులు వేశాడు.

ఆనీకానోవ్‌కు జర్మనుభాష విన్పించింది, ఇద్దరు జర్మ నులు ప్రక్కనుంచి ట్రక్కులోకి ఎగిరి దూకటం చూశాడు. స్కాటుల అదృష్టవశాత్తు ఆ ఎస్. ఎస్ సైనికులకు తమ నల్ల యూనిఫారాలకు ఎక్కడ పిండి అవుతుందోనని భయపడి వాళ్ళు ఆసంచులకు దూరంగా వెనుక బల్లమీదకుపోయి కూర్చున్నారు. ట్రక్కు ఎగిరెగిరిపడ్తూ ఊగుతూ బయలుదేరింది. అప్పుడప్పుడు సంచులక్రిందినుంచి మానవ ఆకారాలు కన్పిస్తున్నాయి. ఆనీకానోవ్ చాలా భయపడ్తున్నాడు. బహుశా ఈ పిలవ పెట్టని సహయాత్రికులు గమ్యస్థానంవరకు రాగోరుచున్నట్లయితే తమపరిస్థితి చాలా చిక్కులో పడిపోతుంది.

ఇంతలో అకస్మాత్తుగా కల్గిన గందరగోళం అతని ఆలో చనలకు భంగం కల్గించింది. ట్రక్కులన్నీ ఆగిపోయాయి, ఎటుచూసినా చెల్లాచెదరుగా పరుగెత్తుతున్నారు; వెనుక ట్రక్కు బల్లమీద కూర్చున్న జర్మనులిద్దరూ క్రిందకిదూకారు.

మరుక్షణంలో విమానాలు ఎగురుతున్న ధ్వని స్పష్టంగా విన్పించింది. అలవాటుప్రకారం ఆనీకానోవ్‌కూడా తలవంచే శాడు. తరువాత– "అవితమవే," అని గుర్తువచ్చి అతను లోలోపలే నవ్వుకున్నాడు.

"ఇవి మన విమానాలే!"

ఆరువిమానాలు భయంకరంగా క్రిందికివాలి ఆ అడవి మీద తిరుగాడుతున్నాయి.

ఆనీకానోవ్ నలుదిక్కులూ పరికించిచూశాడు. జర్మను లందరూ పొదల్లో శరణుజొచ్చారు. గాబరాపడిన ఇంజన్ల విజిల్స్ స్పష్టంగా విన్పిస్తున్నాయి. స్టేషనుకు పూర్తిగా సమీపానే వున్నారు.

"నావెనుకరండి," అని ఆజ్ఞాపించి ఆనీకానోవ్ క్రిందికి దూకాడు.

స్కౌటులు ట్రక్కుల మధ్యనుంచి పారిపోతూ ఒక కందకంలో దూకారు, తరువాత వెంటనే బయటకువచ్చి వేగంగా దట్టమైన అడవుల్లోకి జొరబడిపోయారు. వారు కందకంలోవున్న ఆ ఒక్కక్షణంలోనే వాళ్ళ నొక జర్మను చూశాడు. చూడగానే అలాగే నిర్విణ్ణుడైపోయి బిగ్గరగా పిచ్చివానివలె "పేరాషూట్ సైన్యం!" అని అరిచాడు.

ఎడతెగకుండా ఎడాపెడా గుండ్ల వర్షం కురిసింది. స్కౌటులుకూడా తగినట్లే తమ టామీగన్లతో జవాబిచ్చారు.

ఒక వెడల్పైన మైదానం దాటిపోయినతరువాత ఆనీకానోవ్ గోలూబ్ ముఖం కళదప్పటం చూశాడు. తన పొట్టి ముక్కు చికిలిస్తూ అతను నేలమీద పడిపోయాడు.

ఆనీకానోవ్ అతన్ని భుజం మీద వేసుకున్న తరువాత,

"ఆ జర్మనువాడిని మనం పట్టుకోగలిగే వాళ్లమే," అని గోలూబ్ అన్నాడు.

గాయం తగిలిన తరువాత ఇవి అతను మొదటి సారిగా మాట్లాడిన మాటలు. అతని చిన్ని జీవితంలోని ఆఖరు మాటలివే. ఒక భయంకరమైన గుండు అతని గుండెనుంచి దూసుకుపోయింది. పాపం! ఇంకా గుండె ఆడుతున్నప్పటికీ అతను క్షణక్షణానికి క్షీణించిపోతున్నాడు. తరువాత అతనికి ఒక్కసారి స్పృహవచ్చింది, తనపైకి వంగివున్న ఆనీకానోవ్ గంభీర ముఖాన్నీ, కన్నీళ్లతో నిండిన మమోచికిన్‌నూ చూశాడు.

ఇంతలో అడవిమీదకు తుఫాను విరుచుకు పడింది. ఆతుఫాను విసుర్లకు చెట్లు విపరీతమైనధ్వని చేస్తున్నాయి. పెద్ద పెద్ద నీటి బొట్లు ఎలుకలు పాకినట్లు స్కౌటుల కాళ్లముంచు పడుతున్నాయి.

అంతిమ క్షణాలు లెక్కిస్తున్న గోలూబ్‌దగ్గ కూర్చుని త్రెవకిన్ ఆనీకానోవ్ కొరకు ఎదురు చూస్తున్నాడు. ఈసారి ఆనీకానోవ్ మమోచికిన్ వెంట స్టేషనుచుట్టిరానటానికి వెళ్లాడు విచారకరమైన ఈఘటన జరిగిన తరువాత త్రెవకిన్ తనదళాన్ని ఇంకెక్కువగా చీల్చగూడ దనుకున్నాడు. కాని గోలూబ్ జీవించి వున్నంత వరకు అతన్ని వదలి వెళ్లటానికీవీలులేదు, పని కూడా చేయాల్సేవుంది.

అతను 'భూమి'తో సంబధం పెట్టుకుంటానికి చాలా

ప్రయత్నించాడు కాని ఉపయోగం లేకపోయింది. ఆకాశంలోని ఉరుములు, మెరుపులు ఆటంకం కలిగిస్తూ వుంటాయి. రిసీవర్‌లో గాలిధ్వనులే విన్పిస్తున్నాయి. మధ్యమధ్య గరగర ధ్వనులొస్తున్నాయి.

కాళ్ళక్రింద చిన్నచిన్న నదులే ప్రవహిస్తున్నాయి. త్రెవకిన్ భుజాలమీాద పెద్దపెద్ద వర్షంచినుకులు పడ్తున్నాయి. ఆకుంభవృష్టి, ఆ బాలునిముఖం మీాద వున్న దుమ్మును, బాధను కడిగేసింది. చీకట్లో భావశూన్యమైన అతనిముఖం మెరుస్తుంది.

ఆనీకానోవ్, మమోచికిన్‌లు పాకుకుంటూ స్టేషను సమీాపానికి చేరుకున్నారు. అప్పుడప్పుడు మెరుస్తున్న మెరుపుల్లో రెండు గూడ్సుబళ్లు నిలబడివుండటం కన్పించింది. దానిలో ఒకపెట్టెమీాద బలమైన టాంకు ఆకారాలు కన్పించాయి.

ఇంజెన్లు పొగమేఘాలను వదలి, పట్టాలమీాద నిప్పు కణాలు విరజిమ్మాయి. చుట్టూ ముళ్ళతీగె వేయబడిన గోడౌన్‌వద్ద జర్మనులు క్రిక్కిరిసి వున్నారు. డోకుపుట్టించే జర్మనుభాషలో వారేదో మాట్లాడుకుంటున్నారు. బస్తాలు ఎత్తుకునివున్న యుక్రైన్ రైతుస్త్రీల గుంపును రైలుపైను ఆవలకు నెంటుచున్న కాపలావాళ్ల కేకలు విన్పించాయి. స్త్రీల ఆర్తనాదాలు, ఫిర్యాదులుకూడా స్కౌటులకు విన్పిస్తున్నాయి.

“ఈకుక్కలు ఎక్కడికీకూడా పోనివ్వటంలేదు!”

ఆనీకానోవ్‌కు తనమీదే కోపం వస్తుంది. ఆ వెధవ ట్రక్కులో ఎక్కాలనే ఎందుకు కోర్కె గలిగింది? ఒకవేళ తాము దానిలో ఎక్కకుండావుంటే గోలూబ్ ఇంకా జీవించే వుండేవాడు. అతను సైబీరియాలో ఆబళ్లమీద ఎక్కేవాడు. ఈ వెధవ ట్రక్కులో ఎక్కాలనే ఎందుకు కల్గింది?

జర్మనులు రైలుమీదనుంచి టాంకులు దింపుతున్నారు. ఏదో పెద్దదండయాత్రకే సంసిద్ధమౌతున్నట్లు స్పష్టమౌతుంది. కాని ఏవైపునుంచి—ఎక్కడ అనేదే ప్రశ్న. ఒకవేళ వాళ్లు మరొక జర్మనీవాడినే పట్టుకోగల్గితే బహుశా ఎస్.ఎస్‌వాళ్ల సంకల్పం తెలియవచ్చు.

ఆనీకానోవ్ ఆలోచించ సాగాడు:— "ఎదుట ఎక్కడ చూసినా జర్మనులు తిరుగాడుతూ కన్పిస్తున్నారు. కాని వాళ్లల్లో తమకిపిజను కార్యక్రమం పూర్తిగా తెలిసినవాడెవడు? ఇంతాచేసి ఏఅరబుద్ధవాడినో పట్టుకుంటే తమ శ్రమకు ఫలితం కూడా దక్కదు. అర్థంలేని పనేఅవుతుంది."

పొడవుగా, బక్కబల్చగావుండి పెద్దపెద్ద వానకోటులు వేసుకుని తిరుగుతున్న ఇద్దరు జర్మనులు ఆనీకానోవ్ దృష్టిని ఆకర్షించారు. మధ్యమధ్య మెరుపుల్లో వాళ్ళు ఒక్కసారి ఒకేచోట, మరొకసారి వేరువేరుగాను ఏదో ఆదేశాలిస్తూ తిరగటం కన్పిస్తుంది—పనులన్నీ వారి అధీనంలోనే వున్నవనేది స్పష్టమే. వాళ్లు ఆఫీసర్లనేదికూడా అర్థమవుతూనేవుంది.

సమీపమందున్న గోడౌన్ వెనుక 'గోడవద్ద ఆగివున్న కారులో చేరారు.

వర్షంలో వణుకుతూ ఆనీకానోవ్ గోలూబ్‌ను గురించి ఆలోచించాడు—ఇంకా గోలూబ్ జీవించి వున్నాడా? పాపం, నీళ్ళలో పడి వుండివుంటాడు. ఆ జర్మనులు కప్పుకున్నటువంటిదే ఒక వానకోటు అతనికికూడా లభిస్తే ఎంత బాగుంటుంది?

"ఒకఆఫీసర్ని పట్టుకుందామా?" అని ఆనీకానోవ్ మమోచికిన్‌ను అడిగాడు.

"కాని లెఫ్టినెంటో? ఆయన ఎవర్నీ పట్టుకోవద్దని చెప్పాడుగా?"

ఆనీకానోవ్ తన మిత్రునివంక పరిశీలనగా చూశాడు.

"కనురెప్పవేసే వ్యవధిలో నేను ఒకడిని పట్టుకొచ్చేస్తాను. వెంటనే ఇంటికి వెళ్ళిపోదాం," అని అతను చాలా తాపీగా, మృదువుగా అన్నాడు.

మమోచికిన్ కంపించి పోయాడు. వందలకొలదీ వున్న ఆజర్మనులమధ్య తామున్నది ఇద్దరు మాత్రమే. ఆ వందల కొలదీ జర్మనులమధ్య — తామిద్దరూ — ఒక ఆఫీసర్ను పట్టుకోవాలి? అతను నిజంగానే కంపించిపోయాడు. అయినప్పటికి ఆనీకానోవ్ ఇంకా పరిశీలనగా అతని ముఖంలోకి చూస్తూ—

"నిజంగానే, మనం కన్నుమూసి తెరిచేలోపుగా ఆపని చేయ గలం......"అన్నాడు.

మమోంచికిన్ నిరాశతో భుజాలెగరేసి, దీర్ఘంగా నిట్టూర్చి లేచి నిలబడ్డాడు. అతను తనకు తానే ధైర్యం చెప్పుకుని తపతప బాదుతున్నట్లు పడేవర్షంవంక తలెత్తి ఆదుర్దాగా, త్వరత్వరగా మాట్లాడాడు:-

"వెళ్దాం పద, చేసేద్దాం వాన్యా,.........చేసేద్దాం. బాగానేవుంది వాన్యా. మనమంతా చేసేద్దాం. తప్పకుండా చేద్దాం. ఏమంటావ్?"

వాళు కారుదగ్గరకు పాకారు. ముళ్లతీగె క్రిందనుంచి దూరి దాక్కున్నారు.

"ఆజర్మనుల్లో ఒకడు జనరలని నాకు తోస్తుంది," అని మమోంచికిన్ తనను తాను ఓదార్చుకుంటూ గొణిగాడు.

"తప్పకుండా వాడు జనరలే," అని ఆనీకానోవ్ సంతోషం వ్యక్తమయే స్వరంతో అన్నాడు.

కనీసం ఒకగంటకాలం గడిచిపోయిన తరువాత వాళ్లకు నడుస్తున్న చప్పుడు విన్పించింది. ఆ ఆఫీసర్లలో ఒకడు——"ఇకనేను వెళ్తున్నాను," అని అన్నాడు.

ఎదురొమ్ములో ఆనీకానోవ్ కత్తి తగిలి వాడు పడి పోయాడు రెండవవాడు తోలిమిణితి వలె భగభగమంటున్న

మనోచికిన్ విశాలమైన ఎముహోమ్మ్న ముఖానికి అనుకుని వ్రాంటం చూసి నోటివెంట మాటరాక అలాగే మూర్ఛ చెందాడు

చుట్టుపట్లవున్న జర్మనులు ధారగా కురుస్తున్న వర్షంలో కొంకర్లుపోతూ గోడౌనుకు, రైళ్లకు మధ్య అటుఇటు హడావుడిగా పరుగెత్తుతున్నారు.





జర్మనుల సైన్యంలో ఎస్.ఎస్. సైన్యం చాలా ప్రసిద్ధి చెందినది. దానిలో పంచమ వైకింగ్ ఎస్. ఎస్. టాంకు డివిజను ఆయువుపట్టువంటిది.

ఎస్. ఎస్. లెఫ్టినెంట్ గ్రూపెన్ ఫ్యూరర్ హెర్బ్స్ట్ హిల్ నాయకత్వాన తొమ్మిదవ పడమటిక్షేత్ర మోటారు రెజిమెంటు, పదవ జర్మను మోటారు రెజిమెంటు, పంచమ టాంకు రెజిమెంటు, మరఫిరంగుల అయిదవ బటాలియను, అయిదవ యుద్ధక్షేత్ర ఫిరంగి రెజిమెంటు, యివన్నీ కలిసివున్న ఈ డివిజను దట్టమైన యీ అడవిలో ప్రశస్తమైన ఒకటవ

రకవు ఆయుధాలతో రహస్యంగా సమీకరించబడుతుంది. కోవెల్ పట్టణాన్ని చుట్టివున్న రష్యనులపై అకస్మాత్తుగా దాడి జరిపి వారి వ్యూహాన్ని విచ్ఛిన్నంచేయాలనీ, రష్యా సైన్యాలను ఒకదానికొకటి సంబంధంలేకుండా చెల్లాచెదరుచేసి, తరువాత ప్రసిద్ధమైన స్టోఖోడ్, స్టాయిర్ నదుల వరకు తరిమి కొట్టాలని వారివూహ.

బలమైన ప్రతిఘటనాశక్తి వుంది; 15 వేలమంది సైనికులున్న డివిజను; "టాంకులకురాజు" అనబడే సరికొత్త టైగర్ టాంకులు 60 వున్నాయి. స్టేండర్టెండన్ ఫ్యూరర్, ములన్ కేంఫ్‌లకు సర్వాధికారాలున్నాయి. వీళ్ళు అనేకసార్లు హిట్లరుకు సహాయసైన్యాధ్యక్షులుగా కూడా వుండివున్నారు. హిట్లరుయొక్క గూఢచారులవలన ప్రశంశించబడ్డారు. జాతీయ సమాజవాద పార్టీలోనూ, సైనిక శాసన కమిటీలోనూ పెద్ద పెద్ద హోదాల్లో వున్నారు. కుతంత్రాలలో చాకచక్యం గలవాళ్లు; దయాశూన్యులు.

లెఫ్టినెంట్ జనరల్ నికేల్ అజమాయిషీలో పనిచేస్తున్న 342వ చేతిబాంబుల డివిజనుకూడా త్వరలోనే ఫ్రాంసునుంచి రాబోతుంది—ఇది వైకింగ్ సైన్యమంత పేరుగలదిగాక పోయినా చాలా ముఖ్యమైనదే.

దండ యాత్రకు సంబధించిన ఏర్పాట్లన్నీ చాలా రహస్యంగా జరుగుతున్నాయి

ఒక ఎస్.ఎస్. జర్మను కంమాండరు బర్లిన్ సమీప

మందున్న తన భవనంనుంచి గ్రూప్‌ఫ్యూరర్‌ హిల్‌తో మాట్లాడుతూ- "రష్యనుసైన్యాలు గవర్నరు జనరల్‌ ప్రాంతానికి చాలా దగ్గరవరకూ కదనొక్కుకువచ్చాయి. పార్టీకి నమ్మకస్తుడవైన నీకు దీని పరిణామం తెలియగలదు, హిల్‌! నీవే తెలుసుకోగలవు. యూరప్‌ అంతటిలో జర్మను వ్యతిరేక శక్తుల్ని కదిలించటము, బహుశా ఇంగ్లండు, అమెరికావాళ్లను కూడా క్రియాశీలురుగా ముందుకు కదిలించడమే దీని అంతరార్థమైవుంటుంది. సైనిక సమీకరణ చాలా రహస్యంగా జరపమని హెడ్‌క్వార్టర్‌ కోర్కె. చాలా జాగ్రత్తగా పని సాగించు.

తన డివిజను మొత్తాన్ని కోవెల్‌కు పడమరగా వున్న కీకారణ్యాల్లో సమీకరించిన తదుపరి, తనకు నప్పగించ బడిన పనిలో విజయం లభించగలదనే దృఢ విశ్వాసంతో హిల్‌ తరువాత కార్యక్రమానికి సంబందించిన ఆ దేశాలకు ఎదురు చూస్తున్నాడు.

కాని ప్రస్తుతం తనసైన్యం 1940—1943ల్లో వున్నట్లుగా లేదనేది అతడికి బాగుగా తెలుసు. పవిత్ర జాతీయసిద్ధాంతాన్ని వదులుకోవడం అవసరమైంది. అయిష్టకరమైనప్పటికీ మరొక మార్గములేదు. నెదర్‌లాండ్‌, హంగరీ, పోల్‌, క్రొట్‌వాసు లెందరో తన డివిజనులో వున్నారనేది కూడా వాస్తవమే. ఇంతేగాక ఆదర్శ శరీర సిద్ధాంతాన్ని కూడా వదులుకోవాల్సి వచ్చింది. ప్రస్తుతం డివిజనులోవుంది జర్మనులనుంచి ఏరుకున్న

ఆ జానుబాహులు గాక పిట్టనంటి గుప్పెడుగుప్పెడు మనుషులు. వాళ్ల వంక చూసినప్పుడు గ్రూఫెన్‌ఫ్యూరర్ హాల్‌కు అసహ్యం కలిగేది.

జర్మను మోటారు రెజిమెంటును తనిఖీ చేసేటప్పుడు హిల్ ఆశ్చర్యంగా కొయ్యబొమ్మవలె నిలుచున్న చోటే వుండిపోయాడు. వాళ్లల్లో కొంతమందికి ఒకకన్ను లేదు; మరి కొంతమంది కుంటివాళ్ళు; ఒకగూనివాడు కూడా వున్నాడు; సగంమందికిపైగా చాలా పొట్టివాళ్లు. ధ్వంసము, హత్యలు అనే కార్చిచ్చుతో హాలెండు, ఫ్రోన్సులనుదాటి, హత్య దోపిడీల రాక్షసోన్మాదంతో మకాకసస్ పర్వతాల వరకు చొచ్చుకు వచ్చిన హిట్లరుసైన్యంలోని వాళ్లుకానేకారు.

పాతకాలంనాటి విషయంవలె కన్పించే ఆనాటి విషయాలను స్మరించుకుని హార్బర్ట్‌హిల్ ఆనందపడేవాడు. ఆతడికి కాకసస్ అన్నింటికంటే బాగానచ్చింది, దక్షిణపు వృక్షాలమైన స్విట్జర్లాండు సౌందర్యంకంటే ఇది ఎన్నోరెట్లు ఎక్కువ శోభాయమానంగా వుంది. ఒకసారి హేర్ గ్రూఫెన్ ఫ్యూరర్ సమృద్ధివంతమైన ఆ పర్వత ప్రాంతానికి తాను గవర్నరు కావాలని శాంతికాలపు హోదానుగురించి కూడా కలలు గన్నాడు. తన అంగరక్షకుల ద్వారా విశ్రాంతి దాయకమైన ఆ వుద్యోగం కొరకు అనువైన ప్రదేశ నిర్ణయం కూడా చేయించాడు. కాని ప్రపంచానికి తెలిసిన కారణాల వల్ల ఎంతో శ్రమించి అతడుకట్టుకున్న పేక మేడలన్నీ కూలి పోయాయి.

చాలా విచిత్ర విషయం. వసంత ఋతువారంభం నుంచి అతని హృదయం భారంగానేవుంది. మొట్టమొదట శతృవిమానాలు కన్పించటమేగాని బాంబులు వేయలేదు. వాళ్లు ఆ చూకీకోసం మాత్రమే వచ్చారు. రష్యను విమానాలు అడివంతా పరిశీలనగా తిరిగాయి. సామాన్లు దింపేచోట్ల, రైలులైనుమీద ఎన్నోసార్లు తిరిగాయి. సేనలన్నీ చాలా రహస్యంగా వున్నప్పటికీ, రష్యనులు ఈప్రాంతంలో ఇంతపరిశీలనగా తిరగడం చాలా అనుమానించదగ్గ విషయమే.

ఎంతో అనుభవంగల సైనికుడు, పడమటిక్షేత్ర మోటారు రెజిమెంటులోని సుప్రసిద్ధ వీరుల్లో ప్రముఖుడు అయిన మెకలన్ బర్గుయొక్క హాప్సచర్ ఫ్యూరర్ రాత్రి ప్రయాణ సందర్భంలో సెలయేటి ప్రాంతాన మాయమై పోయాడని విన్నప్పుడు ఆతడి సందేహం మరింత బలపడింది. ఎంతో వెతగ్గా ఆతడి శవం హెడ్ క్వార్టరుకు అయిదుమైళ్ల దూరమందున్న ఒక చిన్న సెలయేటిలో చొరికింది. హేర్ హాప్సచర్ ఫ్యూరర్ ఎదురొమ్మున ఒకకత్తి దిగబడివుంది. తలపై యేదో భారమైన ఆయుధంతో కొట్టబడిన గాయముంది.

ఆ తదుపరి సోవియట్ విమానాలు హెడ్ క్వార్టరు మకాంలపై బాంబులు కురిపించుటకు, జెనిక్ హత్యకు సమన్వయం చూపటం ఏమంత ఆశ్చర్యకరమైన విషయంగాదు. దానితో. హిల్ గాబరాపడి తన హెడ్ క్వార్టరును అడవిలో

మరొక చోటికి మార్పించి దాని చుట్టూ ముప్పేటగల ముళ్ల తీగను కట్టుదిట్టంగా వేయవలసిందిగా ఆదేశించాడు.

ఆ సాయంత్రం—స్టాఫ్‌సర్జన్ లిడ్‌మెన్ గ్రూపెన్ ఫ్యూరర్‌కు శవపరీక్ష రిపోర్టు చదివి విన్పించేటప్పుడు. మడమటి క్షేత్రమోటారు రెజిమెంటునుంచి, హాప్సచర్ ఫ్యూరర్, విలీ బాల్డ్ ఆర్నెస్ట్ బెనక్‌లు హత్యచేయబడిన ప్రదేశానికి కొద్ది దూరంలో అడవిని గాలించే సమయమందు ఒక ఆక్రోటు గుబురులో ఒకశవం దొరికిందని—అతడు 131వ భూసైన్య డివిజనులోని కార్పోరల్ కార్లహిల్ (పేర్లలోవున్న ఈసామ్యం గ్రూపెన్ ఫ్యూరర్‌హిల్‌కు చాలా చీకాకు కల్గించింది.) అని మరొక రిపోర్టు వచ్చింది.

మరికొంచెం సేపటికి జర్మను మోటారు రెజిమెంటు కమాండరు స్టాండర్టెంటేన్ ఫ్యూరర్ ములెన్ కేంఫ్ స్వయంగా ఫోనులో మాట్లాడుతూ, ఆకుపచ్చని దుస్తులు ధరించిన ఇద్దరు వ్యక్తులతో చిన్నయుద్ధం జరిగిందనీ, దానిలో ఇద్దరు మిషనర్లు, ఇద్దరు గ్యాసునర్లు గాయపడ్డారనీ, మిషనర్ల స్థితి ప్రమాదకరంగా వుందనీ, చూసిన సైనికులందరూ ఆ రహస్య వ్యక్తులమీద మంచుపేరుకువుందని ఏకగ్రీవంగా చెప్పారనీ తెలియజేశాడు.

గ్రూపెన్‌ఫ్యూరర్ ప్రతి విషయాన్నీ అతి జాగ్రత్తగా పరిశీలించవలసిందనీ, ఆ ఇద్దరు అజ్ఞాత వ్యక్తుల్ని వెదకవలసిందనీ ఆజ్ఞలు జారీచేశాడు. ఈపనికోసం ప్రతి బటాలియన్‌నుంచీ ఒక దళాన్ని తీసి, ఆ తీసిన దళాలన్నీ ఒకేదళంగా

ఆ కార్యక్రమంలో చురుకుగా పాల్గొన వలసిందిగా హెచ్చరించాడు.

ఆ ప్రదేశంలో ఆకుపచ్చని భూతాలు, సైతానులు తిరుగుతున్నవని సైనికులు చెప్పిన మాటలు విని గ్రూపెన్ ఫ్యూరర్ కు చాలా కోపంవచ్చింది.

గ్రూపెన్ ఫ్యూరర్ కు ఇటువంటి ప్రేతాత్మలమీద ఏమాత్రం నమ్మకంలేదు. కూపీలు తీయవలసిందిగానూ, హెచ్చరించి రహస్యరక్షక దళ ముఖ్య కెప్టెన్ వర్నర్ ను పిలిపించి,"యుద్ధంలో భూతాలు, పిశాచాలువుండవు, యుద్ధంలో వుండేది శత్రువులు మాత్రమె. ఆ 'భూతా' ల ఆచూకీ తీయటంలో నీవు ప్రత్యేకంగా శ్రద్ధతీసుకుని పనిచెయి," అని చెప్పి పంపాడు.

అదేరాత్రి సరిగ్గా స్టేషనులో బండినుంచి ఒక టాంకు రెజిమెంటు దిగే సమయంలో, స్వయంగా గ్రూపెన్ ఫ్యూరర్ వచ్చి తనిఖీచేసి వెళ్లిన రెండు గంటలకు స్టాంటర్ డన్ ఫ్యూరర్ (మరల తనపేరుతో సామ్యం చూసి హీల్ హృదయం కంపించింది) ఎస్.ఎస్.మేజరు హత్య చేయబడ్డాడు. డివిజనులో ప్రముఖ క్వార్టర్ మాష్టర్ (ఎస్.ఎస్. సీనియర్ లెఫ్టినెంట్) ఓబర్ స్టర్మ ఫ్యూరర్ ఆర్టర్ జెండెల్ ఎత్తుకుపో బడ్డాడు. పాపం హేంక్ హీల్ బలంగా కత్తితో పొడవబడి చంపబడ్డాడు. కత్తి

ఆ వైపునుంచి ఈవైపుకు వచ్చింది. ఇంతకూ ఇదంతా జరిగింది ఆఫీసర్లు, సైనికులు క్రిక్కిరిసివున్న స్టేషనులో వాళ్ళమధ్యనే.

సెంట్రీలకు, ఆఫీసర్లకు గ్రూపెన్ ఫ్యూరర్ 15రోజులు జైలుశిక్ష విధించాడు. తరువాత కెప్టెన్ వర్నర్‌ను పిలిచి అపరాధుల్ని పట్టుకోవటానికి తగినంత కృషి, ప్రయత్నమూ చేయనందుకు గట్టిగా చీవాట్లు పెట్టాడు.

ఆయుధ సామాగ్రి తెచ్చేరైలు పట్టాలు సరిగ్గా రేక ధ్వంసమై పోవటము, జర్మను రెజిమెంటులోని ముగ్గురు సైనికులు విషం కలిసిన ఆహారం తిని చనిపోవటము, ఆరెజి మెంటులోని సైనికులే మరిద్దరు పారిపోయిన దానికి, ఇటువంటి వాటన్నిటి గౌరవమూ ఆ "ఆకుపచ్చని భూతాల," కు ఆపాదించారు. నిజము, కల్పితాలు, ఊహలు, వాస్తవమూ వీటన్నిటి మధ్య జాడతీయటం కష్టమై పోయింది.

వీటివలన కలిగిన పరిణామాలను చూసి గాబరాపడి గ్రూపెన్ ఫ్యూరర్ "కోక్‌హెడ్ క్వార్టర్సు, సైన్యానికి కమాండరు ఫీల్డుమార్షల్ బుష్‌కు," రష్యావాళ్ళు ఎక్కడికక్కడ గండిలు కొట్టి కాపీలు తీసే ఒకస్కౌటు దళాన్ని జర్మనుసైన్యాల మధ్యకు పంపారు. 131వ భూసైన్యపు అజాగ్రత్తవల్ల ఈ స్కౌటులు రైకింగ్ డివిజను దేశాల దాకా చొచ్చుకు వచ్చారు. బహుశా వాళ్లు ఈసైన్య సమీకరణోద్దేశ్యాన్ని గురించి వివరాలు తెలుసుకునే వుంటారు," అని వార్త పంప వలసిందిగా ఆజ్ఞాపించాడు.

కొంచెం ఆలోచించిన తరువాత జెర్లిన్‌లోవున్న ఒకర్ గ్రూపెన్ - ఫ్యూరర్ బాన్ దేబాక్ కు వ్యక్తిగతంగా కూడా ఉత్తరం వ్రాశాడు. దానిలో అతను తన సంరక్షకునకు సంతోషం కలిగించటంతోపాటు, తాను అపజయం పొందే స్థితిలో సహాయం కూడా పొందగలిగేటట్లు వ్రాశాడు. జెర్లిన్‌లో విశ్రాంతి తీసుకుంటున్న చాలామంది ఆఫీసర్లకు హేక్ హాల్ పాల్గొన్నందుకు సంతోషం గల్గింది.

మరురోజు చివరి ఝామున ఎడతెగకుండా మోగే టెలిఫోను గంట గ్రూపెన్ ఫ్యూరర్‌ను భోజనానంతరపు నిద్ర నుంచి మేల్కొల్పింది.

ఇంతకు ముందే జర్మనులకు పచ్చభూతాలకు యుద్ధం జరిగిందని కెప్టెన్ నర్నర్ తెలియజేశాడు. డివిజను కమాండరు ఆదేశాలననుసరించి ఈ దళం అంటరాష్ట్ర ఫ్యూరర్ (ఎస్. ఎస్. లెఫ్టినెంట్) అల్ఫెన్‌జెర్గ్ నాయకత్వాన అన్వేషణాకార్య క్రమం సాగిస్తుంది. అడవికి ఒక ప్రక్కగా ఒంటరిగా ఇల్లు కన్పించింది. చాలామంది లోనికి వెళ్లారు, కాని ఏమీ దొరకలేదు. అంటరాష్టర్మ ఫ్యూరర్ జాగ్రత్తవలన కష్టం మీద భూతాల జాడ కనిపెట్టిన శ్రేయస్సు ఆయనకే దక్కింది. అవును, వాళ్లంతా అక్కడేవున్నారు. కాని దురదృష్టవశాత్తు అల్ఫెన్‌బర్గు దళంమీద చేతిబాంబుల వర్షం కురిపించి అంటరాష్టర్మతో సహా ఏడుగుర్ని హత్యచేసి భూతాలు పారిపోగలిగాయి. కాని ప్రతి జిల్లా యూనిట్‌కు అపాయ సూచనలు

పంప బడ్డాయి. భూతాల్ని పట్టుకుంటానికి కట్టు దిట్టమైన ఏర్పాట్లు గావించ బడ్డాయి. కనుక వాళ్లు పట్టుబడనన్నా వచ్చు లేదా చంపివేయ బడవచ్చునని ఆశిస్తున్నాము. మరొక విషయం, దొంగలలో ఒకడు మన సైనికులకు చిక్కాడు—బ్రతికిమాత్రం గాదు, దురదృష్టవశాత్తు శవావస్థలోదొరికాడు.

కొంచెంసేపు ఆలోచించి హీల్ తనకారును తెమ్మని ఆజ్ఞాపించి టాంకుల రక్షణతో ఘటనాస్థలానికిబయ దేలురాడు.

అడవికి చివర ఒకప్రక్కగా కాలి ధ్వంసమైన ఇంటివద్ద కెప్టెన్ వర్నరూ, ఆచూకీ దళంలోని ఎస్. ఎస్ సైనికులు కలిశారు.

వాళ్ళ నమస్కారాలకు, జవాబీయకుండానే హీల్ హఠానంగా శత్రు శవంవద్దకు వెళ్ళాడు. అతనొక రష్యను, వయస్సు 23 కంటే ఎక్కువవుండదు, బంగారురంగు జుత్తు, విశాలమైన పెద్ద కళ్ళు గ్రూపెన్‌ఫ్యూరర్ వంక చూస్తున్నాయి. ఆకుపచ్చని దుస్తుల (సోవియట్ స్కౌటులు ధరించే వెచ్చని దుస్తులు అని గ్రూపెన్‌ఫ్యూరరు నోట్‌చేసుకున్నాడు) క్రింద సోవియట్ సైన్యపు బూడిదరంగు కోటువుంది. దానిమీద జూనియరు సార్జెంటు పట్టీలున్నాయి.

సమీపంలోనే ఎనిమిదిమంది ఎస్. ఎస్ సైనికులు నగు నగా, సైనిక నిరీక్షణకు ఎదురుచూస్తున్నట్లు పడివున్నారు. వారిచేతులు ఎదురొమ్ములమీద పెట్టబడివున్నాయి. ఆ ఎని

మిది మందిలో అయిదుగురు పొట్టివాళ్ళు, బలహీనులుగా వుండటం గ్రూపెన్‌ఫ్యూరరు కోపంగా చూశాడు... వీళ్ళేనా ఎస్. ఎస్ నల్లసైన్యపు సైనికులంటే?

జర్మను సైన్యంలో పెద్దపెద్ద ఆఫీసర్ల మధ్య తానింత భూకంపం జరిపాననేది త్రెవకిన్‌కు తెలియదు. త్రికోణాకారంలో వాళ్ళు తిరిగి వచ్చేటప్పుడు అడుగడుక్కూ ఎస్.ఎస్ సైనికులు వెదుకుతూ వుండటం కన్పించింది. ఒకళ్ళనొకళ్లు పిల్చుకోవటం కూడా విన్పిస్తుంటే వాళ్ళు ప్రాక్టీసు చేస్తున్నారని స్కౌటులు భావించారు. వాళ్ళకు, తమకు మధ్యనున్న సంబంధాన్ని గురించి వారలోచించనేలేదు.

జర్మనుల మధ్య తమ నాల్గవరోజు ప్రయాణంలో మూడవ ఝామున స్కౌటులు ఒంటరిగావున్న ఒక ఇంటి దగ్గరకు చేరుకున్నారు. త్రెవకిన్ తన సహచరులకు విశ్రాంతినిచ్చి, భూమితో సంబధం పెట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు. చాలా జాగ్రత్తగా వుండుటకూ, దూరం నుంచే చుట్టుపట్ల పరకాయించి చూడటాన్కి అనువుగా వుండేందుకు బుగిలిపోయిన మెట్లగుండా పైభాగంలోకి చేరుకున్నారు. ఆనీకానోవ్ బరువుకు ఆమెట్లు విరిగినంతపని జరిగింది.

త్రెవకిన్ తన రేడియో సెట్టును సరిచేసుకుని భూమితో సంకేతాలు కూడాబలుక్కుని సిద్ధంగావున్న సమయంలో అకస్మాత్తుగా బ్రెజనీకోవ్ పిలుపు విన్పించింది. అంతకుముందే అతన్ని పైభాగంలోని రంధ్రంవద్ద కాపలాకు నియమించాడు.

త్రెవకిన్ లేచి ఆకనివద్దకు వెళ్ళి చూశాడు. షుమారు 20మంది ఎస్.ఎస్ సైనికులు నలువైపులనుంచి కమ్ముకుంటూ భవనం సమీపానికి వస్తున్నారు.

త్రెవకిన్ వెంటనే ఈలోపలే గాఢనిద్రలో మునిగిపోయిన తన సహచరుల్ని మేల్కొల్పాడు, కాని క్రిందికి దుమికి పారి పోయే సమయం లభించలేదు. ఎస్.ఎస్. సైనికులు సమీపా నికి వచ్చేశారు. వారిలో నలుగురు ఇంటిలోకి జొరబడ్డారు. అటుఇటు తొంగిచూసి బయటకు వెళ్ళిపోయారు. కాని వెంటనే మరల తిరిగి లోనికి వచ్చారు. వారిలో ఒకడు గొణుగుతూ తిట్టుకుంటూ బుగిలిపోయిన మెట్లపైకి ఎక్కసాగాడు.

రెండు చేతుల్లోనూ రివాల్వర్లు పట్టుకుని ఊపిరి బిగబట్టి త్రెవకిన్ నిలబడి వున్నాడు. పైకప్పుకు ఎక్కువ రంధ్రాలుండ టంవలన పైన వెలుతురుగావుంది. మొదటికంటే ఎక్కువ గంభీర దృష్టితో ఆయన తన సహచరులవంక చూశాడు. వారు చాలా విలక్షణమైన దృశ్యాలుగా కన్పించారు. అలసిపోయి కళ్లు లోతుకు పీక్కుపోయి, గడ్డాలు పెరిగి–వారు మృత్యువుతో పోరాడ టానికి సంసిద్ధంగా నిలబడివున్నారు. బుగిలిపోయిన మెట్లు కిర్రుమన్నాయి, జర్మనీవాడు నెమ్మదిగా తిట్టాడు.

భయంకరమైన శబ్దం. ఆనీకానోవ్ పైకప్పులోని ఒక రంధ్రం ద్వారా వలయంగా నిలబడివున్న ఎస్.ఎస్. సైనికుల మీద ఒక జర్మను విధ్వంసక బాంబు విసిరాడు. సరిగ్గా అదే సమయంలో పైకివచ్చిన జర్మనువాడి తలను బ్రెజనీకోవ్

టామీగన్‌తో పగుల గొట్టాడు, తన సహచరులతో కూడా అతను వాసాలు, దుమ్ము మేఘాలలో క్రిందికి దుమికాడు.

కనురెప్ప వేసేలోపు త్రెవకిన్ స్కౌటులకుండే నేర్పుతో ఆనీకానోవ్ అభిప్రాయం గ్రహించాడు—బయట నిలబడివున్న జర్మనులమీద చేతిబాంబు వేసి వెనక్కి పోవటానికి మార్గం ఏర్పరిచాడు. భవనం లోపలవున్న ముగ్గురు ఎస్.ఎస్‌వాళ్లతో పోట్లాడటం తేలికే- ఆ ప్రేలుడుతో భయపడి జరిగిన పరిస్థితు లేమిటో వాళ్లకు తలాతోకాఏమీ అర్థంకాలేదు.

మరు క్షణానికే స్కౌటులు ఒకగంధ మాఘినీ వృక్షాల గుబురులోకి జేరుకున్నారు—జర్మనుల కేకలు, గుండ్ల వర్షం ఆలస్యంగా విసిరిన బాంబులు వారిని తరుముతున్నాయి. బ్రెజనీకోవ్ తమవెనుక లేడనేది మొదట త్రెవకిన్ ఆలోచించనే లేదు. ఆనీకానోవ్, స్నేమియోనోవ్ గాయపడ్డారని కూడా తెలియదు. పారిపోయేటప్పుడు త్రోవలో ఆనీకానోవ్ రొప్పుతూ బ్రెజనీకోవ్ విషయం చెప్పాడు. ఆ భవనంనుంచి బయటకు వచ్చే టప్పుడు బ్రెజనీకోవ్ పడిపోవటం మాత్రం తానుచూశాడు.

వారిని తరమటం ఆగిపోలేదు. నలువైపులనుంచీ తరుము తున్నట్లనిపిస్తుంది. ఆ కేకలు, గుండ్ల మోతలు అడవంతా ప్రతిధ్వనిస్తున్నాయి. తరువాత కుక్కలు మొరగటం వినిపించింది. ఇంతలో కుడివైపునుంచి మోటారు సైకిళ్ల మోత వినిపించింది. వీపుమీద గాయం తగిలిన ఆనీకానోవ్ బాధగా రొప్పు

తున్నాడు. సెమియోనోవ్ కుంటటం అడుగడుగుకూ ఎక్కువ కాజొచ్చింది.

వర్షంతో కడిగిన అడవి సువాసనలు విరజిమ్ముతుంది. తడినేలమీదపడ్డ ఆకులు, గడ్డి చలికాలంలో వుండే తాజా తనాన్ని కోల్పోయాయి. నిజమైన వసంతం వచ్చింది. వర్షంతో కడగ బడినటువంటి ఒక మధురమైన గాలివూపు ఆకుల్ని ఉయ్యాల లూపుతుంది, వసంతంలోని తియ్యని సంగీతాన్ని విన్పిస్తుంది.

తరుముతున్న కేకలు ఆగిపోయాయి. త్వరత్వరగా గాయాలకు పట్టీలు వేయబడ్డాయి. మమోంచికిన్ తన చివరి సీసాను ముందు జేబులోనుంచి తీసి ఊపాడు. ఇంకా కొద్ది బొట్లువున్నాయి. ఆతనాసీసాను ఆనీకానోవ్‌కు అందించాడు.

బాయ్‌కోవ్ వీపుమీద వున్న ట్రాంసు మీటరు గుళ్ల దెబ్బలతో ధ్వంసమైపోయింది. అన్నీ తూట్లే. అది బాయ్‌కోవ్ ప్రాణాల్ని రక్షించింది, కాని అదెందుకూ పనికి రాలేదు. బాయ్‌కోవ్ దాన్ని తన టామీగన్ మడమతో చితగ్గొట్టి ముక్కలు చెల్లాచెదురుగా గుబురుల్లో విర జిమ్మాడు.

వారు తాగిన వాళ్లవలె తూలుతూ నెమ్మదినెమ్మదిగా ముందుకు సాగారు.

త్రెవకిన్ వెనుక నడుస్తున్న మమోంచికిన్ ఉన్నట్లుండి——

"కామ్రేడ్ లెఫ్టినెంట్! నేను మిమ్మల్ని క్షమార్పణ వేడు కుంటున్నాను," అని అన్నాడు.

మాటిమాటికి తన ఎదురొమ్ముపై గుద్దుకుంటూ, బహుశా ఏడుస్తూకూడా—చీకటిగా వుండటంవలన స్పష్టంగా చెప్పలేము—నెమ్మదిగా ఏడ్పు గొంతుతో చెప్పాడు:

"ఇదంతా నాతప్పే. అంతానాదే. ఆ రెండు గుర్రాలను నేను తిరిగి గ్రామంలో ఒప్పగించలేదు. వాటిని నేను తినుబండారాలకు బాడుగకిచ్చాను....."

త్రెవకిన్ ఏమీ మాట్లాడలేదు.

"కామ్రేడ్ లెఫ్టినెంట్! నన్ను క్షమించండి. ఒకవేళ నేను సురక్షితంగా తిరిగి వెళ్లగలిగితే....."

"ఒకవేళ నీవు సురక్షితంగా వెళ్ల గలిగితే నిన్ను మోసగాళ్ల పట్లన్‌లోనికి పంపిస్తారు," అని త్రెవకిన్ అన్నాడు.

"నేను వెళ్తాను. సంతోషంగా వెళ్తాను. మీరిదే అంటారని కూడా నాకు తెలుసు: ఏది ఎలా జరిగినా మీరిదే అంటారని కూడా నాకు తెలుసు," అని మమోచికిన్ త్రెవకిన్‌ను ప్రశంశిస్తూ బిగ్గరగా అరిచాడు.

అర్థంగాని కృతజ్ఞత, ఆత్మ వైశాల్యపు కంగారులో త్రెవకిన్ చెయ్యి గట్టిగా నొక్కాడు.

తరుముకుంటూ వస్తున్న జర్మనుల కేకలు వాళ్ళ ప్రక్కనే వినిపించాయి. వాళ్ళు నేలకంటా కరుచుకుపోయారు. రెండు కవచధారి శకటాలు గడగడమంటూ ముందుకు దాటి వెళ్ళిపోయాయి. తరువాత మరల ప్రశాంతత, వారు మరల ముందుకు సాగారు. అనీకానోవ్ విశాలాకారం ముందు కన్పిస్తుంది. తన బలిష్టమైన బాహువుల్లో చెట్ల కొమ్మల్ని ఒత్తిగిస్తూ ముందుకు నగుస్తున్నాడు. తనను పడగొట్టటానికి ప్రయత్నిస్తున్న ఆఅర్థ చైతాన్యాన్ని అపూర్వమైన ఇచ్ఛాశక్తితో అణిచేస్తూ సాగిపోతున్నాడు.

తన జీవితానుభవాల ద్వారా వచ్చిన గుణపాఠాన్ని, చుట్టూవున్న శాంతిమోసమని గ్రహించివుండవచ్చు. నైకింగ్ ఎస్.ఎస్ గూఢచారి దళమంతనూ, 343వ బాంబుల డివిజను లోని మొదటిదళమూ, రాత్రింబవళ్ళు నడిచి అక్కడకు చేరుకున్నారు; 131వ భూసైన్యంలోని వెనుకనున్న యూనిట్లన్నీ తమకోసం గాలిస్తున్నాయని అతనికి తెలియదనేది నిజమే. విసుగూ విరామం లేకుండా టెలిఫోనులు మ్రోగుతున్నాయనీ, ట్రాంసు మీటర్లు కర్ణకఠోర భాషలో సంకేతాల ద్వారా మాట్లాడు తున్నాయనీ కూడా అతనికి తెలియదు. కాని తరుముతూ వచ్చేవాళ్ళ ఉచ్చులు బిగుస్తున్నాయని మాత్రం అతను గ్రహించాడు.

ప్రతిక్షణమూ శక్తినికూడ బట్టుకుని ముందుకు నడుస్తున్నాడు. వాళ్ళు పారిపోగలుగుతారో లేదోకూడా తెలియదు.

కాని ఇప్పుడు దానికంత మహత్వంలేదు. కాని విశేషమేమిటంటే సోవియట్ సైన్యాలమీద అకస్మాత్తుగా దెబ్బ తీయటాన్కి సమీకరించబడే భయంకర వైకింగ్ డివిజను తుదిక్షణాలు కద నొక్కు కొచ్చాయి. వారిట్రక్కులు, టాంకులు, సైనికుల్ని జేరవేస్తున్న కవచధారి శకటాలు, తళుక్కుమంటూ మెరిసే కళ్లజోళ్ళు ధరించిన ఎస్.ఎస్. సైనికులు, బ్రతికిన పందుల్ని బండిలో తీసుకుపోయే ఆ జర్మనులు, కునికి పాట్లు పడుతూ తినేవాళ్ళు, అరచినట్లు కఠోరంగా గొంతులు పగలదీసుకుని మాట్లాడే, అడవుల్ని మలినంచేస్తున్న ఆ జర్మనులు, హిల్‌లు ములెనులు, క్రైంఫ్‌లు, గరగీజులు, పైకిపోవాలనే కలలుగనే వీళ్లంతా, విధ్వంసం చేయటాన్కి వచ్చిన ఈ సైన్యాలు, ఈ హంతకులు. ఖూనీకోర్లు—వీళ్లంతా ఈ అడవి మార్గాల వెంట తిన్నగా మృత్యుదేవత దగ్గరకు సాగిపోతున్నారు.

మృత్యువుయొక్క ప్రతీకార హస్తాలు ఈ 15 వేల సైన్యాన్ని కబళించటాన్కి సిద్ధంగావున్నవా అన్నట్లుంది. పటలుటాన్కి సిద్ధంగానే వున్నాయి.





'నక్షత్రం' తో సంబంధం పెట్టుకునే ట్రాంసు మీటరు ఒంటరిగావున్న ఒక కందకంలో వుంది. జూనియర్ లెఫ్టినెంట్ మస్ఖరస్కీ రాత్రింబవళ్ళు అక్కడే గడుపుతున్నాడు. అతను ఎక్కువగా నిద్రపోవటం కూడా మానేశాడు. అప్పుడప్పుడు కూర్చునే చేతులమీద తల ఆనించి కన్నుమూసి కలతనిద్ర పోయేవాడు. అప్పుడు కూడా తమ సంభాషణకు అంతరాయం కలిగించే గాలి చప్పుడే వింటూవుండేవాడు. తన విశాలమైన కనురెప్పలు మూస్తూ తెరుస్తూ మేల్కొని, డ్యూటీలో వున్న ఆపరేటర్‌ను పిలిచి "వాళ్ళేమైనా మాట్లాడుతున్నారా?" అని గాబరాగా అడిగేవాడు.

ఆపరేటర్లు మూడు డ్యూటీలుగా పనిచేస్తున్నారు. కాని తన డ్యూటీ ముగిసిన తరువాత కూడా కాత్యా అక్కడినుంచి వెళ్ళేదికాదు. ఆమె అందమైన ముఖం చేతులమీద ఆనించుకుని కూర్చునేది. ఆమె మస్ఖరస్కీ దగ్గరే ఆ ఇరుకుగా వున్న బల్లమీద కూర్చుని నిరీక్షిస్తూ వుండేది. అప్పుడప్పుడు డ్యూటీలో వున్న ఆపరేటర్లతో గట్టిగా వాదించేది; వాళ్ళు నక్షత్రం సంబంధమైన వేవ్ లెంగ్త్ తప్పించారనీ విసుక్కుని వాళ్ళచేతినుంచి స్పీకర్ తీసుకునేది. తరువాత కందకం లోపలనుంచి గౌరవనీయమైన శాంతవచనాలు వినిపించేవి:

"నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం!"

సమీపమందున్న వేవ్ లెంగ్త్‌పై ఎడతెగకుండా జర్మను

బాష గడగడ విన్పిస్తుంది. మరికొంత దూరంలో రాత్రిం బవళ్ళు కడు జాగ్రత్తగా మేల్కొని వున్న శక్తివంతమైన అజేయ మాస్కోనుంచి, సంభాషణలు, పాటలు, వయొలిన్ వాయిద్యం విన్పిస్తున్నాయి.

పగలు చాలా సార్లు డివిజను కమాండరు వచ్చి తిరిగి వెళ్తూ వుండేవాడు. కందకాన్కి, డేరాకు మధ్య నిత్యమూ స్కౌటులు తిరుగాడుతూ వుంటున్నారు. లెఫ్టినెంట్ బుగ్రోవ్ ప్రతిరోజూ వచ్చేవాడు. అప్పుడప్పుడు అతని వెంట మేజర్ మజీజోవ్ కూడా వస్తూవుండేవాడు. కందకంలోని గోడకు ఆనుకుని నిలబడి మౌనంగా ఆపరేటర్ వంక చూస్తూ వుండేవాడు. ఆ విధంగా దాదాపు గంటసేపటి వరకు వుండి వెళ్ళిపోతూ వుండేవాడు.

తరచుగా మేజర్ లిఖాచెవ్ డ్యూటీలోవున్న ఆపరేటర్ పనిని తాను స్వయంగాకూడా చూస్తూ వుండేవాడు. అప్పు డప్పుడు కెప్టెన్ బరాశ్కిన్ లోనికి వచ్చి చిన్నకిటికీవద్ద నిలబడి తన వ్రేళ్లతో టకటక కొడ్తూ వుండేవాడు. ఇంకా తన ప్రసిద్ధ నోటు బుక్ లోని పాటను డేన్సైనా నెమ్మదిగా ఆలా పించేవాడు. ఒకసారి కెప్టెన్ ముస్తాకోవ్, కెప్టెన్ గురోవిచ్ లు కూడా ముందున్న రక్షణ శ్రేణినుంచి అక్కడకు వచ్చారు.

తణికీ ఆఫీసరు కెప్టెన్ యాస్కిన్ కందకంలోకి వచ్చాడు. యాస్కిన్ ముఖమంతా స్ఫోటకపు మచ్చలె-ఉజ్జ్వెత్తుగావున్న లలాటంక్రింద చురుకైన కళ్లు, పిట్టవలె వున్న శాంతమూర్తి.

"గూఢచారి దళ కమాండరు మీరేనా?" అని ఆయన మస్ఫరస్కీ నుద్దేశించి అడిగాడు.

"నేను కార్యభారం వహిస్తున్న కమాండరును."

తణిఖీ అధికారి, రైతుల్నుంచి అన్యాక్రాంతంగా రెండు గుర్రాలను స్వాధీన పర్చుకున్న విషయంలో దానికిసంబధించిన వాళ్లతో మాట్లాడదలచు కున్నానని తెలియ జేశాడు. సంక్షేపంగా విషయాన్నంతా చెప్పి, ఈ చెడుపని వలన స్థానిక ప్రజల్లో సోవియట్ సైనికులు నైతికంగా ఎంత అసహ్యించుకో బడతారో అర్థం చేసుకున్నావా అని మస్ఫరస్కీని ప్రశ్నించాడు.

మస్ఫరస్కీ జవాబుకెదురు చూడకుండానే ఆయన చెప్పుకుపోతున్నాడు—"కనుక నేను ఆస్కాములతో ముఖ్యంగా లెఫ్టినెంట్ త్రెనకిన్, సార్జెంట్ మమోచికిన్‌లను, ఈ అపసవ్యమైన పని జరుగుతున్నప్పుడు అక్కడే వున్నారు గనుక సంజాయిషీ అడగాలి."

"వాళ్ళు ప్రస్తుతం ఇక్కడ లేరు, అని మస్ఫరస్కీ కొంచెం వ్యాకులకతోనే జవాబిచ్చాడు.

"వాళ్లల్లో ఎవరూ లేరా?"

"లేరు."

తణిఖీ ఆఫీసరు ఒక క్షణం ఆలోచించాడు.

"కా(స్నేడ్ కెప్టెన్, వాళ్ళున్న చోటుకే మీరు కూడా వెళ్ళి మాట్లాడితేనే బాగుంటుందనుకుంటాను."

"వాళ్ళెక్కడ వున్నారు?" అని కెప్టెన్ యాస్కిన్ ప్రశ్నించాడు. తణిఖీ ఆఫీసరు కాత్యావంక గంభీరంగా, దృఢ నిశ్చయంతో చూశాడు.

కోపంతో, విజయం పొందిన చిరునవ్వుతోనే ఆమె కూడా జవాబుగా ఆయనవంక చూసింది.

మస్ఛరస్కీ కూడా నవ్వాడు. కాని మరల వెంటనే విషయ గాంభీర్యాన్ని గుర్తించాడు. ఒక వేళ కమాండింగ్ అఫీసరు ఈ వ్యక్తిని జర్మనుల మధ్యకే వెళ్ళి సంజాయిషీ పని పూర్తి చేయవల్సిందిగా ఆ దేశిస్తే ఈయన అక్కడకు కూడా వెళ్తాడు.

మూడవ రోజున 'నక్షత్రం!' మాట్లాడింది—సరిహద్దు దాటిన తరువాత త్రెవకిన్ ఇది రెండవసారి మాట్లాడాడు. సంకేత భాషనువదలి మాటిమాటికి అతను చెప్పిందిదే:

"పంచమ వైకింగ్ ఎస్.ఎస్ టాంకు డివిజను ఇక్కడ సమీకరించ బడుతుంది. 5వ పశ్చిమక్షేత్ర మోటారు రెజిమెంటులోని వాడోకడు వైకింగ్ ఎస్.ఎస్ టాంకు డివిజను ఇక్కడ సమీకరించ బడుతుందని చెప్పాడు."

తరువాత అతను పశ్చిమక్షేత్ర మోటారు రెజిమెంటు నిర్మాణము, డివిజను హెడ్ క్వార్టర్ పరిస్థితులు, ఆ ప్రదే

శాన్ని గురించి చెప్తూ యూనిట్లు నేలయీనినట్లు ప్రవాహంగా వచ్చి దిగు తున్నాయనీ, రాత్రిళ్ళు మాత్రమే ప్రయాణం చేస్తున్నారనీ నొక్కి చెప్పాడు. తరువాత మరల వెనుకటి విషయాన్నే వర్ణించ సాగాడు:—

"పంచమ వైకింగ్ ఎస్.ఎస్ టాంకు డివిజను చాలా రహస్యంగా ఇక్కడ సమీకరించ బడుతుంది......"

త్రెవకిన్ రిపోర్టుతో డివిజనులో గడబిడ బయలుదేరింది. కర్నల్ సర్బిచెంకో సైన్యపు జి.ఒ.సి.కి కర్నల్ సేమియోర్కిన్‌కు స్వయంగా ఫోనుద్వారా చెప్పినప్పుడు హెడ్‌క్వార్టరు సైన్యంలోకూడ సంచలనం బయలుదేరింది.

లెఫ్టినెంట్ కర్నల్ గాలీవ్ సైనికదళాలకూ, సైన్యాలకూ, సమీపమందున్న డివిజనులకు ఫోనుద్వారా జవాబు లివ్వటంతో నిద్రాహారాలుకూడా మర్చిపోయాడు. అతను చలికి వణకటం ఆపేశాడు, గొర్రెతోలు దుస్తుల్ని విప్పి అవతల పారేశాడు. మాట్లాడటాన్కి అతనినోటికి విసుగూ విరామంలేకుండా వుంది. దృఢంగానూ, సంతోషంగానూ కన్పిస్తున్నాడు. "గాలీవ్‌కు హిట్లరు మనుషుల వాసన వేస్తుందిరా!" అని సైనికులు అనుకున్నారు.

పంచమ వైకింగ్ ఎస్. ఎస్ డివిజను సమీకరించు జిల్లా ప్రాంతాన్ని వేలకొలది మ్యాపుల్లో నీలవర్ణపు పెన్సిళ్ళు గుర్తులు పెట్టాయి. సైనిక హెడ్‌క్వార్టరునుంచి ఈరిపోర్టు ప్రధాన

రక్షణ కార్యాలయానికి వెళ్ళింది. అక్కడినుండి మాస్కోలో వున్న ఉన్నతాధికారికి చేరింది.

డివిజను, ఫ్రంటులోవున్న హెడ్‌క్వార్టర్సూ త్రేనకిన్ సూచనలకు చాలా విలువిచ్చాయి. కాని సైనిక ప్రధాన కార్యాలయం ఆసూచనలను మహత్తరమైనవని అంగీకరించి నప్పటికీ, అదినిర్ణయమైందిగాదు. క్రొత్తగావచ్చిన బలాన్ని, ఎస్. ఎస్ సైన్యాల దాడిజరుగుతుందని అనుమానించిన డివిజన్లకు అండగా పంపవలసిందని జి. డి. సి ఆజ్ఞలు జారీచేశాడు. ఆయన తన మిగిలిన సైన్యాన్నికూడా ఆపదరానున్న రంగానికి పంపాడు.

ప్రధానరక్షణ కార్యాలయం పైసూచననుబట్టి క్రొవెల్ జంక్షన్‌లో రాబందులవలె పొంచివున్న జర్మనుల ప్రదేశాలను గ్రహించారు. ప్రధాన యుద్ధకార్యాలయం, ఆప్రాంతానికి సంబంధించినచోట్ల తిరిగి ఆచూకీ తీసి వాటిమీద బాంబులు వేయవలసిందిగా వైమానిక దళానికి ఆజ్ఞలుపంపింది. ఎన్నో టాంకుల, మరఫిరంగుల యూనిట్లను కలిపి ఈ సైన్యాన్ని ఇంకా బలమైందిగానూ, అజేయమైందిగానూ చేశారు.

వైకింగ్ టాంకు డివిజనూ, ఆ అడవిప్రాంతమంతా కలిపినా ఆచిత్రంలో ఎన్నో అంశం: దానినిబట్టి ఉన్నతాధికారులు ఈకుట్ర వెనుక పెద్ద రహస్యమే దాగివుందని గ్రహించారు– ఎదురుదాడులద్వారా జర్మనులు, సోవియట్‌సైన్యాలు

పోలెండువైపుకు పురోగమించకుండా చేయాలని ప్రయత్నం చేస్తున్నారు. దండయాత్ర జరిగేదానికి ఎడమప్రక్క ఎక్కువ బలాన్ని సమీకరించాలనీ. ఒకటాంకు సైన్యమూ, ఒక గుర్రపు దళమూ, అనేక ఫిరంగి డివిజన్లు అక్కడికి తరలించవలసిందిగా ఆదేశాలు వచ్చాయి. ఈరకంగా క్రెమ్లిన్‌కు చుట్టుపట్ల అలలు వ్యాపించసాగాయి, భూమిమీద వ్యాపిస్తూ వ్యాపిస్తూ ఎక్కడో దూరానవున్న మాస్కోనుంచి, బెర్లిన్ వరకూ వ్యాపించాయి.

డివిజనుకు వెంటనే జరిగిన మేలేమిటంటే ఒకటాంకు రెజిమెంటు, రక్షకసైన్యాల రెజిమెంటు ఒకటీ, రాకెట్లు, బాంబులు, సైనికుల, ఇంకా ఇతరఆయుధాల బలంవచ్చి కలిసింది. స్కౌటులకుకూడా సహాయం లభించింది.

మస్కరస్కీ తన అనుచరులతోబాటు పట్టుదలతో, నిలదొక్కుకుని అభ్యాస కార్యక్రమాన్ని ప్రారంభించాడు. సగం సమయాన్ని ముందున్న శత్రువులను కనిపెట్టటానికి వినియోగిస్తున్నాడు. బుగోర్కోవ్, అతని అనుచరులు కలిసి “నిర్జనప్రదేశ” మంతా సొరంగాలు, కందకాలు త్రవ్వేశారు. మేజర్ లిఖాచేవ్ రాత్రింబవళ్లు, కొత్త ట్రాన్సుమీటర్లను, టెలిఫోన్లను, టెలిఫోను తీగెలను జాగ్రత్తగా పరీక్షించటంలో నిమగ్నమైపోయాడు. కర్నల్ సబ్బెంకో తనచోటుకు వెళ్ళి అక్కడినుంచి పరీక్షిస్తూ యూనిట్ల కార్యక్రమాలను నడుపసాగాడు. ఆయనిప్పుడు నవయువకునివలెనూ, చాలా ధైర్యం

గానూ కన్పిస్తున్నాడు— పెద్ద పెద్ద పోరాటాల సమయంలో ఆయన తరచు ఇలాగేవుంటాడు. చాలాసేపటివరకు ఇప్పుడిప్పుడే వచ్చిన పటాలను, వాటిల్లో విస్తులావరకు పోలెండంతా చిత్రించబడివున్నవి- వాటన్నిటినీ చాలా గంభీరంగా జాగ్రత్తగా అధ్యయనం చేశాడు. ఈ దూరప్రదేశాలకు ఆయన 1920 లో బుడయోనీ గుర్రపు దళంలో వెళ్ళి వచ్చాడు.

కాత్యా ఒక్కతే ఒంటరిగా కందకంలోవుంది.

రేడియోలో ఆమె చెప్పిన అంతిమ వాక్యానికి త్రెనకిన్ ఇచ్చిన జవాబుకు అర్థంఏమిటి? "నేను అర్థంచేసుకున్నాను," అనే ఆయన చెప్పింది; అయితే ఆమె విన్నదానికి సామాన్య అర్థమేనా లేక ఆమాటల్లో మరేమైనా రహస్యార్థంవుందా? ఆమె మనస్సంతా ఎక్కువగా దీన్నిగురించే ఆలోచిస్తుంది. భయంకరమైన ఆపదల్లో చిక్కుకొని వుండటంవల్లనే ఆయన సామాన్య మానవుని భావాలకు చేరువగా వచ్చి వుండటం జరిగిందని ఆమె అనుకుంది: లేక రేడియోలో తాను చెప్పిన చివరిమాటలుకూడా ఈ మార్పుకు కారణమైవుండవచ్చు. తన ఆలోచనలకు తన తానే నవ్వుకుంది. సైనికసహాయ డాక్టరు ఉల్వీశేశానుంచి అద్దంతీసుకుని ఒక వీరపత్నివలె వుండుటకు కావల్సిన గాంభీర్యాన్ని, సాహసోపేత భావాలను తనముఖంలో వ్యక్తంచేయటాన్కి చాలా ప్రయత్నించింది- ఈమాటలే ఆమె చాలా బిగ్గరగాకూడా అంది. తిరిగి అద్దంలోచూసి గోలపెడ్తున్న తన హృదయంలోని భావాల ననుసరించి

కోమలంగానూ, సంతోషంతోనూ, విషాదంతోనూ, "నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం!" అని పిలువసాగింది.

చిరస్మరణీయమైన ఆ సంభాషణానంతరం తిరిగి రెండు రోజులకు "నక్షత్రం" జవాబిచ్చింది:

"భూమి! భూమి! మాట్లాడేది నేనే 'నక్షత్రం'ను. నీవు వింటున్నావా? నేనే నక్షత్రంను."

"నక్షత్రం! నక్షత్రం!" అని కాత్యా బిగ్గరగా అరిచింది:-
"నేనే భూమిని. నేను వింటున్నాను; నేను వింటున్నాను."

తన ఆనందంలో భాగంపంచుకునేందుకు మరింకెవరినైనా పిలవాలని ఆమె తలుపు పూర్తిగా తెరిచింది. కాని అక్కడెవరూలేరు. ఆమె పెన్సిలు తీసుకుని వ్రాయటానికి సిద్ధంగా వుంది. కాని ఒకమాట మధ్యలోనే 'నక్షత్రం' కంఠం ఆగిపోయింది, ఏమీ మాట్లాడలేదు. కాత్యా రాత్రంతా మేల్కొనేవుంది, కాని 'నక్షత్రం' ఏమీ మాట్లాడనేలేదు.

'నక్షత్రం!' మరుసటిరోజు, ఆతరువాత ఎన్నిరోజులైనా మౌనమే వహించింది. మధ్యమధ్య మస్కరెన్కో వస్తూవుండేవాడు, అప్పుడప్పుడు బుగోర్కెన్, మేజరు లిఖాచేవ్, ఉద్యోగంనుంచి తొలగించబడిన బాస్కిన్ స్థానంలో గూఢచారిదళ ముఖ్యుడుగా వచ్చిన కెప్టెన్ యార్కవిచ్ మొదలైన వాళ్ళంతాకూడా వస్తూనేవున్నారు, కాని 'నక్షత్రం' మౌనం తప్ప ఏమీ మాట్లాడలేదు.

రోజురోజంతా కాత్యా రిసీవర్లు చెవులకు తగిలించుకుని

కునికిపాట్లుపడుతూ అలాగే కూర్చునివుండేది. విచిత్రమైన ఊహాలు, అతివిచిత్రమైన స్వప్నాలు వస్తూవుండేవి- ఆకు పచ్చని దుస్తులు ధరించిన పసుపుపచ్చని త్రెవకిన్, మంచువలె తెల్లని చిరునవ్వులు కురిపించే మమోంచికిన్— ఆమెసోదరుడు లియోన్యాకూడా ఆకుపచ్చని దుస్తులు ధరించినట్లు కన్పించేదు. మరల తాను త్రెవకిన్ చెప్పేది వినలేనేమోనని భయంతో కంపిస్తూ లేచి కూర్చుని బిగ్గరగా పిలుస్తూవుండేది:

"నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం! నక్షత్రం!"

దూరంగా ఫిరంగుల రణ గర్జన విన్పించిందు—ప్రారంభ మవుతున్న రణ గర్జన. ఈ కఠిన సమయంలో మేజర్ లిఖాషేవ్‌కు ఎంతమంది రేడియో ఆపరేటర్లయినా చాలా అవుసరం, కాని ఆయనకు కాత్యాను ఆ నిరీక్షణనుంచి కదలించ టానికి మనసొప్పలేదు. ఈ ప్రకారంగా దాదాపు మరచిన దాని వలె కాత్యా వంటరిగా ఆ కందకంలోనే వుండిపోయింది.

చాలా రాత్రిగడిచిపోయిన తరువాత ఒక్కరోజున బంగోరోక్కవ్ వచ్చాడు. అతను త్రెవకిన్‌పేర అతని తల్లి వ్రాసిన ఉత్తరమొకటి తెచ్చాడు. అది ఇంతకుముందే అక్క డకు వచ్చింది. అతనితల్లి వ్రాసిన ఉత్తరంలో ఈవిధంగా వుంది:—

నీకు అత్యంతప్రియమైన భౌతికశాస్త్ర సంబంధమైన నోటు బుక్కు దొరికింది. దీనిని నేను జాగ్రత్తగా భద్రపరు స్తాను. నీవు తిరిగివచ్చి కాలేజీలో చేరినప్పుడు నీకిది చాలా

ఉపయోగపడుంది. నోట్ బుక్ చాలా గొప్పది, దానిని నిజంగా పాఠ్యపుస్తకంగా ముద్రించవచ్చుకూడా— విద్యుచ్ఛక్తి, వేడిమి అధ్యాయాలు చాలా పరిశుద్ధంగా వ్రాయబడ్డాయి. ఉత్తమంగాకూడా వున్నాయి. నీకు విజ్ఞాన శాస్త్రం ఎడ ప్రత్యేక ఆసక్తి వున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. మరొకవిషయం, నీవు పన్నెండుసంవత్సరాల వయస్సులో తయారుచేసిన నూతి గిలకసంగతి గుర్తుందా ? దానికి సంబంధించిన ప్లాను కాగితాలు నాకు దొరికాయి. వాటిని చూసి క్లావా పిన్నీ, నేనూ ఎంతో నవ్వుకున్నాం."

బుగ్రోర్కోవ్ ఉత్తరం బిగ్గరగా చదివాడు. తరువాత అతను రేడియోపైకి వంగి, సుద్ధకఠంతో ఈ విధంగా అన్నాడు:

"యుద్ధం త్వరగా ముగిసే ఎంత బాగుంటుంది....కాదు, నేను అలసిపోయి మాత్రం లేను. నేను అలసిపోయానని నేననటం లేదు కాని ప్రజల హత్య ఇంతటితో ఆగిపోవాలి."

బహుశా ఇక్కడ తన నిరీక్షణ. 'నక్షత్రం' కోసం అనంతమైన తన పిలుపు వ్యర్థమౌతాయోనని కాత్యా అకస్మాత్తుగా భయంగా అనుకుంది. 'నక్షత్రం' అస్తమించింది, రాలిపోయింది.

కాని ఆమె ఎలా వెళ్ళగలుగుతుంది? ఒక వేళ ఆయన తిరిగి మాట్లాడితే? ఆయన ఎక్కడైనా అడవిలో దాగివుండి వుండవచ్చు.

ఆశతోను, వజ్రం వంటి ధృడత్వంతోనూ ఆమె నిరీక్షిస్తూనేవుంది. ఇక అక్కడ మరెవ్వరూ నిరీక్షించటంలేదు. —ఆమె ఒక్కతె మాత్రమే వుంది. అక్కడినుంచి బయలు దేరి వెళ్ళటాన్కి సన్నద్ధమయేవరకూ ఆ యంత్రాన్ని అక్కడి నుంచి కదిలించటాన్కి ఎవరూ సాహసించలేదు.

# సమాప్తి.



1944వ సంవత్సరం గ్రీష్మ ఋతువులో సోవియటు సైన్యాలు తిరోగమించుచున్న జర్మను సైన్యాల అటకాయింపులను కాలరాయుచు పోలెండు భూభాగంలో ముందుకు సాగి పోతున్నాయి.

మేజర్ జనరల్ సర్చెంకో తన జీపుమీద ఒక గూఢచారి దళంవద్దకు వచ్చాడు. ఒకరివెనుక ఒకరుగా వాళ్ళంతా తమ ఆకుపచ్చని యూనిఫారాల్లో ముందుకు నడుస్తున్నారు—చురుకుగా, జాగ్రత్తగా, ఏక్షణంలోనైనా అవసరమైతే ప్రశాంతమైన పొలాల్లో, అడవుల్లో, మిట్టపల్లాల్లో, చంచలమైన సాయం సమయపు నీడల్లో కలిసి పోవటాన్కి, సిద్ధంగా నడుస్తున్నారు.

లెఫ్టినెంట్ మస్భరస్కీ ఆ గూఢచారి దళ నాయకుడు! ఆయన గుర్తించాడు. ఎప్పటివలె స్కౌటుల్ని చూడగానే సంతోషంతో ఆయన ముఖం విప్పారింది. వెంటనే జీపు ఆపాడు.

"అజేయులైన వీరులారా! వార్సా దగ్గరలోనే వుంది బెర్లిన్ 500 కిలోమీటర్ల (316 మైళ్ళ 2ఫర్లాంగులు) దూరమాత్రమేవుంది. ఇక కొద్ది నిముషాల్లో వుంది, త్వరలో మనం అక్కడికి చేరుకుంటాం."

ఆయన ఈమాటలు చెప్పి ఒకసారి స్కౌటుల వంక పరికించి చూశాడు. దుఃఖ పూరితమైన ఏదో స్మృతి ఆయన్ను కలత పర్చింది. ఏదో చెప్పాలని చాలా ప్రయాస పడ్డాడు కాని తనను తాను సంభాళించుకుని చేతులు వూపుతూ:— " శలవు కామ్రేడ్స్! " అని మాత్రమే అనగలిగాడు.

జీపు వెళ్ళిపోయింది. ఒక్క క్షణం ఆగి స్కౌటులు కూడా తమ ప్రయాణాన్ని కొనసాగించారు.

—* సమాప్తం.*—



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AA102A138 | Date | 25/09/21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 181 | | |
| Missing Pages | 1to2 | | |
| Prepared | Lakshmi | Scanned | K. Amratha |
| BOOK SIZE | H 7.0 W 4.7 | Pages | 184 |

